# చరకసంహిత - కల్పస్థానము

మూలము మరియు

చక్రపాణి వ్యాఖ్యలకు తెలుగు అనువాదము


కె. నిష్టేశ్వర్ M.D (Ay). D.Sc.,

Lecturer, Dr. N.R.S. Govt. Ayurvedic College, Vijayawada



ఆం.ప్ర. ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్‌మెంట్ ట్రస్ట్

హైదరాబాద్

Charakasamhita - Kalpastanam

by

Dı. K. Nishteswar



Published by :

A. P. Ayurvedıc Literature Improvement Trust,

Hyderabad.

Fist Edıtion · Feb., 92

Price Rs. 60/-



for Copıes :

Dr. Y. Krıshna Manohar

Member A.P. Ayurvedic Literature Improvement Trust

Prop : Indain Remedıes

18.4.54 2nd Lane

Kedareswarpet

Vıjayawada-3

Prınted at :

Nagendra Press

Suryaraopet

Vijayawada-2



డా॥ వై. సూర్యనారాయణరావు, L I. M
(1906-1980)
వ్యవస్థాపకులు మరియు ప్రధమ అధ్యక్షులు
ఆం. ప్ర. ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి ట్రస్ట్



శ్రీ బి. అరవిందరెడ్డి, I. A S,
అధ్యక్షులు
ఆం. ప్ర. ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి ట్రస్ట్
మరియు
సంచాలకులు: భారతీయ వైద్య & హోమియోపతి శాఖ, ఆం. ప్ర. ప్రభుత్వం

# ముందుమాట

దేశీయ వైద్యశాఖ ఆధ్వర్యంలో మూడు ఆయుర్వేద కళాశాలలు మరియు తిరుమల తిరుపతి దేవస్థానము ఆధ్వర్యంలో ఒక ఆయుర్వేద కళాశాల నడుపబడు చున్నవి. ఈ కళాశాలలన్నియు ఆరోగ్య విశ్వవిద్యాలయమునకు (యు. హెచ్. యస్.) అనుబంధము చేయబడియున్నవి. ఈ కళాశాలలో సి.సి.ఐ.యమ్. న్యూ ఢిల్లీవారు సూచించిన పాఠ్యక్రమమును బోధించుచున్నారు. ఆ పాఠ్యక్రమములో చరకసంహిత ఒకటి. తెలుగులో చరకసంహిత ముద్రణ చాలా రోజుల నుండి జరుగలేదు. ఇపుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు రచయితలను ప్రోత్సహించి, వారికి పారితోషికము యిచ్చి తెలుగులో అనువాదము చేయించినారు. ఆ గ్రంథముల ముద్రణను ఆంధ్ర ప్రదేశ్ ఆయుర్వేద లిటరేచర్ ఇంప్రూవ్‌మెంటు ట్రస్టు చేపట్టినది. అట్టివాటిలో చరకసంహిత ఒకటి. అందులో 8 స్థానములను విడివిడిగా ముద్రణ గావించు చున్నాము.

ఈ గ్రంథమును అనువాదము చేసిన రచయిత డా. కె. నిత్యేశ్వర్‌గారికి నా ధన్యవాదములు. నాతో సహకరించి, అతిత్వరలో ముద్రణకు తోడ్పడిన ఇతర ట్రస్టు మెంబర్లకు కూడా నా ధన్యవాదములు.

బి. అరవిందరెడ్డి

సంచాలకులు

భారతీయ వైద్యం మరియు హోమియోపతి శాఖ

ఆం. ప్ర. ప్రభుత్వం

ఛైర్మన్,

ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్‌మెంటు ట్రస్టు.

హైద్రాబాదు,

తేది : 24-1-1992.

# అభిప్రాయము

ఆయుర్వేద గ్రంథములలో చరకసంహిత అత్యంత ప్రధానమైనది. బృహత్రయములోని మొదటి గ్రంథమైన చరకసంహితకు ఆయుర్వేద పార్యగ్రంథములలో అత్యంత ప్రాధాన్యత గలదు. అట్టి చరకసంహితను తెలుగులో అనువాదము (చక్రపాణి టీకాతో సహా) చేయించుటకు మేము నిర్ణయించాము. గ్రంథములోని అన్ని స్థానములను ఒక్క రచయిత వ్రాయడము సాధ్యమైనది కాదనియు, అట్లు వ్రాయగలిగినా చాలా సమయముతో కూడినదని, ఒక్కొక్క స్థానాన్ని ఒక్కో రచయితకు, కొన్ని పెద్ద స్థానములైన సూత్ర, చికిత్స స్థానములను ఇద్దరు లేక ముగ్గురు రచయితలకు కేటాయించి వ్రాయించాము. అట్టి గ్రంథములను ఆయుర్వేద లిటరేచర్ ఇంప్రూవ్‌మెంటు ట్రస్టు తరపున ముద్రింపతలచినాము. మొట్టమొదటిసారి మా యీ ప్రయత్నములో ఏమైనా లోపములున్న, విద్వాంసులు తెలియపరచినచో, వచ్చే గ్రంథములలో సరిచేయగలము.

మా ఆయుర్వేద లిటరేచర్ ఇంప్రూవ్‌మెంటు ట్రస్టు ఛైర్‌మెన్‌గా శ్రీ వి. అరవిందరెడ్డి, ఐ.ఏ.యస్.గారు 13-11-1991 నుండి పదవి స్వీకరించారు. వారు యువకులు, ఉత్సాహవంతులు, సమయస్ఫూర్తి గల అధికారి. వారు దేశీయ వైద్య శాఖకు సంచాలకులుగా వచ్చినప్పటి నుంచి అనేక అభివృద్ధి చర్యలు చేపట్టినారు. వారి నేతృత్వములో, అచ్చుకొరకు వేచిపున్న మిగతా గ్రంథములన్నియు వెలుగులోకి రాగలవని ఆశిస్తున్నాను. ఈ బృహత్కార్యములో తోడ్పడిన మిత్రులకు, అధికారులకు, రచయితలకు, ట్రస్టుమెంబర్లకు నా ధన్యవాదములు. ప్రస్తుత గ్రంథమును డా. కె. నిష్టేశ్వర్ వ్రాసినారు. వారికి నా ధన్యవాదములు.

పి. శేషిరెడ్డి
జి.సి.ఐ.యం., డి.యం.యస్ , హెచ్.పి.ఏ.
అదనపు సంచాలకులు
ఆయుర్వేద, దేశీయ వైద్యము, హోమియోపతి శాఖ,
హైదరాబాదు.

హైదరాబాదు,
తేది : 24-1-1992

# ప్రకాశకుల మాట

దక్షిణ భారతదేశం మొత్తంమీద ఒక మాతృభాషలో ఆయుర్వేద పాఠ్య గ్రంథములు పూర్తిగా ముద్రింపబడలేదు. ఉత్తర భారతదేశంలో మాత్రమే హిందీ భాషలో ఈ విధంగా ఆ పాఠ్యగ్రంథములు పూర్తి చేయబడినవి. కాని ఇంత త్వరగా మాత్రము కాదు.

లోగడ ఆయుర్వేద గ్రంథములు ముద్రణలో విశేషముగా కృషి చేసినవారు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు & సన్స్ వారి సేవ కొనియాడదగినది. తెలుగులో ఆయుర్వేద గ్రంథములు అభివృద్ధి చేయాలనే సత్‌సంకల్పముతో ఆంధ్రప్రదేశ్ ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్‌మెంట్ ట్రస్టును కీ. శే. డా. వై. సూర్య నారాయణగారు స్థాపించిరి.

అయితే ఈ ట్రస్టును పూర్తిగా సద్వినియోగం చేసుకొని ఇటు ఉపాధ్యాయులకు అటు విద్యార్థులకు కూడా ఉపయోగపడునట్లుగా పాఠ్యగ్రంథములను తెలుగులో వ్రాయించి అచ్చు వేయించిన ఘనత, కీర్తి అప్పటి సంచాలకులు శ్రీ యస్.వి.హెచ్. శాస్త్రి I.A.S. గారికి దక్కుతుంది. ఇప్పటి పాఠ్యగ్రంథములకు కొరత లేని తనము వారి విశేష కృషి ఫలితమే.

తర్వాత వచ్చిన సంచాలకులు శ్రీ ఆర్. రామచంద్ర I.A.S. అంతే స్ఫూర్తితో మిగిలిన పాఠ్యగ్రంథములను పూర్తి చేయించారు.

ఇప్పుడు జరుగుతున్న చరకసంహిత ముద్రణ కృషి, ఈ ట్రస్ట్‌కి కలికితురాయి వంటిది. చక్రపాణి వ్యాఖ్యలను ఎంతో జాగ్రత్తగా అనువదించారు రచయితలు.

శ్రీ V. రంగాచార్యులుగారు, ఆయుర్వేదములో నిష్ణాతులు చరకసంహితను తెలుగులో అనువదించుటలో వీరు తమ అమూల్యమైన సలహాలను అందించిరి. వారికి మా ఆం. ప్ర. ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి ట్రస్ట్ బోర్డు తరఫున కృతజ్ఞతలు అందించుచున్నాము.

చైర్మన్ & ట్రస్ట్ సభ్యులు

# ప్రస్తావన

ఆత్రేయ మహర్షి శిష్యుడైన అగ్నివేశుడు, గురువు వలన ఉపదేశము పొంది కాయ చికిత్సా ప్రధానమైన ఒక తన్త్రమును రచించి దానికి "అగ్నివేశతన్త్రము" అని పేరు పెట్టెను. కాలాంతరమున విశాలబుద్ధియగు చరక మహర్షిచే ప్రతిసంస్కరింపబడుట వలన అదియే "చరకసంహిత"గా ప్రసిద్ధి పొందెను. చరకసంహిత సూత్ర - నిదాన - విమాన -శారీర - ఇంద్రియ - చికిత్స - కల్ప - సిద్ధి స్థానములను ఎనిమిది స్థానములచే విభజింపబడినది. తరువాత కాలమున ఇట్టి చరక సంస్కృతమైన తన్త్రమందలి విషయములు మూడవవంతు లుప్తమయ్యెను. అపుడు పంచనదపుర వాస్తవ్యుడైన దృఢబలుడు చరకసంహితమున లోపించిన గ్రంథ శేషమును పూర్తి చేయదలచి భూతపతియైన శంకరుని అనుగ్రహమును పొంది సుశ్రుత, విదేహాది తన్త్రములందు చర్చించబడిన విషయముల ఆధారముగా సిలఉఞ్ఛ వ్యాపారముచే (పరిగయేరు విధముగ) లుప్త విషయములను పూరించెను. అందు చికిత్సా స్థానమున పదిహేడు అధ్యాయములు, కల్ప, సిద్ధి స్థానము (12+12 = 24 అధ్యాయములను) లను కలిపి మొత్తము 41 అధ్యాయములను పూరించెను.

శోధనము, శమనము అను భేదముచేత చికిత్స రెండు విధములు. మిథ్యాహార విహారాదులచే ప్రకుపితములైన దోషములను ఆయా దోషములకు సమీపమునందు గల మార్గములనుండి బైట వెడలింపచేయుటను శోధనమందురు. ప్రకుపితములైన దోషములకు బైట వెడలింపకయే సమస్థితికి తెచ్చి సమస్థితిలోనుండు దోషములను ప్రకోపింపచేయక ధాతుసామ్యరూపమైన ఆరోగ్యమును గల్గించు దానిని శమన చికిత్స అందురు. వమన - విరేచన - ఆస్థాపన - అనువాసన - నశ్యకర్మ భేదములచే శోధనము అయిదు విధములుగా పేర్కొనబడి తన్త్రకారులచే పంచకర్మలని వ్యవహరింపబడినవి. అందు కఫ ప్రధానమైన వ్యాధులందు వమన రూపమైన శోధనము, పిత్త ప్రధానమైన రోగములందు విరేచనకర్మ ఉపయోగింపబడును. అట్టి వమన, విరేచనకర్మల నుపయుక్తమగు ప్రధాన ద్రవ్యములను వేరు వేరుగా విభజించి, వాని ఫలమూలాదులను సంస్కారాది విశేషములచే కల్పనలు చేసి 355 వమనౌషధ యోగములను, 245 విరేచనౌషధ యోగములను చరకసంహితయందలి స్థానమున వివరించబడినవి.

సుశ్రుతుడు కల్పస్థానమున అగదతన్త్రి విషయములు చర్చించినప్పటికీ వమన-విరేచన ఔషధములు, ఆ ప్రక్రియల విధానము సూత్రస్థానము (39 అధ్యాయము), చికిత్సాస్థానము (33 అధ్యాయము)నందు విపులముగా వర్ణించెను. చరకుడు ఆరు ప్రధాన ద్రవ్యములు వమనకర్మకు, తొమ్మిది ప్రధాన ద్రవ్యములు విరేచన కర్మకు పేర్కొనగా సుశ్రుతుడు 23 వమన ద్రవ్యములు, 31 విరేచన ద్రవ్యములను ఉల్లేఖించెను. అశ్వగంధా, విడంగ, పిప్పలీ మొదలగు ద్రవ్యములకు ఊర్ధ్వభాగహరత్వము: చిత్రకము, అపామార్గ మొదలగు ద్రవ్యములకు అధోభాగహరకర్మల నుద హరించడము గమనార్హము. ఆరగ్వధ పత్రములు కూడా విరేచన కర్మకుపయోగించ వచ్చునని (పూతీకారగ్వధయోః పత్రాణి) సుశ్రుతుడు పేర్కొనెను. "కమ్పిల్లక ఫల రజః" అనుచూ కాయమీదనూగును ప్రయోజ్యాంగముగా పేర్కొనెను. ఈ వమన, విరేచనౌషధములు వ్యాధి, అగ్ని, రోగి బలానుసారము మధ్యమ మాత్రలో అనగా క్వాథ్యమైనచో ఒక అంజలి (4 పలములు) ప్రమాణమున, చూర్ణమును ఒక బిడాల పదక (1 తులము) ప్రమాణములోను, కల్కమును ఒక అక్ష (1 తులము) ప్రమాణములోను సేవించవలెనని సాధారణ పరిభాషను సుశ్రుతుడు ఉల్లేఖించెను.

అష్టాంగ హృదయ కల్పస్థానమున ప్రథమ, ద్వితీయ అధ్యాయములందు వమన, విరేచన ఔషధములు, వాని కల్పనలు వివరింపబడినవి. "వమనే మదనం శ్రేష్ఠం, త్రివృన్మూలం విరేచనే" అనుచు వాగ్భటుడు వమన ద్రవ్యములందు మదన ఫలమునను, విరేచన ద్రవ్యములందు త్రివృత్‌నకు శ్రేష్ఠత్వము అపాదించెను. చరకుడుదహరించిన ద్రవ్యములనే పేర్కొనుచూ విరేచన ద్రవ్యములందు "హరీతకీ మపిత్రివృద్విధానేనోపకల్పయేత్" అని హరీతకీతో కల్పనలను వివరించెను.

చరకసంహిత కల్పస్థానముయొక్క ఈ తెలుగు అనువాదము ఆచార్య శ్రీ యాదవజీ త్రికమజీగారు సంస్కరించి నిర్ణయసాగర్ ప్రెస్ ద్వారా ముద్రించబడిన గ్రంథము ఆధారంగా రచింపబడినది. చరకసంహిత కల్పస్థానమందలి సూత్రములను చక్రపాణికృత ఆయుర్వేదదీపిక వ్యాఖ్యను తెలుగు భాషలోకి అనువదించమని ఆదేశించిన శ్రీ N.V.H. శాస్త్రి, మాజీ సంచాలకులు, ఇండియన్ మెడిసిన్&హోమియో పతిశాఖవారికి, అవకాశమిచ్చి ప్రోత్సహించిన శ్రీ డా. పి. శేషిరెడ్డి, అదనపు సంచాలకులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. అనువాదము చేయునపుడు సందర్భానుసారము సూచనలిచ్చి మార్గదర్శనం చేసిన నా గురువర్యులు, నిస్స్వార్థ, నిర్విరామ సంస్కృత భాషా ప్రచారకులు శ్రీ ఉపద్రష్ట వేంకట కృష్ణయ్యగారికి,

మరియు మహామహోపాధ్యాయ, ఆయుర్వేదాచార్య శ్రీ డా. ఆతీ సత్యనారాయణ శాస్త్రిగార్లకు నా హృదయపూర్వక వందనములు. మైత్రే ముహూర్తవిషయమున తమ తమ అభిప్రాయములనిచ్చిన ప్రఖ్యాత జ్యోతిషశాస్త్రవేత్త శ్రీ పేరూరుశర్మ, వైద్య వాచస్పతి శ్రీ డా. ప్రకాశచంద్రశతపథిగార్లకు నా ప్రత్యేక కృతజ్ఞతలు. ఈ గ్రంథ రచనను కొనసాగించుటకు నాకు స్ఫూర్తినిచ్చి ప్రోత్సహించిన నా మిత్రుడు శ్రీ డా. యమ్. యల్. నాయుడుగార్కి నా ప్రత్యేక ధన్యవాదాలు. పలు విషయములను చర్చించి తగిన సలహాలనిచ్చిన నా మిత్రుడు శ్రీ డా. పావులూరి హిమసాగర్ చంద్ర మూర్తికి నా ప్రత్యేకధన్యవాదాలు. ఆయుర్వేదముల గ్రంథాలను తెలుగు భాషలో అచ్చు వేయుటను బృహత్తరకార్యక్రమాన్ని చేపట్టిన ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి సంస్థ ప్రస్తుత అధ్యక్షులు శ్రీ బి. అరవిందరెడ్డిగార్కి, ఆ సంస్థ సభ్యులు శ్రీ డా. డి.యల్. నారాయణ (సెంట్రల్ కౌన్సిల్ మెంబరు, శ్రీ డా. వై. కృష్ణమనోహర్‌గార్లకు నా హృదయపూర్వక ధన్యవాదాలు. ముద్రణయందు సహకరించిన శ్రీ జి. బాబూరావు, నాగేంద్రప్రెస్, విజయవాడ గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

అనువాదములో ఏమైన తేడాలు గమనించినచో పండితులు సహృదయంతో నాకుతెలియపరచమని కోరుతూ

గచ్ఛతః స్ఖలనం క్వాపి భవత్యేవ ప్రమాదతః
హసన్తి దుర్జనాస్తత్రి సమాదధతి సజ్జనాః

18.1.92

విదుషామనుచరః

కె. నిష్టేశ్వర్

# ABOUT THE AUTHOR



**Dr. K. NISHTESWAR**

Born on 6-6-1955

**Parents :**

Subrahmanya Sarma
Lakshmikantham

**Qualifications :**

B A.M.S. (Andhra University, 1976)

M D. (Gujarat Ayurved University, 1980)

D.Sc., (Open International University for Complimentary Medicine)

Sanskrita Bhasha Kovida (Bharatiya Vidya Bhavan)

**Awards :**

1) Capt. G. Srinivasa Murthy Memorial Gold Medal, 1978
2) Hariohm Ashram Gold Medal, 1979
3) Dr. A. Udaya Bhaskar Memorial Gold Medal, 1980
4) Nagarjuna Post-graduate Silver Medal, 1981
5) Vasudev Vilasam Prize of National Thesis Competition on Diabets, 1981
6) Vasudev Vilasam Prize of National Thesis Competition on Hypertension, 1982
7) Fellowship of Indian Association for History, Philosophy and Science (IAHPS), 1982

**Publications :**

1) Dravyaguna Moulika Siddhantamulu (Text Book)
2) Dravyaguna Prayoga Vignanam (Text Book)
3) Rasasastra Vignanam (Text Book)

4) Agadatantram (Text Book)
5) Guide for Ayurvedic P. G. Entrance Tests
6) Vyavaharayurveda (in Press)
7) A Monograph on 'DIABETES'
8) Chikitsadarsika

**Papers & Seminars :**

- Published about 45 research papers in Various Journals
- Participated in 20 National and International Seminars and Conferences

  Associate Editor for the International journal "INDIAN MEDICINE"

**Present Address :**

Dr. K. NISHTESWAR
Dept. of Dravyaguna
Govt. Ayurvedic College
**Vijayawada - 520 002 (A. P.)**

# విషయసూచిక

## ప్రథమాధ్యాయము

శ్లోకసంఖ్య

## ద్వితీయాధ్యాయము



## తృతీయాధ్యాయము



## చతుర్థాధ్యాయము

## పంచమాధ్యాయము



## షష్ఠాధ్యాయము

## సప్తమాధ్యాయము



## అష్టమాధ్యాయము

## నవమాధ్యాయము



## దశమాధ్యాయము

## ఏకాదశాధ్యాయము



## ద్వాదశాధ్యాయము

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 41 | 5 | జీమూతకములో | ఇక్ష్వాకుతో |
| 41 | 18 | జీమూతకములో | ఇక్ష్వాకుతో |
| 42 | 13 | జీమూతకములో | ఇక్ష్వాకుతో |
| 72 | 18 | జీవకాదులలో | జీవకాదులతో |
| 73 | 11 | క్షీరాదులలో | క్షీరాదులతో |
| 76 | 7 | నక్షాత్ర | నక్షత్ర |
| 77 | 21 | నేలి | నీలి |
| 105 | 11 | మాంసరసము | మాంసరసయోగము |
| 140 | 13 | అవస్థా విశేషముచే విరేచనౌషధమున పునః ప్రయోగ విధి | దుర్బలాదులకు స్వల్ప విరేచనము-చేయదగిన విధి |
| 19 | 21 | స్నిగో | స్నిగ్ధో |
| 48 | 21 | శ్లేష్మాశ్రయస్థితే | శ్లేష్మాశయస్థితే |
| 86 | 13 | యప్పైఃశ్యామా | యప్పైఃశ్యామాః |
| 94 | 27 | చిల్వకస్య | బిల్వకస్య |
| 119 | 25 | విరేకార్ధే | విరేకార్థే |
| 121 | 10 | అభిజిన్న | అభిభిన్న |
| 129 | 3 | పజ్చ | పఞ్చ |
| 144 | 8 | సుశ్రీతైః | సుశీతైః |
| 148 | 16 | స్థూలాం | స్థలాం |

# ప్రథమాధ్యాయము

1. అథాతో మదనకల్పం వ్యాఖ్యాస్యామః

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః

**తాత్పర్యము :** అటు తరువాత మదనకల్పము వ్యాఖ్యానము చేయగలము. ఆత్రేయ భగవానుడు ఈ విధముగా చెప్పెను.

**అథ శబ్ద వివేచన :**

'అథ' శబ్దము స్వరూపముచేత మంగళకరమైనదని శాస్త్రాదియందు ప్రయోగించెను. 'అథ' శబ్దము మంగళత్వ వాచకమైనను, స్మృతి యందు "ఓంకారశ్చాథ శబ్దశ్చద్వావేతౌ బ్రహ్మణఃపురా కంఠంభిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగలికౌ ఉభౌ"

అని శాస్త్రాంతరముల యందును మంగళత్వము చేతనే మొదట 'అథ' శబ్దము అగపడుచున్నది. ఉదా : 'అథశబ్దానుశాసనం' అని పతంజలియు, 'అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః' అని జైమినియు ఇత్యాదులందు తెలియదగినది.

ఇతిహాస్మాహ భగవానాత్రేయః (ఇట్లని భగవంతుడైన ఆత్రేయుడని వినుడని చెప్పినవాడాయెను). ఇందలి 'ఇతి' శబ్దము చెప్పబోవు విషయము పరామర్శించునది. 'హ' శబ్దము అవధారణయందు వర్తించును. ఏలననగా "సహవై శరీరస్య ప్రియాఽప్రియయోరపహతిరస్తి" అను ఈ స్థలమందు 'సహ' అను శబ్దములు నైవాద్యర్థమందే వర్తించును. స్మ, ఆహ అను శబ్ద ప్రయోగముచేత భూత మాత్రార్థమునందే "లిడర్థేలట్స్మ" అను శాస్త్రముచేత లట్ వచ్చును. భూతానద్యతన పరోక్షమునందురాదు. అగ్నివేశునికి ఆత్రేయ మహర్షి యుపదేశించినది ప్రత్యక్షమైనందున ఈ విధముగా చెప్పబడినది. ఏలననగా భూత మాత్రమునందు లిట్ వచ్చుచున్నది. భగమనగా పూజిత జ్ఞానము. అది గలవాడు భగవంతుడు. అది "ఉత్పత్తిం ప్రళయంచైవ భూతానామాగతిం గతిం! వేత్తి విద్యామవిద్యాం చ షష్ఠాం భగయితీరితః" అను శ్లోకముచేత చెప్పబడినది. అత్రి కుమారుడు ఆత్రేయుడు. అత్రివంశము మిక్కిలి పరిశుద్ధమైనదని తెలియుటకు ఈ విధముగా చెప్పబడినది

పైన వ్యాఖ్యానము చేసిన విధముగా అదియే న్యాయమని అగ్నివేశుని గురించి "వ్యాఖ్యాస్యామః" అని బహువచన ప్రయోగము చేయబడినది ఏక వచనమునందు బహువచన ప్రయోగము. "ఏకస్మిన్ బహువచన మన్యతరస్యాం"

అను సూత్రముచేత సాధుపై యున్నందున ప్రయోగింపబడినది. "భగవానాత్రేయః" అను స్థలమందున్ను ఏకవచనముగా నిర్దేశింపబడిన "భగవాన్" భగవంతుడైన అను శబ్దముచేత గురు విషయమగు గౌరవము ఆత్రేయునికి సూచింపబడినది.

అరుణదత్తుడు సర్వాంగ సుందర వ్యాఖ్యానమునందు ఇతి, హ, స్మ, ఆహ శబ్దముల వివరణ ఈ విధముగా యిచ్చెను.

"ఇతిశబ్దఏవమర్థే హ శబ్దానుకమ్పాయామ్ బ్రూథాతోః స్మ ఉపపదే భూతాన-ద్యతన పరోక్షే "లట్ స్మే" ఇతిలట్ ఆహ దేశః"

పదార్థ చంద్రిక వ్యాఖ్యానమునందు—

"ఇతిశబ్దఏవమర్థే హ శబ్దోఽవధారణే స్మ శబ్దోఽతిక్రాన్తకాలాభిధాయీ ఆహేతి వర్తమాన కాలాభిధాయీ ప్రదమ్, తదితం స్మ శబ్ద సన్నిధానాతీత కాలమావిర్భావయతి అవోచన్ అబ్రువన్నితి యావత్".

**ఆయుర్వేదదీపిక :** చికిత్సా స్థానమునందు అక్కడక్కడ చెప్పబడిన వమన విరేచన ప్రయోగములను విస్తారముగా చెప్పుటకు చికిత్స అనుకూలమైన యోగస్థాన రూపమైన కల్పస్థానము చెప్పబడుచున్నది. చికిత్సలో వస్తికూడా ప్రతిపాదింపబడియుండుటవలన వస్తియను పేరుగల సిద్ధిస్థానము కూడా చికిత్సకు అంగముగా చెప్పవలసియున్ననూ, పంచకర్మలలో అప్రధాన ప్రవృత్తిలో వమన విరేచన పూర్వకముగానే వస్తికర్మ యొక్క ప్రవృత్తి అగుచున్నదని తలచి వమన విరేచనమును కల్పస్థానమే వస్తి యను సిద్ధి స్థానము కంటేముందు చెప్పబడు చున్నది. వమన విరేచనములకు కల్పము దీనియందు వివరింపబడుటచే ఇది కల్పస్థానమయినది. కల్పమునందును విరేచనము యొక్క అప్రధాన ప్రవృత్తిలో వమన పూర్వకమైన ప్రవృత్తియే అగుచున్నదని విరేచనకర్మ వమన పూర్వకమగుట వలన వమన కల్పములే ముందు చెప్పదగినవి. వమన కల్పము లందును వమన ద్రవ్య శ్రేష్ఠత్వముగల్గి యుండుటవలన మొదటమదన ఫలముయొక్క కల్పమే చెప్పబడు చున్నది. మదన ఫలమునకు శ్రేష్ఠత్వము "వమన ద్రవ్యాణాం మదన ఫలాని శ్రేష్ఠతమాని ఆచక్షతే అనాపాయిత్వాత్" అని చ - క. అ. 1; సూ - 13లో మునుముందు చెప్పగలరు.

## కల్పస్థానమందలి విషయ నిర్దేశము

3. అథః ఖలు వమనవిరేచనార్థం వమనవిరేచనద్రవ్యాణాం సుఖోపభోగతమైః సహాన్యైర్ద్రవ్యైర్వివిధైః కల్పనార్థం భేదార్థం విభాగార్థం చేత్యర్థంః, తద్యోగానాం చ క్రియావిధేః సుఖోపాయస్య సమ్యగుపకల్పనార్థం కల్పస్థానము పదేక్ష్యామోఽగ్నివేశ!

**తాత్పర్యము :** ఓ అగ్నివేశ ! వమన విరేచనములు చేయించుటకై మ్రంగకాయ మొదలగు వమన ద్రవ్యములను, తెగడ మొదలగు విరేచన ద్రవ్యములను సుఖముగ ఉపయోగింపదగిన సుర, సౌవీరకము మొదలగు వివిధములైన ఇతర ద్రవ్యములతో కలిపి ప్రయోగ భేదములను, భాగభేదములను, కల్పించుటకు ఆ యా యోగముల క్రియా విధులను, ఆట్టి వమన విరేచన ద్రవ్యములకు సంబంధించిన స్వరసాది రూపములలో చక్కగా కల్పించుటకు కల్పస్థానము ఉపదేశింపబడును.

**ఆయుర్వేదదీపిక :** "అథః ఖలు" అనుదానిలో కల్పార్థమును చూపుచు చెప్పుచున్నాడు. 'అథః' శబ్దము ముందు చెప్పబడిదనదను అర్థములో ప్రయోగింపబడినది. ఖలు ప్రకాశనమునందు అని అర్థము.

"వమన విరేచనార్థం" అనగా వమనకు నిమిత్తము మరియు విరేచనము నిమిత్తమునకు అని భావము. "వమన విరేచన ద్రవ్యాణాం" అనగా మదన ఫలము మొదలైనవాటికి త్రివృత్ మొదలైనవాటికి అని అర్థము. అన్యైః అనగా సుర సౌవీరకము మొదలైనవాటితోను, కోవిదారము మొదలైనవాని విధానములతోను అని అర్థము. 'సుఖోపభోగతమః" అనునది 'అన్యైః' అనుదాని విశేషణము ఇచ్చట "సుఖాయ భోగోయేషాం తే సుఖోపభోగాః' (ఏవి సుఖముకొరకు ఉపయోగింపబడుచున్నవో అవి సుఖోపభోగములు). తాత్కాలిక సుఖమునందు ఉపయోగింపబడనివి సుఖోపభోగములు. అందువలననే తత్కాలమున సుఖమును చేకూర్చునటువంటి కోవిదారమును గ్రహింపకూడదు. కల్పనార్థము అను పదమునకు క్రియలో సంబంధము చూపకుండగనే ఆ వ్యాఖ్యానమును ప్రతిపాదించుటకు భేదముకొరకు, విభాగము కొరకు, అని వ్యాఖ్యానించుచున్నాడు. అచ్చట భేదార్థము అనగా వమన విరేచన ద్రవ్యముల ప్రయోగములో భేదముకొరకు ఆ ప్రయోగభేదములు "త్రయ స్త్రింశత్ యోగశతం ప్రణీతం ఫలేషు" (సూ. అ. 4) అను మొదలైనవి. విభాగార్థం అనగా 'ఫలపిప్పలీనాం ద్వౌ భాగౌ కోవిదారాది కషాయేణ" ఈ మొదలుగా చెప్ప

బోవు ద్రవ్యవిభాగము కొరకు అని అర్థము ఉపోద్ఘాతమును పూర్తిచేసి 'తద్యోగానాం' అని వమన విరేచన ద్రవ్య ప్రయోగములకు సంబంధించిన ప్రకృత (ప్రస్తుత) విషయములను చెప్పుచున్నాడు. "క్రియాయాః ఇతి కర్తవ్యతా విధిః క్రియా విధిః". క్రియాయా అనగా చేయదగిన దానియొక్క 'విధిః' విధానము అది క్రియావిధి అగును. స్వరసము మొదలైన రూపముగా చేయదగినవి అని అర్థము. 'సుఖోపాయస్య' అనునదిఆ క్రియావిధికి విశేషణము. సుఖముకొరకుగాని, సుఖమైనదిగాని ఉపాయము దేనికో అని సుఖోపాయము ఆ సుఖోపాయమునకు 'సమ్యగుప కల్పనార్థం' అనగా బాగుగా ఉపదేశించుట (తెలియచెప్పుట) కొరకు అని అర్థము.

## వమన - విరేచనపదముల నిర్వచనము

4. తత్ర దోషహరణమూర్ధ్వభాగం వమనసంజ్ఞకమ్,
అధోభాగం విరేచనసంజ్ఞకమ్. ఉభయం వా
శరీరమలవిరేచనాద్విరేచనసంజ్ఞాం లభతే.

**తాత్పర్యము :** శరీరముయొక్క ఊర్ధ్వభాగము (ముఖము) ద్వారా దోషములను హరించు క్రియకు వమనమను సంజ్ఞయు, అధోభాగము (గుదము) ద్వారా దోషముల హరించు క్రియకు విరేచనమను సంజ్ఞయు ఇవ్వబడుచున్నది. శరీరమునుండి మలమును బయటకు వెడలింప చేయుటచే వమన, విరేచనము రెండు ప్రక్రియలుకూడా విరేచన సంజ్ఞను పొందుచున్నవి

**ఆయుర్వేదదీపిక :** 'తత్ర' అనుదానితో వమనవిరేచన శబ్దముయొక్క అర్థమును విభజించుచున్నాడు 'ఊర్ధ్వభాగం' అనగా నోటి ద్వారా దోషనిర్హరణము పొందుచున్నాడు అని అర్థము అధోభాగమనగా గుదముతో దోష నిర్హరణము పొందుచున్నాడు అని అర్థము. 'ఉభయమపి' అనుదానిలో వమన విరేచనములకు గూడా ఒక్కొక్కప్పుడు విరేచన సంజ్ఞను షడ్విరేచన శతాశ్రితీయమందు చెప్పబడిన దానిగా చూపుచు చెప్పుచున్నాడు. ఇట్లుండగా వమన విరేచనమువలె నిరూహమునకు విరేచన సంజ్ఞను చెప్పుటకూడదు. ఎందువలన అనగా పంకజ శబ్దమువలె ఈ విరేచన సంజ్ఞ వమన విరేచనములందే యోగరూఢమై వుంటున్నది.

## వమన-విరేచనౌషధములు వమన, విరేచనముల గల్గించు విధము

5. తత్రోష్ణ - తీక్ష్ణ - సూక్ష్మ - వ్యవాయి - వికాశీన్యౌషధాని స్వవీర్యేణ హృదయముపేత్య ధమనీరనుసృత్య స్థూలాణుస్రోతోభ్యః కేవలం శరీరగతం దోషసంఘాతమాగ్నేయత్వాద్ విష్యన్దయన్తి, తైక్ష్ణ్యాద్ విచ్ఛిన్దన్తి, స విచ్ఛిన్నః పరిప్లవన్ స్నేహభావితే కాయే స్నేహాక్త భాజనస్థమివ క్షౌద్రమసజ్జన్నను ప్రవణభావాదామాశయమాగమ్యోదానప్రణున్నోఽగ్నివాయ్వాత్మకత్వాదూర్ధ్వభాగ ప్రభావాదౌషధస్యోర్ధ్వముత్క్షిప్యతే, సలిలపృథివ్యాత్మకత్వాదధోభాగ ప్రభావాచ్చౌషధస్యాధః ప్రవర్తతే ఉభయతశ్చోభయగుణత్వాత్ ఇతి లక్షణోద్దేశః.

**తాత్పర్యము :** ఉష్ణము, తీక్ష్ణము, వ్యవాయి (తొలుత శరీరమునందెల్ల వ్యాపించి పిమ్మట జీర్ణమగు స్వభావము), వికాశి (ఓజస్సును ధాతువులనుండి వేరు పరచునది) — అను నీ గుణములు కల ఔషధములు తన యందలి వీర్యము (ప్రభావము) చే హృదయ స్థానమున చేరి, ధమనుల ననుసరించి తనయందలి ఆగ్నేయ (అగ్ని సంబంధమైన ఉష్ణ) గుణము కల్గి యుండుటచేత శరీరమునందెల్ల సంచితమైన దోష సంచయమును ద్రవింపచేసి, శరీరమునందలి స్థూలంబును, సూక్ష్మంబునగు స్రోతస్సులనుండి తీక్ష్ణగుణముచే విడదీసి వేరుపరచును. అట్టి విడదీయబడిన దోష సంచయము శరీరము నందొకచోట నిలకడలేక నలుప్రక్కల సంచరించుచు సూక్ష్మమార్గముల ననుసరించు స్వభావంబును, కోష్ఠమునకు సుముఖమగు స్వభావంబును కల్గియుండుట చేసి తొలుతనే స్నేహ కర్మచే భావితమై స్నిగ్ధముగ నుండు శరీర అంతర్భాగము నందెచ్చటను (నూనె మున్నగు స్నేహ ద్రవ్యముల సంబంధముచే జిడ్డు గల్గిన పాత్రయందు తేనె అంటకుండు భంగి) అంటుకొనక ఆమాశయమున చేరిన దోషసంచయము (ఉరః స్థానమున నుండు) ఉదాన వాతముచే ప్రేరేపింపబడి ఔషధము నందు అగ్ని వాయుగుణము లధికముగ నుండుట వలన ఊర్ధ్వ మార్గము నుండి దోషముల వెడలించు స్వభావము కలిగి యుండుట వలనను అట్టి ఔషధము నోటి నుండి వెడలింపబడును.

పై చెప్పిన రీతిగనే తీక్ష్ణోష్ణాది గుణములు గల ఔషధము తమ యందలి సలిల పృథివీగుణములు అధికముగ నుండుటం జేసి అధోభాగమున దోషముల వెడలింప జేయు ప్రభావ విశేషముచే అధోమార్గమున వెడలింపజేయును.

ఉభయ గుణ సమన్వితములైనచో (అనగా అగ్ని వాయు గుణంబులును, జలపృథ్వి గుణంబులను గల్గియున్నచో) దోషములను ఊర్ధ్వము మరియు అధో మార్గముల ద్వారా వెడలింపజేయును. ఇది వీని లక్షణములుగా చెప్పబడినది.

ఆయుర్వేదదీపిక : ఇపుడు వమన విరేచన ద్రవ్యముల రెండింటికినీ సామాన్యమైన ఉష్ణ తీక్ష్ణత్వము మొదలైన గుణ యోగములచేత చేయబడిన దోష విష్యందనము మొదలైన సాధారణ కార్యమును చూపించుట మొదలుగా అగ్ని వాయు రూపకములైన విశిష్ట యోగములచే చేయబడిన వమన విరేచన రూపమైన విశిష్టమైన పనిని తత్రోష్ణా అను దానితో చూపించుచున్నాడు.

ఉష్ణమనగా ఉష్ణవీర్యము. 'స్వవీర్యేణ' అనగా తన ప్రభావముతో అని అర్థము. 'ధమనీరనుసృత్య' అనగా దేహమందలి అన్ని ధమనుల అనుసరించి అని భావము సమస్త దేహగతమైన ధమనుల అను సరణము వీర్యము చేత అని తెలిసికొనదగినది. సాక్షాత్తు ఔషధము (ధమనులందు ప్రవేశించదు) వలన కాదు. "ఆగ్నేయత్వాత్ విష్యన్దయన్తి" అనగా విలీనము చేయుచున్నది. విచ్ఛిన్దన్తి అనగా నరుకుచున్నవి. పరిప్లవన్ అనగా ఇటునటు వెళ్ళుచు అని అర్థము. 'అసజ్జన్' అనగా ఎక్కడను అంటకుండగ అని అర్థము. 'అణుప్రవణ భావాత్' అనగా అణుత్వము వలన ప్రవణ భావము వలన అని అర్థము. ఇచ్చట ప్రవణత్వము కోష్టము లోనికి వెళ్ళుటకు సిద్ధమగుట-అణుత్వమనగా సూక్ష్మమైన మార్గమున సంచరించుట. 'ఉదాన ప్రణున్న' అనగా ఉదాన వాతము చేత ప్రేరేపింపబడినది. 'అగ్నివాయ్వాత్మకత్వాత్' అనగా అగ్ని వాయువుల ఆధిక్యత వలన. 'ఊర్ధ్వ భాగ ప్రభావాత్' అనగా ఊర్ధ్వ భాగముద్వారా దోషములను పోగొట్టు ప్రభావము వలన అని అర్థము. ఈ విధముగానే జలము, పృథ్వి యొక్క సంయోగమును వ్యాఖ్యానింపదగినది. 'ఉభయతశ్చ' అనగా పైన, క్రింద మార్గములద్వారా బయటకు పంపబడుచున్నదని భావము. 'ఉభయ గుణత్వాత్' అనగా అగ్ని, వాయు భూత గుణ ప్రధానములగుట వలన, జల పృథ్వి భూత గుణ ప్రధానమగుట వలన పైన క్రింద సంచరించు ప్రభావము కలదని అర్థము. 'ఇతి లక్షణోద్దేశః' అనగా తరువాత శ్లోకము చేత వమన విరేచన ద్రవ్యముల స్వరూపములు చెప్పబడినవి అని అర్థము. ఈ ప్రకరణమున సామాన్యముగనే వమన విరేచన ద్రవ్యములకు 'ఆగ్నేయత్వాత్ విష్యన్దన్తి' అను దానితో ఆగ్నేయత్వము ప్రతిపాదింపబడుచున్నది. అందుచేత సామాన్యము నందు, విశేషము నందు వమన ద్రవ్యమునకు అగ్నిగుణ ప్రధానత్వము ప్రతిపాదించుట

వలన ఆగ్నేయత్వం అధికమైయున్నది విరేచన ద్రవ్యములకు మాత్రము సామాన్యముగా చెప్పబడిన ఆగ్నేయత్వ సంబంధము వలన విశిష్టమైన గుణములను చెప్పు సందర్భమున జల, పృధ్వీభూత ఆధిక్యతను చెప్పుట వలన వమన ద్రవ్యము కంటె ఆగ్నేయత్వము తక్కువగు చున్నది. సుశ్రుతము నందు "సరత్వ-సౌక్ష్మ-తైక్ష్ణ్య-వికాశిత్వైర్విరేచనమ్ వమనం చ హరేద్దోషాన్ ప్రకృత్యా గతమన్యథా" (సు.చి 33) అనుదానితో వమన విరేచనములకు కూడా ఆగ్నేయత్వము చెప్పబడినది. ఊర్ధ్వభాగహరత్వ ప్రభావము చేత వమనమున దోషములు పైకి పంపుట వలన 'అగ్నివాయ్వాత్మకత్వాత్' అను హేతుపుల వర్ణన సరిపడదు.ఎందువలన అనగా కారణము లేకుండా జరిగిన కార్యము ప్రభావముచే చేయబడినదని చెప్పబడుచున్నది. 'ప్రభావోఽచిన్త్య ఉచ్యతే (సూ. అ. 26) అని చెప్పబడినది గదా! అది సరికాదు. ఎందువలన అనగా ఈ వమన కార్యమున ప్రభావమునకే వాయు అగ్ని గుణరూపముగా వాయ్వగ్న్యాత్మకత్వము హేతువుగా కనిపించుచున్నది. కానీ వాయు, అగ్నిగుణ ప్రధానత్వము స్వతంత్రముగా వమన కర్మకు కారణము కాజాలదు. అట్లగుచుండగా వాయు, అగ్ని గుణములు ప్రధానముగా గల మరియొక ద్రవ్యము కూడా 'ఊర్ధ్వభాగ దోషహరత్వ' అనెడి ప్రభావము లేకుండగనే వమన కర్మ చేసెడిదగును. కానీ అటుల జరుగుటలేదు. కటు రసము గల ద్రవ్యము నందు ఆ వమన కర్మ జరుగును. అందువలన ప్రభావ గుణముగానే హేతువు వర్ణించుట (తగును). ఈ విధముగా విరేచన ద్రవ్యము నందు పూర్వ పక్ష సిద్ధాంతములు అనుసరింపదగినవి.

**విమర్శ :** అగ్ని వాయు గుణములు గల ద్రవ్యములు ఊర్ధ్వముగనే దోషములను హరించుననియు, పృథ్వీ జలగుణములు కల ద్రవ్యము అధోభాగముగా దోషములను హరించునని నియతముగా చెప్పుటకు వీలుపడదు. అట్లు చెప్పునపుడు కటురస ద్రవ్యములు ఆగ్నేయము లగుటవలన అన్నియు ఊర్ధ్వభాగ దోషహరములుగనే యుండవలసి వచ్చును. కానీ అట్లు అనుభవమున కానరాదు. కానీ కటురస ద్రవ్యములు విరేచన కర్మము కూడా కల్గి యుండును. కావున పై చెప్పిన గుణములు కల్గి ఊర్ధ్వభాగ దోషహర ప్రభావము కల మదనాది ద్రవ్యములు వమన కరములనియు, అధోభాగ దోషహర ప్రభావము కల తెగడ మొదలగు ద్రవ్యములు విరేచన కరములనియు పై వ్యాఖ్యానమున చక్రపాణి విశదీకరించెను. అందువలన పై చెప్పినరీతిగ గుణవిశేషములు కల్గియున్నను, ద్రవ్యములు ప్రభావ విశేషముచే విరేచనముల చేయునని భావము.

## వమన - విరేచన యోగముల సంగ్రహము

6. తత్ర ఫల-జీమూతకేక్ష్వాకు-ధామార్గవ కుటజ-కృతవేదనానాం, శ్యామా-త్రివృ చ్చతురఙ్గుల-తిల్వక-మహావృక్ష-సప్తలా-శంఙ్ఖి--దన్తీ-ద్రవన్తీనాం చ నానావిధ దేశకాలసంభవాస్వాద-రస-వీర్య-విపాక-ప్రభావగ్రహణాద్ దేహ-దోష-ప్రకృతి-వయో-బలాగ్ని-శక్తి-సాత్మ్య-రోగావస్థాదీనాం నానాప్రభావత్వాచ్చ, విచిత్రగన్ధ-వర్ణ-రస-స్పర్శానాముపయోగ సుఖార్థమసంఖ్యేయసంయోగానామపి చ సతాం ద్రవ్యాణాం వికల్పమార్గోపదర్శనార్థం షడ్విరేచనయోగశతాని వ్యాఖ్యాస్యామః.

**తాత్పర్యము :** మదనఫల (మ్రంగకాయ), జీమూతక (డావరడ్డంగి), ఇక్ష్వాకు (చేదుసొర), ధామార్గవ (పెద్ద చేదుబీర), కుటజ (కొడిశపాల), కృతవేధన (చిన్న చేదు బీర) అను ఈ వమనౌషధములను త్రివృత్ (తెగడ) చతురఙ్గుల (రేల) తిల్వక (లొద్దుగ?), మహావృక్ష (జెముడు), సప్తలా (సంబరేణి?), శంఖిని (దింటెన) దన్తీ (చిట్టిఆముదము), ద్రవన్తీ (పెద్ద నేపాళము)అను ఈ విరేచన ద్రవ్యములు వివిధ దేశములయందును, కాలములయందును, పుట్టునవియు నై యుండును. మరియువాని రస-వీర్య-విపాక-ప్రభావములు వివిధ ప్రకారములుగా నుండును. మానవ శరీరము వాతాది దోషములు, ప్రకృతి, వయస్సు, బలము, జఠరాగ్ని, ఇచ్ఛ, సాత్మ్యము, రోగముయొక్క అవస్థావిశేషము, సత్వము, ఆహారము అను పలు విధములైన ప్రభావ విశేషములను కల్గియుండును. కావున అట్టి ఔషధములను ఉపయోగించు నపుడును, ఉపయోగానంతరము సుఖముగ నుండుటకై విచిత్రమైన గంధ-రస-స్పర్శములు కల్గియుండుటకై ఔషధ యోగములు అసంఖ్యాకములుగా ఉండవలసి వచ్చును. అట్టి గణనాతీతములైన ఔషధ సంయోగ వికల్ప మార్గములను (అతి విస్తారముగాను, అతి సంక్షిప్తముగాకుండయుండునట్లు) చూపుటకై ఆరువందల విరేచన యోగములు ఈ క్రింద వివరించుచున్నాము.

**ఆయుర్వేదదీపిక :** ఇప్పుడు కల్పస్థానము చెప్పదగియుండుట వలన 600 విరేచన ప్రయోగములను ఎక్కువ సంక్షిప్తముగా లేదా ఎక్కువ వివరణతో లేకుండా యోగములను చూపించుచున్నాడు. "తత్రఫల అను మొదలుగా 'వ్యాఖ్యా స్యామః' అను అంతములో 600 విరేచన యోగములు (చెప్పబడుచున్నవి.) 'కృత వేధన' అను విచ్ఛేధ పాఠముచే వమనకర్మను ప్రయోగించుట- శ్యామాదులకు

విరేచన ప్రయోగమును ప్రయోగించుట చూపించుచున్నాడు ఇక్కడనే వమనము నందు, విరేచనమునందు మదనఫలము మొదలైన, శ్యామాదులు మొదలైన ప్రతి వస్తువునకు అనేక ప్రయోగములు చెప్పబడుచున్నవి. ప్రత్యేకముగా ఒక్కొక్క ద్రవ్యము వమన కారకముగాని, విరేచన కారకముగాని కాదు. వమన విరేచన యోగములు స్వల్ప సంఖ్యలో ఉన్నచో గ్రహించుట సుఖకరము, కార్యసిద్ధి జరుగు నని ఊహించి చెప్పెను. 'నానావిధ' అనగా రోగావస్థలు నానాప్రభావములను కలిగి ఉండుట అని దీనికి అర్థము. అనేక విధములైన దేశ కాలములందు పుట్టిన నానా విధమైన రుచులు గల, నానావిధ వీర్యములు గల, నానావిధపాకములు గల, నానావిధ ప్రభావములు గల మదన ఫలము మొదలైన ఓషధులు, వాటిని సంస్కరించే కోవిదారాది ఓషధులు లభించుచున్నవి. పురుషులు కూడా దేహము-దోషము-ప్రకృతి-వయస్సు-జఠరాగ్ని-భక్తి-సాత్మ్య రోగావస్థలలో భిన్న భిన్నములుగా కన్పించుచున్నారు. అందువలన ఒకే ద్రవ్యము దేహ దోషాదులన్నింటియందు, అన్ని ప్రదేశము లందును, అన్ని కాలములందును లభించుట లేదు. అందువలన దేహ దోషాదులచే భిన్నత్వము గల పురుషునియందు చాలా ద్రవ్యములు అనేక ప్రయోగములలో కల్పింప బడినవై యోగ్యత అనుసరించి లభించునంతవరకు ప్రయోగించుటకు శక్యమగు చున్నవి. ఇందువలన అనేక విధములైన మదనాది ద్రవ్యములకు అనేక విధములైన ప్రయోగములు చెప్పుట తగినదని భావము. 'గ్రహణాత్' అంటే లభించుటవలన. 'దేహ' అనగా అనేక విధములైన లావు, సన్నము మొదలగు భేదములో కూడినదని భావము. భక్తిః అనగా కోరిక. అవస్థా శబ్దముచే ఇచ్చట రోగావస్థయే గ్రహింప దగినది. 'ఆది' శబ్దముచే ఇచ్చట సత్వము (మనస్సు), ఆహారములను గ్రహించ వలెను. 'విచిత్ర' అను దానితో అధికమైన విరేచన ప్రయోగములను చూపించు ఇతర ప్రయోజనములను కూడా చెప్పెను. ప్రయోగము అనేక విధములైన గంధ, వర్ణ, రసముల వలన ఆ కాలమునకు, తరువాత కాలము సుఖము కొరకు ఉపయుక్తమని అర్థము. 'అసంఖ్యేయ' అనుదానితో ఏ ప్రభేదము వలన మదన ఫలములందు ఆరు వందల ప్రయోగములు అగుచున్నవి ? దేనిచేత ఎక్కువ ప్రయోగములు చెప్పబడుట లేదు ? అని ఊహించి చెప్పెను. "వికల్పమార్గోపదర్శనార్థం" అని ఎక్కువ ప్రయోగములను కల్పించుటలో సమర్థములైన వైద్యులను గూర్చి ఈ ఆరువందల ప్రయోగములను నిర్దేశించుట ద్వారా మార్గము చూపించుటయే (అని భావము). అందువలన ఇక్కడ ఇతర ప్రయోగములు కల్పింపదగినవి. గ్రంథమందు ప్రయోగ ములు అసంఖ్యాకములగుట వలన, అశక్యములగుట వలన అన్ని ప్రయోగములు

చెప్పకుండుట జరిగినది. మిక్కిలి విస్తారము కాకుండ అల్ప బుద్ధులకు మంచి వ్యవహారజ్ఞానము కొరకు ఈ అరువందల ప్రయోగములు చెప్పబడినవి. మరియొక చోట "ఏతావత్ హ్యలమల్పబుద్ధీనాం వ్యవహారాయ బుద్ధిమతాం చ స్వలక్షణ్యాను మానయుక్తి కుశలనామనుక్తార్థ జ్ఞానాయ" (సూ. అ. 4) అని చెప్పబడినది.

## వమన-విరేచన ఔషధములకు వీర్యాధిక్యము

7. తాని తు ద్రవ్యాణి దేశ-కాల-గుణ-భాజన-సంపద్వీర్యబలాధానాత్ క్రియ సమర్థతమాని భవన్తి.

**తాత్పర్యము :** పైన ఉదహరించిన వమన విరేచన ద్రవ్యములు దేశము యొక్కయు, కాలము యొక్కయు, గుణము యొక్కయు, ఔషధము ఉండు స్థానము యొక్కయు, సంపద్ విశేషమును బట్టి వాని వీర్యము మిక్కిలి అధికముగా ఉండును. దానివలన అవి వాని వాని కర్మలను చేయుటలో మిక్కిలి సామర్థ్యము కలిగియుండును.

**ఆయుర్వేదదీపిక :** 'తాని' అనుదానితో ఇప్పుడు వమన విరేచన ద్రవ్యములకు దేశము మొదలైనవాని సంపదతో గుణములయొక్క అధిక్యతను చూపుచు చెప్పెను. దేశము-కాలము-గుణము-పాత్ర అను నాల్గింటిలో సంపత్ శబ్దము ప్రత్యేకముగ కలుపబడుచున్నది. భాజనమనగా భేషజమును ఉంచు స్థానము. వీర్యము యొక్క బలమనగా వీర్యాధిక్యతయే.

## దేశ త్రైవిధ్యము

8. త్రివిధః ఖలు దేశః-జాఙ్గలః,ఆనూపః,సాధారణశ్చేతి. తత్ర జాఙ్గలః పర్యాకాశ భూయిష్ఠః,తరుభిరపి చ కదర-ఖదిరాసనాశ్వకర్ణ-ధవ-తినిశ-శల్లకీ-సాల-సోమవల్క-బదరీ-తిన్దుకాశ్వత్థ-వటామలకీవనగహనః,అనేకశమీ-కకుభ-శింశుపాప్రాయః,స్థిరశుష్కపవనబలవిధూయమానప్రనృత్యత్తరుణవిటపః, ప్రతతమృగతృష్ణికోపగూఢతనుఖరపరుషసికతాశర్కరాబహులః లావతిత్తిరి చకోరానుచరితభూమిభాగః, వాతపిత్తబహులః. స్థిరకఠినమనుష్యప్రాయో జ్ఞేయః; అథానూపో హిన్తాలతమాలనారికేలకదలీవనగహనః సరిత్సముద్ర పర్యన్తప్రాయః; శిశిరపవనబహులః, వంజులవానీరోపశోభితతీరాభిః

సరిద్భిరుపగతభూమిభాగః, క్షితిధరనికుఞ్జోపశోభితః, మన్దపవనానువీజిత క్షితిరుహగహనః, అనేకవనరాజీపుష్పితవనగహనభూమిభాగఃస్నిగ్ధతరు, ప్రతానోపగూఢః, హంస-చక్రవాక-బలాకా-నన్దీముఖ-పుణ్డరీక-కాదమ్బ-మద్గు భృఙ్గరాజ-శతపత్ర-మత్తకోకిలానునాదితతరువిటపః, సుకుమారపురుషః, పవనకఫప్రాయో జ్ఞేయః, అనయోరేవ ద్వయోర్దేశయోర్వీరుద్వనస్పతివానస్పత్య శకునిమృగ గణయుతః స్థిరసుకుమారబలవర్ణ సంహననోపపన్నసాధారణ గుణయుక్త పురుషః సాధారణో జ్ఞేయః.

**తాత్పర్యము :** దేశము జాంగలము, అనూపము, సాధారణము అని మూడు విధములుగ నుండును. అందు జాంగలదేశము విశాలముగనుండు బయలు ప్రదేశము కల్గి, కదర (వెలిచంద్ర), ఖదిర (నల్లనిచంద్ర) అసన, అశ్వకర్ణ, ధవ, తినిశ (నెమ్మిచెట్టు), శల్లకీ (అందుగుచెట్టు), సాల (మద్దిచెట్టు), సోమవల్క, బదర (రేగు), తిన్దుక (తుమికి), అశ్వత్థ (రావి), వట (మఱ్ఱి), ఆమలకీ (ఉసిరిక) - ఈ చెట్లతో కూడి అరణ్యములతో కూడియుండును. ముఖ్యముగా శమీ (జమ్మి), కకుభ (ఏరుమద్ది) శింశుపా (విరిగి) చెట్లు ఎక్కువగా వుండును. స్థిరములై ఎండి గాలిచే కదిలింపబడి, నాట్యము చేయుచున్నట్లు కదులుచున్న విటపములు కలిగియుండును. విశాలమైనట్టి ఎండమావులు కల్గియుండి, మిక్కిలి సూక్ష్మమైన కఠినమైన ఇసుక, సున్నపురాళ్ళతో కూడియుండును. లావుకపిట్ట, తీతువుపిట్ట, చకోరము అను ఈ పక్షి ఆ ప్రదేశము వ్యాపించి యుండును. అచ్చటి మనుష్యులు దృఢముగా కఠినముగా ఉండు శరీరముతో కూడియుండి, వాత పిత్త ఆధిక్యతను కల్గియుందురు. అటు తరువాత అనూపదేశమునందు హిన్తాలము, తమాల, నారికేళ (కొబ్బరి), కదలీ (అరటి) అను ఈ వృక్షములు ఎక్కువగా ఉండును. నదులు సముద్రము వరకు వ్యాపించి వుండును. చల్లనిగాలి ఎక్కువగా వీచుచుండును. వఞ్జుల (పొగడ), వానీత (నీరుప్రబ్బలి) ఈ చెట్లతో వ్యాపించియున్న తీరములు కల్గియుండును. పర్వతముల చేతను, పొదలచేతను, ప్రకాశించునదియు, మన్ద పవనములచే కదల్చబడనట్టి చెట్లు కల్గినదియు, అనేకములైన వన సమూహముచేత, పుష్పించిన వనములచేతను వ్యాపింపబడినట్టి భూభాగముతో కూడినదియు, స్నిగ్ధమైన వృక్షములచేతను, తీగల గుంపులచేతను నిగూఢమగు ప్రదేశము కల్గినదియు, హంసలు, చక్రవాకములు, బలాకా (బెగ్గురుపక్షులు) నన్దీముఖ, పుణ్డరీక, కాదమ్బ (కలహంసములు), మద్గు, భృంగరాజ, శతపత్ర, మత్తకోకిలతో కూడినట్టియు, సుకుమార పురుషులు కల్గి నట్టియు, వాత, కఫ ఆధిక్యము యున్న వారితో కూడియున్న భూమి అనూపమని చెప్ప బడును.

పైన చెప్పబడినట్టి జాంగల, అనూపదేశముల రెండింటికినీ చెప్పబడిన నిరుధ, వనస్పతి, వానస్పత్యములను, చెట్లతోడను, హంస చక్రవాకాది పక్షులతోడను, మృగములతో కూడియుండి, స్థయిర్యమును, సుకుమారత్వమును, శరీరకాంతియు, సామాన్యగుణములు కల్గిన పురుషులతో కూడినట్టి భూమి సాధారణ దేశమని తెలుసుకొనవలెను.

**ఆయుర్వేదదీపిక** : 'తత్ర త్రివిధ' అనుదానితో దేశము మొదలైన వాటిని బాగుగా వ్యాఖ్యానము చేయుచు చెప్పెను. ఇక్కడ కొందరు జాంగలాది దేశ లక్షణమును గూర్చి చెప్పిన శ్లోకము చదువరు. అది జనపదోధ్వంసనీయము నందే (చ. వి. 3) చదువబడినదని తలచి ఇక్కడ ఈ పాఠము అనార్షమని (ఋషి ప్రోక్తము కానిదని) చెప్పుచున్నారు. జనపదోధ్వంసమున జాంగలాది దేశ లక్షణ ములు చదవబడని వారిచేత ఈ పాఠము యిచ్చట చదువతగినదే.

## ఔషధమున కుండవలసిన దేశాది సమ్పద్వివరణము

9. తత్ర దేశే సాధారణో జాఙ్గలే వా యథాకాలం శిశిరాతపపవనసలిలసేవితే సమే శుచౌ ప్రదక్షిణోదకే శ్మశాన-చైత్య-దేవయజనాగార-సభా-శ్వభ్రారామ-వల్మీకోషరవిరహితే కుశరోహిషాస్తీర్ణే స్నిగ్ధంకృష్ణమధురమృత్తికే సువర్ణ-వర్ణమధురమృత్తికే వా మృదావఫాలకృష్టేఽనుపహతేఽన్యైర్బలవత్తరైర్ద్రు మైరౌషధని జాతాని ప్రశస్యన్తే.

**తాత్పర్యము** : పై చెప్పబడిన దేశములలో సాధారణ దేశములోనైనసూ, జాంగలములోనైననూ ఆ యా ఋతువునకు అనువైన శీతోష్ణములచేత, గాలిచేత, జలముచేత వ్యాపింపబడనట్టియు, నిమ్నోన్నతముగాక సమమైనట్టియు, పరిశుద్ధమైనట్టియు, ప్రదక్షిణముగ వెడలు జలము కల్గినట్టియు, శ్మశానము, చైత్యము, యజ్ఞములు చేయు గృహము, సభాస్థలము, బొరియలు, ఉద్యానవనము, పుట్టలు, చవిటిమన్ను అనునట్టివి లేనట్టి, దర్భలచేతను, రోహిషచేతను వ్యాపింపబడినదియు, స్నిగ్ధమును, కృష్ణ లేదా సువర్ణవర్ణపు మధుర రసము కల మట్టితో కూడినట్టి నాగలిచే దున్న కుండునట్టి, బలమైన యితర వృక్షములచే అభిహూతము లేనట్టియగు ప్రదేశమున పుట్టిన ఔషధములు మిక్కిలి ప్రశస్తములు.

**ఆయుర్వేదదీపిక** : యథాకాలమనగా తగిన సమయమున, శిశిరాదులచే (అనగా చలి, వేడిగాలి, నీరు) సేవింపబడిన ప్రదేశము, స్మశానాదులతో ప్రత్యేక

ముగా విరహిత శబ్దము కలియుచున్నది. (శ్మశాన విరహితే, చైత్య విరహితే, మొ॥ నవి) దేవ యజన శబ్దముతో అగార శబ్దము కలియుచున్నది. సభ యనగా జనులు కలియు ప్రదేశము. అఫాలకృష్ఠమనగా నాగలిచేత దున్నబడనిది.

## ఔషధ గ్రహణకాలము

10. తత్ర యాని కాలజాతాన్యుపగతసంపూర్ణప్రమాణరసవీర్య-గన్ధాని కాలాత-పాగ్నిసలిలపవనజన్తుభిరనుపహతగన్ధ-వర్ణ-రస-స్పర్శ-ప్రభావాణి ప్రత్య-గ్రాణ్యుదీచ్యాం దిశి స్థితాని.తేషాం శాఖాపలాశమచిరప్రరూఢం వర్షావసన్త-యోర్గ్రాహ్యం, గ్రీష్మే మూలాని శిశిరే వా శీర్ణప్రరూఢపర్ణానాం, శరది త్వక్కన్దక్షీరాణి, హేమన్తే సారాణి, యథర్తు పుష్పఫలమితి, మఙ్గలాచారః కల్యాణవృత్తః శుచిః శుక్లవాసాః సంపూజ్య దేవతా అశ్వినౌ గోబ్రాహ్మణాంశ్చ కృతోపవాసః ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖో వా గృహ్ణీయాత్.

**తాత్పర్యము :** పై చెప్పబడిన లక్షణములతో గూడిన దేశమున పుట్టిన ఔషధములుయైనట్టియు, అవి సంపూర్ణ ప్రమాణముతోనూ, రస వీర్య గన్ధాదులను కల్గి నటివియై యుండవలెను. మరియు అవి వానిగుణములను ఎండచేత, నిప్పుచేత, జలమునేత, గాలిచేత, కీటాది జంతువులచే కోల్పోక వుండవలెను. తాను ఉండు ప్రదేశమునకు ఉత్తరదిశ యందుండు ఔషధములను గ్రహింపవలెను వానియొక్క శాఖలను, పత్రములను క్రొత్తగానుండు వానిని వర్ష ఋతువునందును, వసంత ఋతువునందును, మూలములను గ్రీష్మ ఋతువునందును లేదా శిశర ఋతువునందు, చెట్లకు ఆకులురాలి క్రొత్తగా చిగురించియున్నపుడు వాని మూలములను, త్వక్, కన్దములను, క్షీరములను శరత్ ఋతువునందు, సారములను హేమంతములందును, పుష్పములను ఫలములను వానివాని ఋతువులయందును గ్రహింపవలెను. ఔషధము లను గ్రహించు మనుజుడు శుభకరమైన ఆచారమును, చేష్టాదులను కల్గి పరిశుద్ధుడై తెల్లని వస్త్రములను ధరించి దేవతలనూ, అశ్వనీ దేవతలను, గో బ్రాహ్మణులను పూజించి, నాడు ఉపవాసముచేసి, తూర్పు ముఖముగనైనను, ఉత్తరముఖముగనైనను తానుండి ఔషధమును గ్రహించవలెను.

**ఆయుర్వేదదీపిక :** "తత్రయాని, కాలజాతాని" అనుదానిచే కాల సంపద చెప్పబడుచున్నది. కాలజాతాని అనగా తగిన కాలమునందు (ఋత్విషు పారషు) పుట్టినవి. 'ఉపగత సంపూర్ణ' మొదలుకొని 'ప్రత్యగ్రాణి' అనువరకు

శాఖ, పత్ర ములను ... ... వసంత

... ... ... మూలములను వానివా

గుణసంపద చెప్పబడుచున్నవి. ప్రత్యగ్రాణి అనగా సంపూర్ణమైన గుణముతో (రస-గుణ-వీర్య-విపాకముతో) పుట్టినవి అని అర్థము. 'తేషాం శాఖాపలాశం' అనుదానితో చెప్పబడిన కాలసంపదను విస్తరించి చెప్పుచున్నాడు. 'శాఖా' శబ్దముచే త్వక్ (బెరడు) మొదలైన వానిని గ్రహించవలెను. 'శీర్ణప్రరూఢ పర్ణానాం' (రాలిపోయి మరల చిగురించిన ఆకులుగల చెట్లయొక్క) అని పద విభాగము. 'గ్రీష్మ మూలాని శిశిరేవా' అని చెప్పుటచేత అగ్నిగుణ ప్రధానమైన మూలములను గ్రీష్మమునందు, శీత (సౌమ్య) గుణ ప్రధానమైన మూలములు శిశిర ఋతువునందు గ్రహింప దగిన దను విధానమును సూచించుచున్నాడు. "సౌమ్యాన్యౌషధాని సౌమ్యేష్వృతుష్వాదదీత, అగ్నేయాన్యాగ్నేయేషు (సు. సూ. అ. 36) అని చెప్పబడినది. 'మంగల' అను దానితో భేషజమును గ్రహించు విధానమును చెప్పెను.

## ఔషధ సంరక్షణ విధి

11. గృహీత్వా చానురూపగుణవద్భాజనస్థాన్యాగారేషు ప్రాగుదగ్ద్వారేషు నివాత-ప్రవాతైకదేశేషు నిత్యపుష్పోపహారబలికర్మవత్సు, అగ్ని-సలిలోపస్వేద-ధూమ-రజో-మూషక-చతుష్పాదమనభిగమనీయాని స్వవచ్ఛన్నాని శిక్యేష్వా-సజ్య స్థాపయేత్.

**తాత్పర్యము :** గ్రహింపబడిన ఔషధముల యొక్క రూప గుణములను అనుసరించి తగినట్టి మంచి పాత్రలోవుంచి తూర్పువైపునగాని, గాలిలేనట్టి ప్రదేశము అనగా గాలి సరిపడునంత ఉండు ప్రదేశమునందు నిత్యము పుష్పములు ఉపహార ములు, బలికర్మ ఇచ్చుటకు అనువుగా వుండు ప్రదేశమునందు ఉంచి, ఆ పాత్రల యందు అగ్ని, జలము, స్వేదము, ధూమము, ధూళి, మూషికములు, చతుష్పాదము లును లోనికి పోకుండ, చొరకుండ మూతపెట్టి యుంచవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'గృహీత్వా' అనుదానితో భాజన సంపదను చెప్పెను. 'అనురూపగుణవద్భాజనస్థాని' అనగా భేషజ అనురూపగుణత్వము (సమానగుణము) పాత్రకు కల్గియుండుట. 'స్వవచ్ఛన్నాని' అనగా బాగుగా మూయబడినది.

## వమన-విరేచన ద్రవ్యములను భావన-ఆలోడనముల చేయదగిన ద్రవ్యముల సంగ్రహము

12. తాని చ యథాదోషం ప్రయుఞ్జీత సురా-సౌవీరక-తుషోదక-మైరేయ-మేదక ధాన్యామ్ల-ఫలామ్ల-దధ్యమ్లాదిర్భావితే, మృద్వీకామలక-మధు-మధుక- పరూషక-ఫాణిత-క్షీరాదిభిః పిత్తే, శ్లేష్మణి తు మధు-మూత్ర-కషాయాదిర్భావితాన్యాలోడితాని చ. ఇత్యుద్దేశః తం విస్తరేణ ద్రవ్య-దేహ-దోష-సాత్మ్యాదీని ప్రవిభజ్య వ్యాఖ్యాస్యామః

**తాత్పర్యము :** అట్లు భద్రపరచబడిన ఔషధములను దోషానుసారముగా సురా, సౌవీరకము, తుషోదకము, మైరేయము, మేదకము, ధన్యామ్లము, ఫలామ్లము, అమ్ల దధి మొదలగునవి వాతమునందును, మృద్వీకము (ద్రాక్ష) ఆమలకీ (ఉసిరిక) మధు, మధుక (యష్టిమధు) పరూషక (చిట్టీత పండ్లు) ఫాణితము, క్షీరములను, పిత్తమునందును, మధు, మూత్రములు, కషాయములను కఫమునందును గ్రహించి వానియందు భావన చేయబడిన ఔషధములనుగానీ, లేదా వానితోగానీ ఈయవలెను. ద్రవ్యము దేహము, దోషము, సాత్మ్యము మొదలగువానిని అనుసరించి ఔషధమును ఉపయోగించుట విస్తరించి చెప్పబోవుచున్నాడు.

**ఆయుర్వేదదీపిక :** "తానిచ యథాదోషం ప్రయుఞ్జీత" అనుదానితో సంక్షేపముగా మదనఫలము మొదలైనవానికి గాలి మొదలైన భేదముతో భావన, **ఆలోడనము** (కలుపుట) చేయు ద్రవ్యములను చెప్పెను.

ధాన్యామ్లమనగా కాంజికము (పులియబెట్టిన గంజి). ఫలామ్లమనగా దానిమ్మ రసము మొదలైనవి. 'శ్లేష్మణి' అను మొదలైనవాటితో, కషాయశబ్దముచేత శ్లేష్మములను హరించు ద్రవ్యముల కషాయమని చెప్పబడినది. 'ఉద్దేశః' అనగా సంక్షేపముగా చెప్పుట అని అర్థము. "ద్రవ్య-దేహ-దోష-సాత్మ్యాదీని" అనుచోట ఆది శబ్దము చేత ప్రకృతి-బలము-వయస్సు-మొదలైన వాటిని గ్రహింపవలెను.

## వమనార్థము మదన ఫలముల గ్రహించువిధము

13. "వమనద్రవ్యాణాం మదనఫలాని శ్రేష్ఠతమాన్యాచక్షతే, అనపాయిత్వాత్. తాని వసన్తగ్రీష్మయోరన్తరే పుష్యాశ్వయుగ్భ్యాం మృగశిరసా వా గృహీయాన్మైత్రే ముహూర్తే, యాని పక్వాన్యకాణాన్యహరితాని పాణ్డూన్యక్రిమీణ్య

పూతీన్యజన్తుజగ్ధాన్యహ్రస్వాని. తాని ప్రమృజ్య, కుశాపుటే బద్ధ్వా, గోమయే నాలిప్య యవతు (బు)ష మాషశాలికులుత్థముద్గఫలానామన్యతమే నిదధ్యా దష్టరాత్రమ్. అత ఊర్ధ్వం మృదుభూతాని మధ్విష్టగన్ధాన్యుద్ధృత్య శోషయేత్. సుశుష్కాణాం ఫలపిప్పలీరుద్ధరేత్. తాసాం ఘృతదధిమధుపలలవిమృదితానాం పునః శుష్కాణాం నవం కలశం సుప్రమృష్టవాలుకమరజస్కమాకణ్ఠం పూరయిత్వా స్వవచ్ఛన్నం స్వనుగుప్తం శిక్యేష్వాసజ్య సమ్యక్ స్థాపయేత్.

**తాత్పర్యము :** వమన ద్రవ్యము లన్నింటియందు మదనఫలము శ్రేష్ఠ మని, అపాయము లేనిది అని చెప్పబడినది. వానిని వసంతమునందు, గ్రీష్మము యొక్క అంతమునందు పుష్య మరియు అశ్వనీ, మృగశిరా నక్షత్రములయందు మిత్ర దేవతాకమైన ముహూర్తమున సదాచారముతో గ్రహింపవలెను. గ్రహించ బడినవానిలో పండినవి, కాడలు లేనివి పచ్చనిరంగు లేనివి, పాండువర్ణము, పురుగులు లేనివి, దుర్గంధము లేనివి, కీటకములు మొదలగు జంతువులచే తినబడనట్టి, చిన్నవి కానివి, సరియైన పరిమాణము కలిగినవి గ్రహించి శుభ్రముగ కడిగి కుశలను సంపుటము చేసి, దానిలో మధ్య మదనఫలములనుంచి బిగించికట్టి దానిపై ఆవుపేడను పూసి, యవలు పొట్టు, మినుములు, వరిధాన్యము, ఉలవలు, పెసలు, వీని రాసులలో ఒకదానియందు మధ్య ఎనిమిది (8) రోజులు ఉంచవలెను. ఎనిమిది రాత్రుల పిదప వానిని బయటకు తీసిన, మ్రంగకాయలు మెత్తబడి, తేనెవలె మంచి గంధము కలిగిన వాటిని తీసి ఎండించి, వానిలో ఉండు విత్తనములను బయటకుతీసి వుంచుకొన వలెను. తరువాత వానిని ఘృతము, దధి, మధు మాంసము వీనిలో దేనియందైనను మర్దించి మరల బాగుగా ఎండించి, ఇసుక మొదలగు ధూళిలేని శుభ్రమైనట్టి ఒక క్రొత్త కుండలో పై వరకు మ్రంగకాయల గింజలచే నింపి దానిపై జాగ్రత్తగా మూతమూసి భద్రపరచవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'వమన ద్రవ్యాణాం' అనుదానితో మదన ఫలము యొక్క ప్రాధాన్యమును చూపించు ప్రయోగవిధిని చూపుచున్నాడు. "అనపాయి త్వాత్" అనగా వమనద్రవ్యములన్నింటిలో అల్పమైన వ్యాపత్తులు కల్గినదగుటవలన అని అర్థము. 'అన్తరే' అనగా 'మధ్యే' అని అర్థము. గ్రీష్మ వసంత ఋతువుల మధ్యలోనున్న కొన్ని రోజులనే మధ్య శబ్దము చేత గ్రహింపదగినది. అశ్వయుక్ అనగా అశ్వని నక్షత్రము. "మైత్రేయ ముహూర్తే" అనగా శివ-భుజగ-మిత్ర మొదలైన వాటిమధ్యలో మిత్రదేవతాకమైన అనగా మైత్ర ముహూర్తమునందు అవి

అర్థము. 'ఫలానాం' అనగా కాయలకు (అని అర్థము). తేనె వంటి ఇష్టమైన పరిమళము గలవి 'మద్విష్ట గంధము' లగుచున్నవి అట్టి మదనఫలములను గ్రహించవలెనని చూపుచున్నాడు. 'ఫలపిప్పలీ' అనగా మదన ఫలమధ్యమున్న పిప్పలీయందలి బీజములు (ఇచట చక్రపాణి పిప్పలీ సంస్థానాని బీజాని' అను శబ్దములు ప్రయోగించెను. దాని చేత బాగుగా ఎండిన బీజములు గ్రహించవలెనని కొందరి అభిప్రాయము.) 'తాసాం' అనుదానితో మొదలుకొని 'పూరయిత్వా' అను పూరణవాచక శబ్దయోగమువలన కరణార్థమున షష్ఠీ విభక్తి వచ్చినది. 'స్వనుగుప్త' అనగా ద్రవ్యమును భద్రపరచు విధానము.

## మైత్రే ముహూర్తము

తిథి-వార-నక్షత్ర-యోగ-కరణములు అను పంచాంగము ఆధారముగా ముహూర్తము నిర్ణయించబడుతుంది. చరకుడు కొన్ని సందర్భాలలో మైత్రే ముహూర్తమును ఉదహరించెను. ఉదాహరణకు శిష్యోపనయనమున "ఉదగయనే శుక్లపక్షే ప్రశస్తేఽహని తిష్యహస్త శ్రవణాశ్వయుజామన్యతమేన నక్షత్రేణ యోగముపగతే భగవతి శశిని కల్యాణే చ కరణే మైత్రే ముహూర్తే" (చ. విమాన స్థానము 8/7) అని పేర్కొనబడినది. దానిపై చక్రపాణి వ్యాఖ్యానిస్తూ మైత్రే ముహూర్త ఇతి అనుకూలే ముహూర్తే. ముహూర్తాశ్చ శివభుజగాదయః" - అనుకూలమైన ముహూర్తము మైత్రే ముహూర్త అనియు, శివ, భుజగ, మొదలగు ముహూర్తములను గ్రహించవలెనని వివరించెను. శారీర స్థానము (8/5) నందు సూతికాగార ప్రవేశము మైత్రేముహూర్తమునందు చేయవలెనని పేర్కొనెను. జ్యోతిషశాస్త్రమున నక్షత్రములకు అధిపతులను వివరిస్తూ పుష్యమికి గురుడు, అశ్వనికి అశ్వనిదేవతలు, మృగశిరకు చంద్రుడు, ఆర్ద్రకు శివుడు, ఆశ్రేషకు సర్పములు, హస్తకు రవి, అనూరాధకు మిత్రతనే సూర్యుడు, పుబ్బకు భాగుడనే సూర్యుడు, ఉత్తరకు కర్యమునే సూర్యుడు, రేవతికి పుష్యమి సూర్యుడు, ఉత్తరాభాద్ర అహిర్బుధ్న్యంతు (శివుడు), అని పేర్కొనడమయినది. అశ్వని ధనిష్ఠ-పుష్యమి-విశాఖ-అనూరాధ-శతభిష-ఆశ్రేష అను 7 నక్షత్రములు ధర్మనక్షత్రములనియు, ఉత్తరాషాఢ-పూర్వాషాఢ-రేవతి-హస్త-ఉత్తర ఫల్గుని-మృగశిర-రోహిణి అను 7 నక్షత్రములు మోక్ష నక్షత్ర ములనియు, ఉత్తరాభాద్ర కామనక్షత్రములందు పరిగణింపబడినవి శివ-భుజగ-మిత్రాదీనాం అను

చక్రపాణి వ్యాఖ్యననుసరించి ఆర్ద్రి (శివుడు అధిపతి), ఆశ్లేష (భుజగము) అధిపతి హస్త-అనూరాధ-పుబ్బ-రేవతి-ఉత్తర- (ద్వాదశ సూర్యులలో కొంతమంది అధిపతులు) అనునక్షత్రము మధ్యగల శుభదాయక మైనటువంటి కాలమును మైత్రే ముహూర్తముగా గ్రహింపవలెను.

## వమనౌషధ ప్రయోగ విధి

14. అథ చ్ఛర్దనీయమాతురం ద్వ్యహం త్ర్యహం వా స్నేహస్వేదోపపన్నానాం శ్వశ్ఛర్దయితవ్యమితి గ్రామ్యానూపౌదక మాంసరస-క్షీర-దధి-మాష-తిల-శాకాదిభిః సముత్క్లేశిత శ్లేష్మాణాం వ్యుషితం జీర్ణాహారం పూర్వాహ్ణే కృత-బలిహోమమఙ్గలప్రాయశ్చిత్తం నిరన్నమసతిస్నిగ్ధం యవాగ్వా ఘృత-మాత్రాం పీతవన్తం, తాసాం ఫలపిప్పలీనామన్తర్నఖముష్టిం యావద్వా సాధు మన్యేత జర్జరీకృత్య యష్టిమధుకషాయేణ కోవిదార-కర్బుదార-నీప-విదుల-బిమ్బీ-శణపుష్పీ - సదాపుష్పీ-ప్రత్యక్పుష్పీ-కషాయాణామన్యతమేన వా రాత్రిముషితం విమృద్య పూతం మధుసైన్ధవయుక్తం సుఖోష్ణం కృత్వా పూర్ణం శరావం మన్త్రేణానేనాభిమన్త్రయేత్

ఓం బ్రహ్మదక్షాశ్వరుద్రేన్ద్రభూచన్ద్రార్కానిలానలాః
ఋషయః సౌషధిగ్రామా భూతసఙ్ఘాశ్చ పాన్తు తే
రసాయనమివర్షీణాం దేవానామమృతం యథా
సుధేవోత్తమనాగానాం భైషజ్యమిదమస్తు తే

ఇత్యేవమభిమన్త్ర్యోదఙ్ముఖం ప్రాఙ్ముఖం వాఽఽతురం పాయయేచ్ఛ్లేష్మజ్వర గుల్మప్రతిశ్యాయార్తం విశేషేణ పునః పునరాపిత్తాగమనాత్ తేన సాధు వమతి; హీనవేగం తు పిప్పల్యామలక-సర్షప-వచాకల్కలవణోష్ణోదకైః పునః పునః ప్రవర్తయేదాపిత్తదర్శనాత్. ఇత్యేష సర్వచ్ఛర్దన యోగవిధిః.

**తాత్పర్యము :** తరువాత వమనము చేయించవలసిన రోగికి రెండు లేదా మూడు దినములు పద్ధతి ప్రకారము స్నేహ స్వేదములచే స్నిగ్ధ, స్విన్న శరీరునిగా చేసి వమనము చేయించు ముందు దినమున గ్రామ్య అనూప, ఔదక మాంసరసము క్షీరము, దధి, మాష, తిలలు, శాకములు మొదలగువానిని ఆహారముగా ఇచ్చి, రోగికి శ్లేష్మము స్వస్థానము నుండి వెడలునట్లుగా చేసి, ఆ రోజు రాత్రి బాగుగా నిద్రింపచేయవలెను. ముందు రోజున సేవించిన ఆహారము జీర్ణమైన పిమ్మట

ప్రాతః కాలమున పూజ విధానమును, హోమమును, మంగళాశాసనములను, ప్రాయశ్చిత్తమును చేసికొని నిరాహారుడైయున్న రోగికి, రోగి మిక్కిలి స్నిగ్ధ కోష్ఠుడు కాకుండ యవాగుతో ఘృతమును కొద్దిగా చేర్చి త్రాగించి తరువాత వమనౌషధమును త్రాగించవలెను. ఈ సిద్ధముగా వుంచబడిన మ్రంగకాయ విత్తనములను ఒక పిడికిలి తీసుకొని, లేదా ద్రోణము బలానుసారము గ్రహించి వానిని మెత్తగా దంచి, యష్టిమధు కషాయము నందు కాని, కోవిదార, కర్బుదార, నీప, విదుల, బింబీ శణపుష్ప, సదాపుష్ప, ప్రత్యక్ పుష్పి (ఉత్తరేణి) వీనిలో దేని కషాయముతో నైనను, ఒకరాత్రి అంతయు నానబెట్టి, బాగుగా పిసికి, వడగట్టి, అందు తేనె, సైంధవలవణము చేర్చి, సుఖోష్ణముగ చేసి, ఆ ఔషధమున పూర్ణ శరావమున బెట్టి, "బ్రహ్మ దక్షాశ్వి ... ...మిదమస్తుతే" అను మంత్రముచే అభిమంత్రించి వమనమునకు సిద్ధముగా నున్న రోగికి తూర్పుగనైనను, ఉత్తరముగనైనను నిలిచి, వానికి త్రాగించవలెను. శ్లేష్మము, జ్వరము, గుల్మము. ప్రతిశ్యాయము- అను ఈ రోగములచే పీడింపబడినవానికి ముఖ్యముగ వమనౌషధమును ప్రయోగింపవలెను. ఈ విధముగ రోగికి పిత్తము వెడలువరకు మాటిమాటికి త్రాగించవలెను. అందువలన చక్కగ వమనము అగును. వమనము చక్కగగాకుండ నెతల్ల పిప్పళ్ళు, సిరి కాయలు, ఆవాలు, వస- పీనికల్క, కషాయమును, ఉప్పు కలిపిన వేడినీళ్ళను మాటి మాటికి త్రాగించి పిత్తము వెడలు వరకు త్రాగించవలెను. వమన యోగములన్నిటి యందు ఈ విధానమును అనుసరించవలెను.

ఆయుర్వేద దీపిక : "ద్వ్యహంత్ర్యహం వాస్నేహస్వేదోపన్నం" అనువానితో అభ్యంగము చేయుచుండగ స్నేహముతోకూడిన స్వేదకర్మ రెండు లేదా మూడు రోజులు చేయబడుచున్నది. త్ర్యహావరం సప్తదినం పరం తు స్నిగ్ధో నరః స్వేదయితవ్య ఇష్టః" (సి. అ. 1) అనుదానితో స్నేహ పానమునకు ఏడు లేదా మూడు రోజులు (రాత్రులు) అధికృత చెప్పబడుచున్నదనుటలో విరోధము లేదు. (ఈ శ్లోకమున రెండు లేదా మూడు రోజులు స్నేహ స్వేదకర్మ చేయవలెనని చెప్పగా సిద్ధి స్థానమున మూడు లేదా ఏడు రోజులు ఈ కర్మలను చేయవలెనని వచనము చెప్పబడు అధికృతను దృష్టిలో వుంచుకుని చెప్పుటచే పరస్పర విరోధము పొడాబడు.) ఈ అభ్యంగ స్వేదముతో కూడిన స్నేహా, స్వేదకర్మ అభ్యంతర స్నేహము యొక్క చివరిరోజు నుంచి ప్రారంభించబడును. అందువలన స్నేహ పానము అయిన రోజుతో కలిపి అభ్యంగ స్నేహముతో కూడిన స్వేద ప్రయోగము

నకు రెండు మూడు రోజుల పరిగణన సరిపడును. స్నేహపానము తరువాత (ఏ విశ్రాంతి రోజు యున్నదో" "ఏకాహోపరత స్తద్వభుక్త్వా ప్రచ్ఛర్దనం పిబేత్"(సూ. అ. 13) అనుదానిలో చెప్పబడినదో అదే విధముగా ఇక్కడ కూడా ఆచరింపవలెను. "శ్వశ్ఛర్దయితవ్యం" అనుదానితో కఫమును ఎక్కువగా చేయు భోజనమును చెప్పెను. 'శ్వ' అనగా మరునాడు, వ్యుషిత మనగా ఒకరాత్రి అతిక్రమించినది (దాటినది) 'నిరన్న'మని పదచ్ఛేదము చేయవలెను.'అనతి స్నిగ్ధ'మను దానితో వమన కర్మ చేయుదినమునందే యవాగును ఘృతముతో కలిపి ఎక్కువ స్నిగ్ధుడు కాని వానికి కొద్ది ఘృతమును త్రాగించినవానికి వమన కర్మ చేయు దినమున యవాగు పానము "పేశలైః వివిధైరన్నైః దోషానుత్క్లేశ్యదేహినః స్నిగ్ధస్విన్నాయ వమనం దత్తం సమ్యక్ ప్రవర్తతే అథాపరేద్యు పూర్వాహ్ణే సాధారణే కాలే వమన-ద్రవ్య కషాయకల్కచూర్ణస్నేహానామన్యతమస్య" (సు.చి.అ.33) అని సుశ్రుతుని వచనానుసారము చెప్పిరి. 'అంతర్నఖముష్టిం' అనగా గోళ్ళు లోపల నుండునట్లు చేయు పిడికిలి ప్రమాణము. యావద్వా-సాధుమన్యేత్" అనుదానితో బలము, దోషము మొదలైన భేదములలో స్థిరత్వము లేకుండుట అని చెప్పెను. (దోషాదుల భేదమును అనుసరించి ఔషధము యొక్క ప్రమాణము మారుచుండును అని అర్థము.) యష్టి మధుకమునకు కోవిదారాదులతో విడగొట్టి చెప్పిన పాఠము అనుసరించి (ప్రస్తుత శ్లోకము నందు) తరువాత ప్రయోగములలో యష్టిమధుకము మినహాయించి కోవి దారము మొదలగువానిని గ్రహించవలెనని అర్థము. కోవిదారము తన పేరుతో ప్రసిద్ధమైనవి. అది శరత్కాలమున పూయుచున్నది. కర్బుదారము అనగా కాంచ నారము అది వసంతమున పూయుచున్నది. నీపమనగా కదంబము (కడిమి). విదుల అనగా వేతసము (ప్రబ్బలి). శణపుష్పి అనగా ఘంటారావము. సదాపుష్పి అనగా అర్కపుష్పికా, ప్రత్యకీపుష్పి అనగా ఉత్తరేణి. "రాత్రి ముషితం విమృద్యపూతం" అనగా శృతకషాయము (కాచి చల్లార్చిన కషాయము) [illegible] కషాయమును చూపించుట (ఉదా. శీతకషాయము). [illegible] కషాయపానమునందు శీతకషాయ విధానము ఇచ్చట చెప్పబడుచున్నవి. పూర్ణం శరావం అనగా పూర్ణకుంభమువలె మంగళము కొరకు (అని అర్థము). పూర్ణశబ్దము మంగళ వాచకము. ఇచట ప్రయోగించబడినది. పునఃపునః అనగా పిత్తము వచ్చు వరకు మాటిమాటికి కషాయము త్రాగించవలెనని అర్థము. "పిత్తాన్తమిష్టం వమనం విరేకాదర్ధం" (సి.అ. 1) అని మరియొకచోట కూడా చెప్పబడినది. 'హీనవేగం' అను దానితో వమన అయోగముచే కల్గిన హీన వేగ ప్రవృత్తియొక్క చికిత్స కొరకు అని చెప్పెను.

## వమనాయోగమున చేయదగిన ఉపాయము

15. సర్వేషు తు మధుసైంధవం కఫవిలయనచ్ఛేదార్థం వమనేషు విదధ్యాత్ న చోష్ణ విరోధో మధునశ్ఛర్దనయోగయుక్తస్య, అవిపక్వప్రత్యాగమనాద్దోషనిర్హరణాచ్చ.

తాత్పర్యము : వమనౌషధములన్నిటియందు కఫము పలుచబడి ఛేదింపబడి బయటకు వచ్చుటకు మధు (తేనె) సైంధవ లవణములను చేర్చవలెను. తేనె ఉష్ణ ద్రవ్యములతో చేర్చిన విషముతో సమానముగ అగునని చెప్పినను, వమనకర్మయందు అది పక్వము కాకుండా బయటకు వెడలును మరియు దోషములు నిర్హరణము చేయును కనుక వమనౌషధమున మధు సైంధవ లవణములను చేర్చినను విరోధింపవు.

ఆయుర్వేద దీపిక : క్షీరయవాగు మొదలైన వమన యోగములలో మధు, సైంధవయోగము లేకున్నను 'సర్వేషు' అను పదము ప్రాయికముగా (తరచు) అని అర్థము. "మధూష్ణముష్ణార్తమథవా" (సూ.అ. 27) అని చెప్పుటవలన ఉష్ణమైన వమన కషాయమునందు తేనె వేయుట విరోధమగుట వలన కూడదని శంకించి "నచోష్ణ విరోధీ మధునః" అని దానితో సమాధానము చెప్పెను. 'అవిపక్వ ప్రత్యాగమనాత్' అనుదానితో తేనె ఉష్ణ పదార్థములతో కలిపి జఠరాగ్ని సంబంధముచే పక్వమైనపుడు విరోధించును (విషతుల్యమగును) అని చూపించుచున్నాడు. "దోషనిర్హరణాత్" అనగా ఉష్ణమైన తేనె విరుద్ధమైనను వేడి అయిన వమన యోగములందు కోరబడుచున్నది. (అనగా విరుద్ధము కానేరదు). అటువంటి వమన ఔషధము దోషమును బయటికు పంపుటచే విరుద్ధము కానేరదని చూపుచున్నాడు. ఈ విధముగా వస్తి ప్రయోగమందును తేనెకు వేడి విరోధిత్వము లేకుండుట వర్ణింపదగినది. (అనగా వస్తియందు కూడా ఉష్ణమైన తేనె వాడవచ్చునని అర్థము). దీనిచేత యష్టిమధు మొదలైన తొమ్మిది ద్రవ్యములచే చేయబడిన తొమ్మిది కషాయములతో తొమ్మిది యోగములు సిద్ధించుచున్నవి.

## మదనఫలమాత్రాయోగములు ఎనిమిది

16. ఫలపిప్పలీనాం ద్వౌ ద్వౌ భాగౌ కోవిదారాదికషాయేణ త్రిఃసప్తకృత్వః
స్రావయేత్, తేన రసేన తృతీయం భాగం పిష్ట్వా మాత్రాం హరీతకీభిర్వి

భీత స్త్రైరామల స్త్రైర్వా తుల్యాం వర్తయేత్, తాసామేకాం ద్వే వా పూర్వోక్తానాం కషాయాణామన్యతమస్యాఞ్జలిమాత్రేణ విమృద్య బలవచ్ఛ్లేష్మప్రసేకగ్రన్థి జ్వరోదరారుచిషు పాయయేదితి సమానం పూర్వేణ".

**తాత్పర్యము :** పైన చెప్పబడినట్లు మ్రంగ విత్తనములు గ్రహించి మూడు భాగములుగ చేసి, వానియందు రెండు భాగములను గ్రహించి, పైన చెప్ప బడిన కోవిదార మొదలగు ద్రవ్యములలో ఒక ద్రవ్యమును క్వాథము చేసి, ఆ క్వాథమున మ్రంగ విత్తనములను ఒక రాత్రి భావనచేసి, మరునాడు ఉదయమున పిసికి, కషాయమును మాత్రము బయటకు వంచుకొనవలెను. ఈ విధముగ ఆ కషాయముననే మరల రెండు భాగముల విత్తనములను భావనచేసి కషాయము మాత్రము గ్రహించ వలెను. ఈ విధముగా ఇరువది ఒక్క (21)సార్లు భావనచేసి, గ్రహింపబడిన కషాయమును మూడవ వంతుగ ఉంచబడిన మ్రంగకాయ విత్తనముల కల్కముతో కలుపుకొని మెత్తగ నూరి కరక్కాయ, తానికాయ, ఉసిరికాయ వీనిలో ఏదైనా కాయ యొక్క ప్రమాణములో కల్కమును కషాయమునందు నూరి కలిపి, వమనము చేయింపవలసిన రోగికి త్రాగింపవలెను. ఈ ఔషధమును మిక్కిలి అధికముగ కఫము కారునప్పుడును, గ్రన్థి రోగమునందు, జ్వరమునందును, ఉదరమునందు, అరుచియందు ప్రయోగింపవలెను. మిగిలిన పూర్వకర్మలన్నియు పైన చెప్పబడినట్లుగానే చేయవలెను.

**ఆయుర్వేద దీపిక :** 'ఫలపిప్పలీనాం ద్వౌ భాగౌ' అనుదానిలో మదన ఫల పిప్పలీను మూడు భాగములు చేయవలెను. అందు రెండు భాగములను ఆరురెట్లు కోవిదారాది కషాయముతో క్షారపరిస్రావం విధివలె ఇరువదియొక్క (21) సార్లు వడగట్టవలెను. కోవిదారము మొదలైన ఎనిమిదింటికి ఎనిమిది (8) కషాయములు వేరుగా వడగట్టుటలో ప్రయోగింపదగినవి. ఏ కషాయముతో రెండు భాగములు గల మ్రంగ గింజలు భావనచేసి వడగట్టబడునో, ఏ కషాయముతో మూడు (3) వంతుల ప్రమాణమున్న మ్రంగ విత్తనముల కల్కముతో కరక్కాయ మొదలగువాని పరి మాణము గల్గినటువంటి ఉండలుగా చేయబడునో, అదే కషాయముతో మాత్రా యోగములు (చెప్పబడుచున్నవి). ఇట్లు కరక్కాయ మొదలైన ప్రమాణములలో నిర్దేశింపబడిన ఎనిమిది (8) ఫలపిప్పలీ యోగములు అగుచున్నవి. దోషముల యొక్క అంశాంశ కల్పన మరియు బలాదులను దృష్టియందు ఉంచుకుని, మాత్రా వికల్పము చేయబడినదని తెలిసికొనదగినది. "సమానం పూర్వేణ" అనగా ముందు

చెప్పిన యోగమువలె స్నేహము, స్వేదము, అభిమన్త్రణము మొదలైన విధానము చేయదగినది అని అర్థము. ఈ విధముగా మరియొకచోట కూడా పూర్వమువలె శబ్దము యొక్క అర్థము తెలిసికొనదగినది.

## ఫలపిప్పలీ క్షీరఘృతాదియోగములు ఐదు

17. ఫలపిప్పలీక్షీరం, తేన వా క్షీరయవాగూమధోభాగే రక్తపిత్తే హృద్దాహే చ; తజ్జస్య వా దధ్న ఉత్తరకం కఫచ్ఛర్దితమకప్రసేకేషు, తస్య వా పయసః శీతస్య సన్తానికాఞ్జలిం పిత్తే ప్రకుపితే ఉరఃకణ్ఠహృదయే చ తనుకఫోపదిగ్ధే, ఇతి సమానం పూర్వేణ

**తాత్పర్యము :** మదన ఫలము గింజలను చేర్చి పక్వము చేయబడిన క్షీరమును, యవాగును, అధోగత రక్త పిత్తము నందును, హృద్దాహము నందును, వమనమునకై త్రాగించవలెను. పై క్షీరముతో తయారు చేయబడిన పెరుగు యందలి మీగడను కఫజ వమనము నందును, తమకశ్వాస యందుకు, ప్రసేకము నందును ఈయవలెను. పై క్షీరము చల్లారిన తరువాత దానిపై వచ్చు మీగడను నాల్గు పలములు పిత్తము ప్రకోపించి నపుడును, కంఠము నందును, హృదయము నందును, స్వల్పముగా కఫముచే ఆవరింపబడినపుడును వమనమునకు ఉపయోగింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** ఫలపిప్పలీ క్షీరపాక విధానమును అనుసరించి సాధింపబడిన క్షీరము ఫలపిప్పలీ క్షీరము. ఇది ఒక యోగము. 'తేన' అనగా ఫలపిప్పలీసాధిత క్షీరముతో అని అర్థము. 'తజ్జస్య' అనగా ఫలపిప్పలీక్షీరముతో చేయబడిన పెరుగునకు (అని అర్థము). 'ఉత్తరకం' అనగా పెరుగు మీగడ. సన్తానికా అనగా పాలపై నుండు పల్చటి భాగము (తొరక).

18. ఫలపిప్పలీశృతక్షీరాన్నవనీతముత్పన్నం ఫలాది కల్క-
కషాయసిద్ధం కఫాభిభూతాగ్నిం విషష్యద్దేహం చ
మాత్రాయా పాయయేదితి సమానం పూర్వేణ.

**తాత్పర్యము :** ప్రమంగకాయల విత్తనముల చేర్చి కాచబడిన క్షీరము నుండి తీయబడిన నవనీతము నందు వసున ఫల ద్రవ్య కల్కమును, వాని కషాయమును చేర్చి ఘృత పాకము అనుసరించి పక్వము చేసి, ఆ ఘృతమును కఫముచే జారరాగ్ని

మందగించి నప్పుడును, శరీరము శుష్కించి నపుడును, తగినంత మాత్రలో సేవింప చేయవలెను. పూర్వ కర్మలను పూర్వము చెప్పబడినట్లు చేయవలెను.

ఆయుర్వేదదీపిక : ఫలము మొదలైనవి - మదన ఫలము - జీమూతకము (దేవదాలి) - ఇక్ష్వాకు (చేదుసొర) - ధామార్గవ (పెద్ద చేదు బీర) - కుటజ (కొడిసెపాల) - కృతవేధన (చిన్న చేదు బీర) — అను ఆరు. ఇవి నాల్గు క్షీర యోగములతో, ఘృత యోగముతోను కూడా కలిపి పంచ యోగములుగా అధ్యాయ సంగ్రహమున చెప్పదగినవి.

## వమనమునకు మదనఫల ఘ్రాణయోగము-ఒకటి

19. ఫలపిప్పలీనాం ఫలాదికషాయేణ త్రిఃసప్తకృత్వః సుపరిభావితేన పుష్పరజః ప్రకాశేన చూర్ణేన సరసి సంజాతం బృహత్సరోరుహం సాయాహ్నే ఒవచూర్ణయేత్, తద్రాత్రివ్యుషితం ప్రభాతే పునరవచూర్ణితముద్ధృత్య, హారిద్రా కృసరక్షీరయవాగూనామన్యతమం సైన్ధవగుడఫాణితయుక్తమాకణ్ఠం పీతవన్తమాఘ్రాపయేత్, సుకుమారముత్క్లిష్ట పిత్తకఫమౌషధద్వేషిణమితి సమానం పూర్వేణ.

తాత్పర్యము : మంగకాయ గింజలను పుప్పొడి వలె వుండునట్లు పొడి చేసి, ఆ చూర్ణమును, వమన ఫల ద్రవ్య కషాయము నందు ఇరువదియొక్క (1) సార్లు భావన చేసి, దానిని సరస్సునందు ఉన్నట్టి యొక పెద్ద తామర పువ్వుపై చల్లి, రాత్రి అంతయు వుంచి, మరునాడు ఆ పువ్వును గ్రహించి, మరల ఫలచూర్ణమును చల్లి యుంచుకొనవలెను. తర్వాత వమనము చేయించదగినవానికి పసుపును చేర్చి పక్వము చేయబడిన కృశరము (పులగము) నైనను, క్షీరమునైనను, యవాగునైనను అందు కొంచెము సైంధవ లవణము, బెల్లమును, చక్కెర పానకమును చేర్చి కంఠము వరకు త్రాగించి, పిమ్మట పైన చెప్పబడిన తామర పువ్వును అఘ్రాణింప చేయవలెను. ఈ ఔషధమును సుకుమారులకు, పిత్త కఫములు వమనోన్ముఖములై ఉన్నపుడు ఉపయోగింపవచ్చును. మిగిలిన పూర్వ కర్మలు పైన చెప్పబడినట్లుగానే చేయవలెను.

ఆయుర్వేదదీపిక : 'ఫల పిప్పలీనాం ఫలాది కషాయేణ' అను దానితో ఒక ప్రేయ యోగమును చెప్పెను 'పుష్ప రజః ప్రకాశేన' అనగా పుప్పొడితో సమానమైన (అని అర్థము). హారిద్రా అను పేరు గల కృశరము (పులగము) హారిద్రా కృశరము.

## మదనఫల ఫాణితయోగము-ఒకటి

20. ఫలపిప్పలీనాం భల్లాతక విధిపరిస్రుతం స్వరసం పక్త్వా ఫాణితీభూతమాత-స్తురీభావాల్లేహయేత్, ఆతపశుష్కం వా చూర్ణీకృతం జీమూతకాదికషా-యేణ పిత్తే కఫస్థానగతే పాయయేదితి సమానం పూర్వేణ.

**తాత్పర్యము :** మ్రంగకాయ విత్తనములను, భల్లాతక విధి ప్రకారము పక్వము చేసి దానినుండి స్వరసము గ్రహించి, ఆ స్వరసమును పాకము వలె తీగెలు సాగునంత వరకు పక్వము చేసి, ఆ లేహ్యమును పిత్తము ప్రకుపితమై కఫస్థానమును చేరినపుడు రోగికి వమనమునకు ఇచ్చిన వమనము అగును. మ్రంగకాయ విత్తనములను ఎండలో ఎండించి చూర్ణము చేసి, జీమూతకాది కషాయము నందు కల్పి త్రాగించిన వమనము అగును.

**ఆయుర్వేదదీపిక :** 'భల్లాతకవిధిపరిస్రుతం' అనగా రసాయన ప్రకరణములో చెప్పబడిన 'భల్లాతక తైలం'ను గ్రహించు విధానముతో వడగట్ట బడిన స్వరసము గ్రహింపదగినది. ఇది ఒక ఫాణిత యోగము. 'ఆతపశుష్కం వా' అనునది ఒక చూర్ణ యోగము కూడా (అని భావము).

## మదనఫలవర్తియోగము-ఒకటి

21. ఫలపిప్పలీచూర్ణాని పూర్వవత్ ఫలాదీనాం షణ్ణామన్యతమకషాయస్రుతాని వర్తిక్రియాః ఫలాదికషాయోపసర్జనాః పేయా ఇతి సమానం పూర్వేణ

**తాత్పర్యము :** మ్రంగకాయల విత్తనముల చూర్ణమును వమన ద్రవ్య సిద్ధ కషాయము నందు కల్పి పై చెప్పబడిన మదన ఫలాది ఆరు కషాయములలో ఏదో ఒకదానిలో మర్దన చేసి, వర్తులను చేయవలెను. ఆ వర్తులను ఫలాది కషాయముతో చేర్చి సేవించవలెను. పూర్వకర్మలు ముందు చెప్పబడిన విధముగనే చేయవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'ఫలపిప్పలీ చూర్ణాని' అనుదానితో మదన ఫలము మొదలైన ఆరు కషాయ భేదములతో ఆరు వర్తికా ప్రయోగములను తెలుసుకొనదగినది. వర్తి క్రియలో నాలుగు రెట్లు కషాయముతో వండుట వలన గుటికలాకారమున చేయదగినది. ఇక్కడ కూడా అట్లే లేహాదుల సామాన్య విధిని అనుసరించి తేనెను కలుపవలెను. దానిని కొంతమంది తేనెను పాకము చేయుట (వేడి చేయుట) విరోధించుట వలన అంగీకరించుట లేదు.

## మదనఫల ఇరువది లేహయోగములు

22. ఫలపిప్పలీనామారగ్వధ-వృక్షక-స్వాదుకణ్టక-పాఠా-పాటలా-శార్ఙ్గేష్టా-మూర్వా సప్తపర్ణ-నక్తమాల-పిచుమర్ద-పటోల-సుషవీ-గుడూచీ-సోమవల్క-ద్వీపికానాం పిప్పలీ-పిప్పలీమూల-హస్తిపిప్పలీన-చిత్రక-శృఙ్గవేరాణాం చాన్యతమకషాయేణ సిద్ధో లేహ ఇతి సమానం పూర్వేణ.

**తాత్పర్యము :** ఆరగ్వధ (రేల), వృక్షక (కొడిసెపాల), స్వాదుకణ్టక (వికంకత), పాఠా (చిరుబొద్ది), పాటలా (కలిగొట్లు), శార్ఙ్గేష్టా (గురువింద), మూర్వా (చాగ), సప్తవర్ణ (ఏడాకుల పొన్న) నక్తమాలా (కానుగ), పిచుమర్ద (వేప), పటోల (చేదు పొట్ల), సుషవీ (కాకర), గుడూచీ (తిప్పతీగె), సోమవల్క (వెలిచంద్ర), ద్వీపికా (హింస్రా), పిప్పలీ (పిప్పళ్ళు), పిప్పలీమూల (మోడి), హస్తి పిప్పలీ (గజపిప్పలీ), చిత్రక (చిత్రమూలము), శృంగవేరం (శుంఠి) అను ఈ ద్రవ్యముల యొక్క ఒక్కొక్క కషాయము నందు క్రమంగరాయ విత్తనముల చూర్ణమును కలిపి లేహ పాకము అనుసరించి లేహ్యము తయారు చేయవలెను. పూర్వ కర్మలు ముందు చెప్పబడిన విధముగనే చేయవలెను.

ఆయుర్వేదదీపిక : 'ఫల పిప్పలీనాం ఆరగ్వధ' ఆరగ్వధ మొదలైన 20 ద్రవ్యముల కషాయ భేదముతో చేయుట వలన 20 లేహములు తెలిసి కొనదగినవి. వృక్షకమనగా కొడిశెపాల, స్వాదుకంటక అనగా వికంకతము. శార్ఙ్గేష్ఠా అనగా గుంజా (గురువింద). సుషవీ అనగా కారవేల్లకం (కాకర). ద్వీపికా అనగా హింస్రా, కొందరు కంటకారి అని అందురు.

## మదన ఫలఉత్కారికాయోగములు ఇరువది

23. ఫలపిప్పలీష్వేలా-హరేణుకా-శతపుష్పా-కుస్తుమ్బురు-తగర-కుష్ఠ-త్వక్-చోరక-మరుబకాగరు-గుగ్గుల్వేలవాలుక-శ్రీవేష్టక-పరిపేలవ-మాంసీ-శైలేయక-స్థౌణేయక-సరల-పారావతపద్యశోకరోహిణీనాం-వింశతేరన్యతమస్య కషాయేణ సాధితోత్కారికా ఉత్కారికాకల్పేన, మోదకా వా మోదక కల్పేన, యథాదోషరోగభక్తి ప్రయోజ్యా ఇతి సమానం పూర్వేణ.

**తాత్పర్యము :** ఏల (ఏలకులు) హరేణుకా (రేణుకలు) శతపుష్పా (సదాప), కుస్తుమ్బురు (ధనియాలు), తగర (గ్రంథితగరము), కుష్ఠ (చెంగల్వ కోష్ఠు) త్వక్ (లవంగ పట్ట), చోరక (కచోరములు), మరుబక, అగరు, గుగ్గులు, ఏల వాలుక (నాగుదోన ?), శ్రీవేష్టక, పరిపేలవ, మాంసీ (జటామాంసీ), శైలేయక (శైలేయకము), స్థౌణేయకము, సరల, పారావతపది, అశోకరోహిణి అను ఈ 20 ద్రవ్యములలో ఏదైన ఒకదానిని చేర్చి కషాయము కాచి మ్రంగవిత్తుల చూర్ణమును ముద్దగా చేసి దానిని అపూపముగా చేసి పై చెప్పిన కషాయము యొక్క ఆవిరి యందు ఉడికించవలెను. మరియు ఆ చూర్ణముచే కుడుములుగ చేసి పైన చెప్పబడిన కషాయమునందు ఆవిరిచే ఉడికించవలెను వీనిని రోగానుసారము, దోషానుసారము, రోగి ఇష్టానుసారము ఉపయోగించిన వమనములు చక్కగా అగును.

**ఆయుర్వేదదీపిక :** 'ఫలపిప్పలీషు' అనుదానితో ఉత్కారికలు, మోదక యోగములు ప్రత్యేకముగా ఇరువది (20) చెప్పబడినవి. చోరక అను సుగంధ ద్రవ్యము తనపేరుతో ప్రసిద్ధమైనది. పరిపేలవం అనగా కైవర్తముస్త కము. స్థౌణేయమనగా గ్రంథ పర్ణకము. పారావతపది అనగా జ్యోతిష్మతీ. అశోక రోహిణి అనగా అశోకమును పోలిన ఆకులు గల తీగ, కొందరు 'కటుక రోహిణి' అనుచున్నారు. కొందరు ఇచ్చట స్థౌణేయకమును వదిలి అపాకీపాద్యను కలిపి ఇరువదిగా లెక్కించుచున్నారు. అపాకీపాదీ తన పేరుతో ప్రసిద్ధమైనది. 'ఉత్కారికా కల్పేన' అనగా పాకశాస్త్రమున చెప్పబడిన ఉత్కారికా విధానమునను సరించి (అని అర్థము).

## మదనఫల పదనారు శష్కులీ-అపూపయోగములు

24. ఫలపిప్పలీస్వరసకషాయపరిభావితాని తిలశాలితణ్డులపిష్టాని
తత్కషాయోపసర్జనాని శష్కులీకల్పేన వా శష్కుల్యః,
పూపకల్పేన వా పూపాః, ఇతి సమానం పూర్వేణ

25. ఏతేనైవ చ కల్పేన సుముఖ-సురస-కుఠేరక-కాణ్డీర-కాలమాలక-పర్ణాసక-క్షవక-ఫణిజ్జక-గృఞ్జన-కాసమర్ద—భృఙ్గరాజానాం-పోటేక్షువాలికా—కాలఙ్కతక దణ్డైరకాణాం వాన్యతమస్య కషాయేణ కారయేత్.

**తాత్పర్యము :** మ్రంగకాయల గింజల స్వరసమునందుగానీ, కషాయము నందుగానీ తిలలను, శాలి ధాన్యమును భావనాది ప్రకారము భావనచేసి, పిండిచేసి ఆ పిండిని ఆ కషాయమును కలిపి పక్వము చేసి శష్కులీ కల్క ప్రకారము శష్కులములనైనను, అపూప విధి ననుసరించి అపూపముల నైనను చేయవలెను. వీనిని వమనమునకై పైన చెప్పబడిన విధి ప్రకారము సేవింప చేయవలెను. పైన చెప్పబడి నట్లు భావన చేయబడిన పిండిని - సుముఖ (ఎఱ్ఱ ఆవాలు), సురస (తులసీ), కాణ్డీర, కాలమాలక (కారవేల్లకం), పర్ణాసక, క్షవక్, ఫణిజ్జక, గృఞ్జన, కాసమర్ద, భృంగరాజ, పోట, ఇక్షువాలికా, కాలఙ్కతక, దణ్డైరకా అను ఈ ద్రవ్యముల కషాయము నందు వేరువేరుగా ఒక్కొక్కదాని యందు పిండిని కల్పి శష్కులీ యోగములనైనను, అపూప యోగముల నైనను చేసి వమనమునకై పైన చెప్పబడిన విధి ప్రకారము సేవింప చేయవలెను. మిగిలిన పూర్వకర్మలు అన్నియు పైన చెప్పబడిన ప్రకారమే చేయవలెను.

**ఆయుర్వేద దీపిక :** 'ఫలపిప్పలీ స్వరసేన' అనుదానితో శష్కులీ, అపూపములకు వేరుగా ఒక యోగమును చెప్పెను. 'ఏతేనైవచ కల్పేన' అను దానితో సుముఖ మొదలైన పదిహేను ద్రవ్యముల కషాయముతో వేరు వేరుగా శష్కులీ అపూపములను చేయుట వలన పదిహేను యోగములు అగుచున్నవి. ఈ విధముగా కలిసి శష్కులీ అపూపములకు వేరు వేరుగా 16 యోగములు అగుచున్నవి పోటా అనగా ఇక్షుగంధ. దణ్డైరకా అనగా గుంద్రమను పేరుగల్గిన గుల్మము లేక నలము గాని.

## మదనఫల పది షాడవాదియోగములు

26. తథా బదరషాడవ-రాగ-లేహ-మోదకోత్కారికా-తర్పణ-పానక-మాంసరస యూష-మద్యానాం మదనఫలాన్యన్యతమేనోపసృజ్య యథాదోషరోగభక్తి దద్యాత్. తైః సాధు వమతీతి.

**తాత్పర్యము :** రేగుపండ్లతో తయారుచేయబడిన షాడవము, రాగము, లేహము, మోదకము, ఉత్కారికా, తర్పణము, పానకము, మాంసరసము, యూషము, మద్యము అని 10 విధములైన ద్రవములలో దేనియందైనను మ్రంగ గింజల చూర్ణ మును కలిపి వమనమునకై ఉపయోగించవచ్చును. వానిలో రోగి యొక్క దోష

మును. రోగమును ఇష్టమును గమనించి వానికి అనుకూలమైన వానియందు చేర్చి ఉపయోగించవచ్చును అట్లు చేసిన చక్కగ వమనములు అగును.

ఆయుర్వేద దీపిక : బదర షాడవ అనుదానితో పదియోగములు. బదరము చేత చేయబడిన షాడవము బదర షాడవము.

## మదనఫల పర్యాయనామములు

27. మదనః కరహాటశ్చ రాఠః పిణ్డీతకః ఫలమ్
శ్వసనశ్చేతి పర్యాయైరుచ్యతే తస్య కల్పనా

**తాత్పర్యము :** మదనము, కరహాటము, రాఠము, పిండీతకము, ఫలము, శ్వసనము అను ఈ పర్యాయ పదములచే మ్రంగకాయ చెప్పబడును. కావున వాని కల్పనా స్థలములందు ఇవి చెప్పబడిన మ్రంగకాయ అని తెలిసికొనవలెను.

ఆయుర్వేద దీపిక : 'మదన కరహాటశ్చ' అను దానితో మదన ఫలము యొక్క వ్యవహారము కొరకు పర్యాయ పదములను చెప్పెను. "తస్య కల్పనా" అనగా ఇటువంటి పర్యాయ పదములతో వ్యాఖ్యానము చేయబడిన దానికి యిది కల్పన (అని అర్థము). దేనికి పర్యాయ పదములను చెప్పుట ఎక్కువ ప్రయోగము లలో చెప్పబడుట వలన అధిక హితకరమగుట వలన అని తెలిసికొనదగినది (ఈ మదనఫలము అనేక ప్రయోగములలో ఉపయోగించుట వలన దీనికి పర్యాయ పద ములను చెప్పుట జరిగినది అని భావము). ఈ విధముగా ఇతర ద్రవ్య ప్రయోగ విధానములందు పర్యాయములు చెప్పుటలో ప్రయోజనము వర్ణింపదగినది.

## అధ్యాయ విషయసంగ్రహము

తత్ర శ్లోకాః—

28. నవ యోగాః కషాయేషు, మాత్రాస్వష్టౌ, పయోఘృతే
షట్చ, ఫాణితచూర్ణే ద్వౌ ప్రోక్షయే వర్తిక్రియాసు షట్.

29. వింశతిర్వింశతిర్లేహమోదకోత్కారికాసు చ
శష్కులీపూపయోశ్చోక్తా యోగాః షోడశ షోడశ

30. దశాన్యే షాడవాద్యేషు త్రయస్త్రింశదిదం శతం
యోగానాం విధివద్దిష్టం ఫలకల్పే మహర్షిణా

**తాత్పర్యము :** ప్రమంగకాయ వి త్తనములతో

| | |
|---|---|
| కషాయి యోగములు | 9 |
| మాత్రా యోగములు | 8 |
| క్షీర యోగములు | 4 |
| ఘృత యోగము | 1 |
| ఫాణిత యోగము | 1 |
| మార్ణ యోగము | 1 |
| ప్రమియి యోగము | 1 |
| వర్తి యోగములు | 6 |
| లేహ యోగములు | 20 |
| మోదక యోగములు | 20 |
| ఉత్కారికాది యోగములు | 20 |
| షాడవ యోగములు | 10 |
| శష్కులీ యోగములు | 16 |
| అపూపయోగములు | 16 |
| | 133 |

ఈ విధముగా ఇవి అన్నియు కలిపి మదన ఫలకల్కముచేనైన వమనౌషధ యోగములు నూట ముప్పైమూడున్ను (133) ఈ అధ్యాయమున మహర్షియగు ఆత్రేయులచే ఉపదేశింపబడిన రీతి అగ్నివేశులచే విద్యుక్త ప్రకారము వివరింపబడినది.

**ఆయుర్వేద దీపిక :** "నవయోగాః" అను దానితో మదనఫల యోగము లకు తొమ్మిది మొదలైన సంఖ్యల ఉత్కర్షను పోగొట్టుటకు, సుఖముగా (తేలికగా) స్మరించుటకు వాటిని సంగ్రహముగా చెప్పెను. దీని అర్థము దానికి తగిన ప్రదేశ మున చెప్పబడినది.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతేఽప్రాప్తే దృఢబలసంపూరితే కల్పస్థానే మదనకల్పో నామ ప్రథమోఽధ్యాయః

**తాత్పర్యము :** ఈ విధముగా లభ్యము కాకపోవుటచే దృఢబలునిచే పూరింపబడిన, చరకుని ద్వారా ప్రతి సంస్కరింపబడిన అగ్నివేశకృత తంత్రము నందలి కల్పస్థానములో "మదన కల్పము" అను ప్రథమ అధ్యాయము.

ఇతి శ్రీచక్రపాణిదత్తవిరచితాయాం చరకతాత్పర్యటీకాయాం ఆయుర్వేద-దీపికాయాం కల్పస్థానె మదనకల్పో నామ ప్రథమోఽధ్యాయః

శ్రీ చక్రపాణి దత్తునిచే రచింపబడిన "ఆయుర్వేద దీపిక" అనెడు చరక తాత్పర్యటీకా యందు కల్పస్థానములో 'మదన కల్పము' అను పేరుగల ప్రథమ అధ్యాయము.

# ద్వితీయాధ్యాయము

1. అథాతో జీమూతకల్పం వ్యాఖ్యాస్యామః Luffa echinata

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః

అటు తరువాత జీమూతకకల్పమును వ్యాఖ్యానము చేయగలము. భగవంతుడైన ఆత్రేయుడు ఈ విధముగా చెప్పెను

**ఆయుర్వేదదీపిక** : మదన కల్పము తరువాత నిరపాయత్వమునందు మిగిలిన ఇక్ష్వాక్వాది ద్రవ్యములలో జీమూతకమునకు ప్రాధాన్యతయుండుట వలన జీమూతకకల్పము చెప్పబడుచున్నది. ఏ విధముగా ద్రవ్యములు తమయందు గల నిరపాయత్వ గుణముచేత ప్రాధాన్యత కల్గియుండునో అట్టి ప్రాధాన్యత క్రమము బట్టియే అవి ఒకదాని తరువాత ఇంకొకటి చెప్పబడుచున్నవి. వమనౌషధములలో వరుసగ చెప్పబడు మదన - జీమూతక - ఇక్ష్వాకు - ధామార్గవ - వత్సక - కృత వేధనము అను ఆరింటిలో పూర్వము ఒకదానికన్న నొకటి నిరపాయమగుటచే శ్రేష్ఠముగనుండును. అందువలన ఇతర కల్పములకు ఆయా అధ్యాయములతో గల సంబంధము ఇక్కడనే చెప్పబడినదిగా గ్రహించవలెను. మదన ఫలమునకు స్నేహ స్వేదాది పూర్వకర్మలవలె ఇక్కడ కూడా అదే క్రమము అతిదేశము వలన ప్రాధాన్యతచే గ్రహింపబడినది.

## జీమూతక పర్యాయనామములు

3. కల్పం జీమూతకస్యేమం ఫలపుష్పాశ్రయం శృణు
గరాగరీ చ వేణీ చ తథా స్యాద్దేవతాడకః

**తాత్పర్యము** : దేవతాడక (దావరడంగి)యొక్క ఫలములను, పుష్పములను ఆశ్రయించిన ఔషధ కల్పమును (వమనమునకై) చెప్పెద వినుమని అర్థము. గరాగరీ, వేణీ, దేవతాడకమనునవి జీమూతకము యొక్క పర్యాయ నామములు.

**ఆయుర్వేదదీపిక** : "ఫలపుష్పాశ్రయం" అను వచనముచే ఈ కల్పమున వమనమునకై దేవతాడియొక్క ఫలములను, పుష్పములను గ్రహింపవలెను గాని ఆకులు, కాడలు మున్నగునవి నిషిద్ధమని తెలియదగును. గరాగరీ మొ॥నవి పర్యాయ నామములుగా గ్రహింపవలెను. జీమూతమును పీతఘోషమని చక్రపాణి వివరించెను. బహుశ పచ్చపువ్వులు గల దావరడంగిని గ్రహింపవలెనని దీని భావమై యుండవచ్చును.

## జీమూతక గుణములు

4. జీమూతకం త్రిదోషఘ్నం యథాస్వౌషధకల్పితమ్
ప్రయోక్తవ్యం జ్వరశ్వాసహిక్కాద్యేష్వామయేషు చ

**తాత్పర్యము :** జీమూతకము త్రిదోషహరము. వాతాది దోషహరములగు ఔషధములతో చేర్చియు, కల్పించియు నుపయోగించినచో నాయా దోషములను హరించును. జ్వరము, శ్వాస, హిక్క మున్నగు రోగములందు ఆయా రోగముల హరించు నౌషధములను చేర్చి కల్పించి ఉపయోగించదగును.

**ఆయుర్వేదదీపిక :** వాతహరాది ద్రవ్యములతో చేర్చి కల్పించి ఉపయోగించినచో త్రిదోషఘ్నముగా పనిచేయును. "హిక్కాద్యేష్వితి" అనుదానియందు 'ఆది' శబ్దముచే ఉరస్సును ఆశ్రయించి జనించు కాస మొ॥గు రోగములను గ్రహించవలెనని చక్రపాణి భావము.

## జీమూతక క్షీరయోగములు (ఆరు) - సురామణ్డయోగము (ఒకటి)

5. "ఉపవోక్తగుణయుక్తానాం దేశజానాం యథావిధి
పయః పుష్పేఽస్య, నివృత్తే ఫలే పేయా పయస్కృతా
6. లోమశే క్షీరసంతానం, దధ్యుత్తరమలోమశే
శృతే పయసి దధ్యమ్లం జాతం హరితపాణ్డురే
7. జీర్ణానాం చ సుశుష్కాణాం న్యస్తానాం భాజనే శుచౌ
చూర్ణస్య పయసా శుక్తిం వాతపిత్తార్దితః పిబేత్

**తాత్పర్యము :** మదన కల్పమున సామాన్యముగ చెప్పబడిన గుణ వీర్య దేశకాలాది సంపత్తు కలిగి విధ్యుక్త ప్రకారము గ్రహింపబడి యథావిధిగ గ్రహించి యుంచబడిన దేవదాలి మొక్క పుష్పములు చేర్చి కాచబడిన పాలను, లేత పిందెలుగ నుండు దేవదాలి ఫలముల చేర్చి కాచబడిన పాలచే సిద్ధము చేయబడిన యవాగును రోమములబోలిన నూగుతో కూడియుండు కాయల చేర్చి కాచబడిన పాలపై మీగడను, నూగులేని కాయలతో పాలను కాచి ఆ పాలతో సిద్ధము చేయబడిన పెరుగుపై నుండు మీగడను, పచ్చని రంగును పాండు వర్ణమును కల్గి చక్కగ ముదిరిన దేవదాలి కాయలచేర్చి కాచబడిన పాలతో సిద్ధమైన పులిసిన పెరుగును వమనమునకై త్రాగ

వలెను. బాగుగా పండిన దేవదాలి కాయలను చక్కగా నీడనెండించి శుభ్రమైన పాత్రయందుంచి, మెత్తగ చూర్ణము చేసి అందు శుక్తి ప్రమాణము (1/2 పలము) పాలతో కలిపి వాత పిత్తాధిక్యము గల రోగి వమనమునకై త్రాగవలెను

ఆయుర్వేదదీపిక : "యథోక్తగుణ యుక్తానాం" అనగా సకాలములో పుట్టి సంపూర్ణమైన రస- వీర్య- గుణాదులను కలిగియుండుట అని అర్థము. మదనఫల అధ్యాయమున చెప్పబడిన గుణములచే అనుసరించవలసినవి. "దేశజానాం" అనగా మదనకల్పమునందు చెప్పబడిన ప్రశస్తమైన భూమియందు పుట్టినవని అర్థము. యథావిధి అనగా మదన కల్పములో చెప్పబడిన విధానముచేత గ్రహింపదగినవి. "పయః పుష్పే" అనునది ఒక యోగము "నివృత్తే" అనునది రెండవయోగము. నివృత్తే అనగా ఫలము పుష్టిగాకే (తయారు కాగానే) అని అర్థము. అటువంటి ఫలముతో క్షీరపాక విధిని పేయను తయారుచేయవలెను. "రోమశే" అను నది మూడవ యోగము. రోమశే అనగా నూగుబట్టిన ఫలమని అర్థము. అటువంటి ఫలము ద్వారా తయారుచేయబడిన పాలమీగడ తరక (సంతానికా) అని అర్థము. దధ్యుత్తరమనునది నాల్గవ యోగము. ఇక్కడ పాలు నూగు కల్గిన పండుచేత సాధించిన పాలవల్ల కల్గిన పెరుగుమీద తొరక (దధిసరము)ను గ్రహించవలెను. "శృతే పయసి" అనునది ఐదవది. "దధ్యమ్లం" అనగా పుల్లటి పెరుగు అని అర్థము "హరితపాండురే" అనగా ఆకుపచ్చ కలిసిన తెలుపు (వర్ణము) దశను పొందిన జీమూతక ఫలము. "జీర్ణానాం" అను ఈ మొదలైనవి ఆరవ క్షీరయోగము. ఈ యోగములు క్షీర సంబంధముతో తయారుచేయబడి క్షీరములవలె కనబడుచున్నను అధ్యాయ సంగ్రహమునందు "షట్ క్షీరే" అను శబ్ద ప్రయోగము వలన వీటిని క్షీర యోగములుగా గ్రహించవలెను.

విమర్శ : "అప్రాప్యపగత రోమాపస్తు ఫలం ......" అనగా రోమములు గల ఫలముతో ఎది యోగములు కల్పించవలెనని చక్రపాణి చేసిన వ్యాఖ్య. "దధ్యుత్తరమలోమశే" అను మూల శ్లోకమునను విపరీతముగా కనబడుచున్నది. బహుశ చక్రపాణికి లభించిన మూలమున రోమములతో కూడియున్న యోగము వ్రాయబడి యుండవచ్చునేమో అని భావించవలసి వచ్చుచున్నది.

## జీమూతకముతో పందొమ్మిది కషాయ యోగములు

8. ఆసుత్య చ సురామణ్డే మృదిత్వా ప్రస్రుతం పిబేత్
కఫజేఽరోచకే కాసే పాణ్డురోగే సయక్ష్మణి
9. ద్వే చాపోథ్యాథవా త్రీణి గుడూచ్యాః మధుకస్య వా
కోవిదారాదికానాం వా నిమ్బస్య కుటజస్య వా
10. కషాయేష్వాసుతం హృత్వా తేనైవ విధినా పిబేత్
అథవాఽఽరగ్వధాదీనాం సప్తానాం పూర్వవత్ పిబేత్
11. ఏకైకస్య కషాయేణ పిత్తశ్లేష్మజ్వరార్దితః

**తాత్పర్యము :** చక్కగా పండిన దేవదాలి ఫలములను విధి ప్రకారము గ్రహించి చక్కగ నలిపగొట్టి సురయొక్క మద్యమున ఉంచి పిసికి రాత్రియంతయు ఉంచి మరునటి దినమున చక్కగ వడిచిన మద్యమును మాత్రము తేరగ గ్రహించి కఫముచే గల్గిన అరోచకమునందును, కాస, పాండు, రాజయక్ష్మ అను వ్యాధులందు రోగికి విమ్యుక్త ప్రకారము త్రాగింపవలెను. దేవదాలి ఫలములలో రెండింటినైనను, మూడింటినైనను నలగగొట్టి తిప్పతీగె కషాయమునందైనను, అతిమధుర కషాయము నందైనను లేక మదన కల్పమున తెలుపబడిన కోవిదార-కర్బుదార (కాంచనార) - నీప (కదంబ) - విదుల (ప్రబ్బలి) - బింబీ (దొండ) - శణపుష్పి - సదాపుష్పి (అర్కపుష్పిక) - ప్రత్యక్ పుష్పి (ఉత్తరేణి) అనునే యెనిమిదిటిలో నొకదాని కషాయమునందైనను, వేపచెక్క కషాయమునందైనను, కొడిసెపాలపట్ట కషాయమునందైనను చేర్చి రాత్రియంతయు నానబెట్టి మరునటి దినముననే ఆ కషాయమును వడగట్టి మదనకల్పమునందు చెప్పబడిన విధి ప్రకారము వమనమునకై త్రాగవలెను. మదనకల్పమున నిర్దేశింపబడిన ఆరగ్వధ (రేల) - వృక్షక (కొడిసె పాల) - స్వాదుకంటక (వికంకత) - పాఠా - శార్ఙ్గేష్టా (గురుగు) - మూర్వా (చాగ) అనునీ యేడు ద్రవ్యములలో నొక్కొక్కదానిని చేర్చి వేరు వేరుగ కాచబడిన కషాయములలో నొక్కొక్క దానియందు దేవదాలి కల్కమును చేర్చి వమనమునకై పిత్తకఫజ్వర పీడయందు త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** "ఆసుత్య" అనునది మొదలు యోగములు చెప్పబడినవి. ఆసుత్య అనగా రాత్రి [illegible] అర్థము. ఈ యోగములు [illegible] యోగములు [illegible]

బాగా పక్వమైన ఫలమునే గ్రహింపవలెను. "ఫలం పర్యాగతం గ్రాహ్యం" (పరిణతి పొందిన ఫలము గ్రహింపవలెను) అను సామాన్య వచనముచేత పక్కాగ పండిన ఫలమును గ్రహింపవలెను. 'ద్వే చ' అను మొదలగువానిచే పన్నెండు విధములైన కషాయ భేదము వలన పన్నెండు యోగములు చెప్పబడుచున్నవి. "ప్రాగ్వద్విధినా" అను శబ్దముచే మదన కల్పమందు చెప్పబడిన సాధనవిధి ననుసరించవలెనని భావము. అథవా అను మొదలగువాటియందు ఆరగ్వధము మొదలైన 7 విధములైన ద్రవ్యకషాయ భేదముల వలన 7 యోగములు అగుచున్నవి.

ఆరగ్వధాదులు - ఆరగ్వధము - వృక్షకము - స్వాదుకంటకము - పాఠా - పాటలి - శార్ఙ్గేష్టా - మూర్వా (క. అ. 1) అని సూత్రస్థానమున చెప్పబడినది.

## జీమూతకముతో ఎనిమిది మాత్రయోగములు

మాత్రాః స్యుః ఫలవచ్చాష్టౌ కోలమాత్రాస్తు తా మతాః

తాత్పర్యము : మదన కల్పమున ప్రసంగ విత్తులనుద్దేశించి మాత్రా యోగములు ఎనిమిది చెప్పబడినవి. ఆ విధముగనే దేవదాలి ఫలములకును ఎనిమిది విధములుగ కల్పించవలెను. అట్టి మాత్రలను రేగుకాయ పరిమాణముగ నిర్మించవలెను.

ఆయుర్వేదదీపిక : "మాత్రాః స్యు" ఈ మొదలైనవానిచే ఎనిమిది మాత్రా యోగములను చెప్పెను. "ఫలవత్" అనగా మదన ఫలమందు ఎనిమిది మాత్రాయోగములు చెప్పబడినట్లుగా ఇక్కడను చేయదగినది విశేషంగా ఈ మాత్రలను రేగుపండు ప్రమాణములో కల్పింపవలెను. కాని మదనఫల మాత్రా యోగమునందువలె కరక్కాయ మొదలగు ప్రమాణములలో చేయదగినవి కాదు.

## జీమూతకముతో నాలుగు స్వరసయోగములు

12. జీవకం ఫలేషు [illegible] రసేన వా
పిత్తశ్లేష్మజ్వరే [illegible]త్పిత్తజ్వరేఽపి వా.

తాత్పర్యము : జీమూతకఫలములను జీవకము, ఋషభకము, చెరకు, పిల్లిపీచరగడ్డలయొక్క స్వరసములలో ఏదో ఒకదానియందు కలిపి పిత్త శ్లేష్మ జ్వరమునందు, వాతపిత్త జ్వరమునందును వమనమునకై త్రాగింపవలెను.

ఆయుర్వేదదీపిక : జీవకము మొదలైన వానిచే పానసాధన (త్రాగెడి) కషాయ భేదమువలన నాలుగు యోగములు.

### జీమూతకముతో ఘృతయోగమొకటి

13. తథా జీమూతకక్షీరాత్ సముత్పన్నం పచేద్ఘృతమ్
ఫలాదీనాం కషాయేణ శ్రేష్ఠం తద్వమనం మతమ్.

తాత్పర్యము : జీమూతక ఫలములను చేర్చి కాచబడిన పాలనుండి తీయబడిన ఘృతమును మంగకాయ విత్తులు మొదలగువాని కషాయమును చేర్చి ఘృత పాక విధి ప్రకారము పక్వముచేత ఆ ఘృతమును పానము చేసినచో అది ఉత్తమమైన వమనౌషధమగును.

ఆయుర్వేదదీపిక : "తథా" మొదలగువానిచే ఒక్క ఘృతయోగమునే చెప్పెను.

### అధ్యాయ విషయసంగ్రహము

14. షట్ క్షీరే మదిరామణ్డే ఏకో ద్వాదశ వాపచే
సప్త వారగ్వథాదీనాం కషాయేష్వా చ వర్తిషు
15. జీవకాదిషు చత్వారో ఘృతం చైకం ప్రకీర్తితమ్
కల్పే జీమూతకానాం చ యోగాస్త్రింశన్నవాధికాః

తాత్పర్యము : ఈ జీమూత కల్పమునందు

| | | |
|---|---|---|
| క్షీర యోగములు | . | 6 |
| సురామణ్డ యోగము | .... | 1 |
| కషాయ యోగములు | .. | 19 |
| మాత్రా యోగములు | ... | 8 |
| స్వరస యోగములు | ... | 4 |
| ఘృత యోగము | .... | 1 |
| మొత్తము యోగముల సంఖ్య | .. | 39 |

జీమూతక వమన యోగములు ముప్పది తొమ్మిది యీ అధ్యాయమున చెప్పబడినవి.

ఆయుర్వేదదీపిక : "షట్ క్షీరే" అను మొదలైనవానిచే ఆయా ప్రదేశములలో వీని వివరము వ్యాఖ్యానించబడినది.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతేఽప్రాప్తే దృఢబలసంపూరితే కల్పస్థానే జీమూతకకల్పో నామ ద్వితీయోఽధ్యాయః

ఈ విధముగా చరకునిచే సంస్కరించబడిన అగ్నివేశ తన్త్రము లభించక పోవుటచే దృఢబలునిచే పూర్తిగావింపబడిన కల్పస్థానమున జీమూతకల్పమనెడు రెండవ అధ్యాయము (సంపూర్ణము).

ఇతి శ్రీ చక్రపాణిద త్తవిరచితాయాం చరకతాత్పర్యటీకాయాం ఆయుర్వేద-దీపికాయాం కల్పస్థానే జీమూతకల్పో నామ ద్వితీయోఽధ్యాయః.

శ్రీ చక్రపాణి దత్తునిచే రచింపబడిన 'ఆయుర్వేద దీపిక' అనెడు చరక తాత్పర్య టీకాయందు కల్పస్థానములో 'జీమూత కల్పమ'నెడు రెండవ అధ్యాయము.

—o—

ఫల పిప్పలి means seeds of మదనఫల.

# తృతీయాధ్యాయము

1. అథాత ఇక్ష్వాకుకల్పం వ్యాఖ్యాస్యామః  Wild variety of ...
2 ఇతి హ స్మాహ భగవానాత్రేయః
3 సిద్ధం వక్ష్యమ్యథేక్ష్వాకుకల్పం యేషాం ప్రశస్యతే

అటు తర్వాత ఇక్ష్వాకు కల్పమును వ్యాఖ్యానము చేయగలము. భగవంతుడైన ఆత్రేయుడు ఈ విధముగా చెప్పెను. ఇక్ష్వాకు కల్పము నేని కుపయోగింపదగునో వానినెల్ల నీ క్రింద వివరింపుచు సిద్ధకల్పమును చెప్పెదను.

ఆయుర్వేదదీపిక : పైన చెప్పిన అధ్యాయ సంబంధము వలన ఇక్ష్వాకు కల్పము చెప్పబడుచున్నది. వేటికి ఇక్ష్వాకు కల్పము ప్రశంసింపబడుచున్నదో వాటిని చెప్పుచున్నానని కూర్చదగినది. అనగా వేటి విషయములో ఇక్ష్వాకు కల్పము ప్రశంసిస్తున్నామో వాటిని గూర్చి చెప్పుచున్నామని భావము.

## ఇక్ష్వాకు పర్యాయనామములు

లమ్బాఽథ కటుకాలాబుస్తుమ్బీ పిణ్డఫలా తథా
4. ఇక్ష్వాకుః ఫలినీ చైవ ప్రోచ్యతే తస్య కల్పనా

తాత్పర్యము : లంబ, కటుకాలాబు, తుంబీ, పిండాఫల, ఇక్ష్వాకు, ఫలినీ అనునవి చేదు ఆనప యొక్క పర్యాయ నామములు. దీని కల్పనములు ఈ అధ్యాయమునందు చెప్పబడును.

ఆయుర్వేదదీపిక : లంబా ఈ మొదలైనవి పర్యాయ పదములుగా చెప్పుట.

## ఇక్ష్వాకు గుణములు

కాసశ్వాసవిషచ్ఛర్దిజ్వరార్తే కఫకర్శితే
5 ప్రతామ్యతి నరే చైవ వమనార్థం తదిష్యతే

తాత్పర్యము : కాస, శ్వాస, విషవికారము, వాంతి, జ్వరము, కఫము శరీరము కృశించుట, పరిశ్రమించకుండానే అలసట నొందు రోగులకు వమనము చేయించుటకై చేదు సొరకాయ గుంజ శ్రేష్ఠముగా నుండును.

ఆయుర్వేదదీపిక : "తదిష్యతే" అనగా ఇక్ష్వాకు కల్పము కోరబడుచున్నది.

## ఇక్ష్వాకుతో ఎనిమిది క్షీర యోగములు - సురామణ్డ - మస్తు - తక్రయోగములు

అపుష్పస్య ప్రవాలానాం ముష్టిం ప్రాదేశసంమితమ్
6. క్షీరప్రస్థే శృతం దద్యాత్ పిత్తోద్రిక్తే కఫజ్వరే
పుష్పాదిషు చ చత్వారః క్షీరే జీమూతకే యథా
7. యోగా, హరితపాణ్డూనాం సురామణ్డేన పఞ్చమః
ఫలస్వరసభాగం చ త్రిగుణక్షీరసాధితమ్
8. ఉరఃస్థితే కఫే దద్యాత్ స్వరభేదే చ పీనసే
జీర్ణే మధ్యోద్ధృతే క్షీరం ప్రక్షిపేత్తద్యదా దధి
9. జాతం స్యాత్ సకఫే కాసే శ్వాసే వమ్యాం చ తత్ పిబేత్
అజాక్షీరేణ బీజాని భావయేత్ పాయయేత్ చ
10. విషగుల్మోదరగ్రన్థిగణ్డేషు శ్లీపదేషు చ
మస్తునా వా ఫలాన్మధ్యం పాణ్డుకుష్ఠవిషార్దితః
11. తేన తక్రం విపక్వం వా సక్షౌద్రలవణం పిబేత్

**తాత్పర్యము :** పుష్పించకముందు చేదు సొర (ఆనప) యొక్క లేత చిగురాకులు పిడికిలి నిండునంత గ్రహించి ప్రస్థపరిమితమైన ఆవు పాలలో కలిపి క్షీర పాకవిధిని పాకము చేసి, ఆ పాలను పిత్తాధికమైన కఫజ్వరమునకు వమనమునకై త్రాగించవలెను.

"జీమూతక కల్పమునందు వలెనే పుష్ప .. మలోమశే" అని చెప్పబడిన ప్రకారము చేదు సొరకాయ యొక్క పుష్ప ఫలముల చేర్చి క్షీరము-యవాగు-క్షీర సంతానికా-దధిసరము అను నాల్గు క్షీర యోగములు కల్పించవలెను. హరిత వర్ణంబులును, పాండు వర్ణంబులునైన చేదు సొరకాయలను జీమూత కల్పమున చెప్పబడిన సురాయోగ ప్రకారము (కాయలను నలుగగొట్టి సురా మద్యమున నూరబెట్టి మరునాడుదయమున నా సురా మద్యముపై తేలు మాత్రము గ్రహించి) చేదు సొరతో సురాయోగమును కల్పించవలెను. ఇది అయిదవ యోగము. చేదు సొరకాయల స్వరసమొకభాగమును, మూడు భాగముల ఆవు పాలతో కలిపి క్షీరపాక విధిని పాకము చేసి ఉరఃస్థానమున చేరిన కఫమునందు, స్వరభేదము నందును, పీనసము

నందును వమనకారకమై యివ్వవలెను. చక్కగ పండిన వేదు సొరకాయలో మధ్య మందు గుజ్జును తీసి ఆవు పాలను పోసి (తోడుపెట్టి) పెరుగుగా మారిన పిదప దానిని కఫముతో కూడిన శ్వాస, కాసలందును, ఛర్ది (వాంతి) యందును ప్రయోగించవలెను. చేదుసొర విత్తనములను మేకపాలతో భావన చేసి, ఆ చూర్ణమును లేదా కల్కమును విషవికారములు, గుల్మము, ఉదరరోగము, గ్రంథి గండమాల, శ్లీపదములందు మేక పాలతో ప్రయోగించవలెను. చేదుసొర పండునందలి గుజ్జును పెరుగుపై తేటతో నైనను, ఆ గుజ్జును కలిపి పక్వము చేయబడిన మజ్జిగనైనను తేనె, లవణములను కలిపి ప్రయోగ వలెను. ఈ రెండు యోగములను పాండు, కుష్ఠము, విషవికారములందు ప్రయోగించ వలెను.

ఆయుర్వేద దీపిక : "అపుష్పస్య" అను సూత్రమునందు ఒక క్షీర యోగము చెప్పబడుచున్నది. అపుష్పస్య అనగా పుట్టని పుష్పము అని అర్థము.

"ముష్టిం ప్రాదేశసంమిత" అనగా ప్రదేశినితో (చూపుడు వేలుతో) హస్తము యొక్క మూలము వరకూ చేయబడిన పిడికిలి ప్రమాణము. ఈ విధముగా యిక్కడ ముష్టి శబ్దము పల ప్రమాణ సూచకము కాదు.

"క్షీరప్రస్థేశృత" అను వచనము వలన నాలుగు శేర్ల పాలలో చెప్పబడిన పరిమాణములో చేదు ఆనపను కలిపి నాలుగు రెట్లు నీరుపోసి పాలను సాధించవలె నని అర్థము. "పుష్పాదిషు" అనుదానితో నాలుగు క్షీరయోగములను చెప్పెను. జీమూతకంలో ఏ విధముగా

"పయఃపుష్పేఽస్య నివృత్తే ఫలే పేయా పయస్కృతా.
రోమశే క్షీరసంతానం దధ్యుత్తరమరోమశే (క.అ.2)

అని దేనితో చెప్పబడినవో ఆ విధముగా ఇక్కడను నాలుగు యోగములను చేయవలెను. "హరితాం" అనుదానితో సురా యోగము చెప్పెను. ఆకుపచ్చ తెల్లనై నటువంటి సురామండమున జీమూతకమువలె యోగము చేయదగినది. జీమూతక విధానమును అతిక్రమించి "ఆసుత్య చ సురామణ్డే మృదిత్వాఽప్రస్రుతం పిబేత్ (క.అ.2)" అను గ్రంథమునందు చెప్పబడిన విధానము యిక్కడ కూడా అగు చున్నది. ఫల స్వరసము ఈ మొదలైనవానిచే ఆరవ క్షీరయోగము చెప్పబడు చున్నది. "త్రిగుణక్షీర సాధితమ్" అనగా మూడు రెట్లు పాలతో సాధింపదగినది. అదియును నాలుగు రెట్లు నీటితో సాధింపదగినది. ఫల శబ్దముచేత ఇక్ష్వాకు ఫలమని

చెప్పబడుచున్నవి. "జీర్ణే" అను మొదలైన వానితో ఆరవ క్షీరయోగము "మధ్యే ద్ధృతే" అనగా మధ్య భాగము తీసివేయబడినదని అర్థము. "అపాక్షీరేణ" అను దానితో ఎనిమిదవ క్షీరయోగము. "శేనత్రకం" అనుదానితో తక్రయోగము చెప్ప బడినది. "శేన" అనగా తుంబీఫల (చేదుసొర) మధ్య భాగమని అర్థము.

## జీమూతకములో ఘ్రేయ యోగము

తుమ్బ్యాః ఫలరసైః సర్పైః సంప్రవర్తవచూర్ణితై
12 ఘ్రయేన్మాల్యమాఘ్రాయ గన్ధసంపత్సుఖోచితః

**తాత్పర్యము :** చేదు సొరకాయ రసముచేతను, దాని ఎండిన పువ్వుల చేతను భావన చేయబడిన పుష్పమాలికను సుగంధము నాఘ్రాణించెడి అలవాటు గల సుకుమారుడు వాసన చూచినచో వమనములగును. ఫల రసమును గాని లేదా ఎండిన పుష్పచూర్ణమును మాలపై చల్లి పిదప వాసన చూపించవలెను.

**ఆయుర్వేదదీపిక :** "తుమ్బ్యాః" అను మొదలగువానిచే వాసన చూపించి వమనము చేయించు యోగము చెప్పబడినది.

"గంధసంపత్సుఖోచిత" అనగా ఎవనిచే సుగంధము నాఘ్రాణించు వాడుక గలదో అటువంటివానిచే అని అర్థము. చేదుసొర ఫల పుష్పములచే భావన చేయ బడిన మాలను వాసన చూచిన మాత్రమున నా దుర్గంధమును సహింపలేక వాంతి యగునని భావము.

## జీమూతకముతో ఒక ఫలలయోగము ఒక తైలయోగము

భక్షయేత్ ఫలమధ్యం వా గుడేన పలలేన చ
13. ఇక్ష్వాకుఫలతైలం వా సిద్ధం వా పూర్వవద్ఘృతమ్

**తాత్పర్యము :** చేదు సొరకాయలోపల నుండు గుజ్జును బెల్లముతో నైనను, మాంసముతోనైనను కలిపి తినిపించవలెను. లేక చేదు సొరకాయల కల్కము చేర్చి కాచబడిన తైలమునైనను, జీమూతక కల్పమున చెప్పబడిన ఘృతయోగ విధి ప్రకారము (చేదు సొరకాయను చేర్చి కాచబడిన క్షీరము నుండి తీయబడిన ఘృత మును ప్రమంగకాయ కషాయములలో చేర్చి ఘృతపాక విధి ప్రకారము) పక్వము చేయబడిన ఘృతమునైనను వమనమునకుపయోగించవలెను.



ఆయుర్వేదదీపిక : "భక్షియత్" అను మొదలగువానిచేత ఒక వమన యోగము చెప్పబడుచున్నది "ఫలమధ్యమ్" అనగా ఇక్ష్వాకు ఫలమధ్యము ఇక్ష్వాకు ఫలకల్కమును చేర్చి పాకము చేసిన తైలము ఇక్ష్వాకు తైలము ఇది ఒకటియే తైలయోగము. "పూర్వవత్" అనగా జీమూతక కల్పనవలెనే అని అర్థము. "తథా జీమూతక క్షీరాత్" (క. అ. 2) అను మొదలగువానిచే ముందు చెప్పబడి జీమూతక స్థానమునందు ఇక్ష్వాకు ఫలమును కలిపి ఈ ఘృతము పాకము చేయవలెనని అర్థము.

విశేష విమర్శ : "పలలేన" అనుదానికి మాంసముచే అని అర్థము చెప్పబడినది. కొంతమంది విద్వాంసులు "పలలం తు సమాఖ్యాతం సైశవం తిలపిష్టకం" అను నిఘంటు వచనానుసారము బెల్లముతో కూడిన నువ్వుల కల్కము (చిమ్మిలి)ను పలల శబ్దమునకు ఈ సందర్భములో గ్రహించినచో సమంజసముగా యుండునని పేర్కొనిరి

## జీమూతకములో వర్ధమానయోగములు

13. పంచాశద్దశవృద్ధాని ఫలాదీనాం యథోత్తరమ్

14 పిబేద్వ్యుష్యద్య బీజాని కషాయేష్వాశతం పృథక్

తాత్పర్యము : చేదుపొర విత్తనములను ఏబది మొదలు పదేసివంతున హెచ్చించుచు మదన కల్పమునందుదహరించిన క్రమంగానము మున్నగు ద్రవ్యములలో ఒక్కొక్క కషాయమునందు కలిపి. మర్దించి త్రాగవలెను. ఈ విధముగా ఏబదికి పైన పదేసి ఒక్కొక్క యోగమునకు హెచ్చించుచు వేరువేరుగ యోగముల వరుసగ ఒక్కొక్క కషాయమును చేర్చుచు 100 అగువరకు పెంచినచొదల ఆరు యోగములగును అనగా 50, 60. 70. 80. 90, 100 వంతున ఆరుయోగములగును

ఆయుర్వేదదీపిక : "పంచాశత్" అను మొదలగువానిచే ఆరు వర్ధమానక యోగములు చెప్పబడినవి. ఏబది చేదుపొర విత్తనములు మొదలుకొని పదిచొప్పున హెచ్చిస్తూ వంద అగువరకు పూర్తి చేయవలెను. దానిచే ఆరుయోగములు అగును, వానిని సంఖ్యానుసారము మదనఫలము మొదలైన ఆరు యితరములైన కషాయము

లందు పులియపెట్టి మర్దించి త్రాగించవలెను. యింకొక విధానానుసారము పది గింజలతో ప్రారంభించి ఏబది గింజలవరకు దోషానుసారము త్రాగించవలెను. ఆక్కడను మదనఫలము మొదలగు కషాయ భేదములచే యోగభేదములని చెప్పబడెను.

### పదిహేను ఇక్ష్వాకు కషాయప్రయోగములు

యష్ట్యాహ్వాకోవిదారాద్యైర్ముష్టిమన్తర్నఖం పిబేత్

**తాత్పర్యము :** అతిమధురము, దేవకాంచనము మొదలగు ఎనిమిది ద్రవ్యములను (మదనకల్ప అధ్యాయమున పేర్కొనబడిన) వేరు వేరుగ కషాయము చేసి అందు పిడికెడు ప్రమాణములో చేదుసొరకాయ గింజల చూర్ణమును కలిపి త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** "యష్ట్యాహ్వా" అను మొదలగువానిచే తొమ్మిది కషాయయోగములు చెప్పబడెను. అచ్చట యష్టిమధు ఒకటి మరియు కోవిదారము మొదలగునవి మదనకల్పమునందు చెప్పబడిన ఎనిమిది ద్రవ్యములను గ్రహించవలెను.

15. కషాయైః కోవిదారాద్యైర్మాత్రాశ్చ ఫలవత్ స్మృతాః

**తాత్పర్యము :** మదనకల్పము నుదహరించబడిన కోవిదారము మున్నగు ఎనిమిది కషాయములలో చేదుసొర విత్తనములకు మాత్రాయోగములను చెప్పబడినది. వీటినే అధ్యాయ సంగ్రహమున "అష్టావర్తిక్రియా" అని చెప్పబడినది.

**ఆయుర్వేదదీపిక :** "కషాయైః" అను మొదలగువానిచే మదనఫలమును పోలిన ఎనిమిది మాత్రాప్రయోగ విధులు చెప్పబడుచున్నవి.

### ఎనిమిది వర్తి యోగములు - ఐదు లేహ యోగములు

బిల్వమూలకషాయేణ తుమ్బీబీజాఞ్జలిం పచేత్

16 పూతస్యాస్య త్రయో భాగాశ్చతుర్థః పాటితస్య తు
సప్లుతో బీజభాగశ్చ పిష్టానర్ధాంశికాం స్తథా

17. మహాజాలినిజీమూతకృతవేధనవత్సకాన్
తం లేహం సాధయేద్దర్వ్యాః షట్టయన్మృదునాఽగ్నినా

18 యావత్ స్యాత్తన్తుమత్తోయే పతితం తు న శీర్యతే
తం లిహన్మాత్రయా లేహం ప్రమథ్యాం చ పిబేదను
19 కల్ప ఏషోఽగ్నిమన్థాహ్వ చతుష్కే పృథగుచ్యతే

**తాత్పర్యము :** చేదుసొర విత్తనములను ఒక అంజలి (నాల్గుపలములు) ప్రమాణంలో గ్రహించి బిల్వమూల కషాయములో నాల్గవ భాగము ఫాణితము (అర్ధ పాకముగ కాచబడిన చెరకురసము), ఘృతము నాల్గవభాగము, చేదుసొరకాయల చూర్ణంబును నాల్గవవంతు, మహాకాలిని (పెద్ద చేదుబీర), దేవదాళి, చేదుబీర, కొడిశపాల (ఈ నాల్గింటి గింజలు)ను ప్రత్యేకముగ ఒక్కొక్కటి అర్ధభాగముగా గ్రహించి మృద్వగ్నిచే తీగెలు సాగునట్లును జలమున వైచిన కరుగకుండునట్లుగ పక్వమగునంతకాలము వండునది. అట్టి లేహ్యమును తగిన ప్రమాణములో సేవించి వెంటనే ప్రమథ్యను త్రాగవలెను. ఈ కల్పవిధి ప్రకారముగనే మహాపంచమూలము లలో చేరిన తక్కిన నెల్లిపేళ్ళు, మందిలపుపేళ్ళు, పెగ్గుమ్మడిపేళ్ళు, కలిగొట్టుపేళ్ళు అను నీ నాల్గింటిని వేరువేరుగా 4 కషాయములు సిద్ధముచేసి అందు చేదుసొర విత్తు లచే నాల్గు విధములగు లేహయోగములను చేయునది ఈ విధముగా బృహత్ పంచ మూల కషాయముతో చేదుసొరను లేహయోగములు అయిదగును.

**ఆయుర్వేదదీపిక .** "బిల్వ" అను మొదలగు వానిచేత ఒక యోగము. మరియు "కల్ప" మొదలగు వానియందు నాలుగు యోగములు చూడనగును. ఈ విధముగ ఇచ్చట అయిదు లేహములు వర్ణింపబడినవి. అంజలి అనగా నాలుగు పలములు ప్రమాణము. ఇచ్చటను "తతశ్చ కుడవం యావత్తోయమష్టగుణం పచేత్" అను వచనముచే బిల్వమూల కషాయమును ఎనిమిది అంజలుల ప్రమాణమునందు వేయవలెను. అందును నాల్గవ భాగము మిగులునట్లు కాచిన రెండు కుడవముల ప్రమాణము మిగులును. ఫాణితమనగా సగము కాచబడిన చెరకురసము. "చతుర్థః ఫాణితస్య చ" అనుచోట రెండవ "త్రయ త్రికటుకస్య చ" అని గ్రహింతురు. "సఘృత" అనగా ఒక భాగము ఘృతము "అర్ధాంశికా" అనగా మహాకాలినీ మొద లైనవి ఒక్కొక్కటి అర్ధభాగము తీసుకొనవలెనని అర్థము. మహాకాలినీ అనగా పీతకోశాతకీ. కృతవేధన ఘోషకభేదము "జ్యోత్స్నికా" అని పేరుతో ప్రసిద్ధము. "యావత్ స్యాత్తన్తుమత్" అను మొదలగువానిచే లేహపాక లక్షణము చెప్పబడు చున్నది. ఈ లక్షణము లేహాంతర పాకకల్పన యందుకూడా యుండునని తెలియ

## అధ్యాయ విషయసంగ్రహము

తత్ర శ్లోకాః :

21. పయస్యష్టౌ సురామణ్డ-మస్తు-తక్రేషు చ త్రయః
ఘ్రేయం సపలలం తైలం వర్ధమానాః ఫలేషు షట్
22. ఘృతమేకం కషాయేషు నవాన్యే మధుకాదిషు
అష్టౌ వర్తిక్రియా లేహాః పఞ్చ మస్తో రసస్తథా
23. యోగా ఇక్ష్వాకుకల్పే తే చత్వారింశచ్చ పఞ్చ చ
ఉక్తా మహర్షిణా సమ్యక్ ప్రజానాం హితకామ్యయా

తాత్పర్యము : ఈ ఇక్ష్వాకు కల్పమునందు

| | |
|---|---|
| చేదుసొరకాయ పాలతో సంబంధించిన యోగములు | 8 |
| సురామండముతో | 1 |
| మస్తుయోగము | 1 |
| తక్రయోగము | 1 |
| ఘ్రేయయోగము | 1 |
| పలల (చిమ్మిలితో) యోగము | 1 |
| తైలయోగము | 1 |
| వర్ధమాన యోగములు | 6 |
| ఘృతయోగము | 1 |
| మధుకాది కషాయయోగములు | 9 |
| వర్తి (మాత్రా) క్రియాయోగములు | 8 |
| లేహయోగములు | 5 |
| మస్తయోగము | 1 |
| మాంసరస యోగము | 1 |
| | 45 |

ఈసు నలుబది అయిదు రకముల యోగములు ఆత్రేయ మహర్షిచే ప్రజల హిత మును కోరి చెప్పబడినవి.

ఆయుర్వేదదీపిక : "పయస్యష్టౌ" అనునవి సంగ్రహము కొరకు వివ రింపబడినవి. ఇక్కడ "ఫలేషు" అనగా పుష్పఫలము మొదలైనవి అని అర్థము. ఘృతయోగము వర్ధమాన యోగములకు ముందు తెలుపబడినప్పటికి ఛందస్సు సరిపోక పోవుటచే తరువాత తెలుపబడినది.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతేఽప్రాప్తే దృఢబలసంపూరితే కల్పస్థానే ఇక్ష్వాకుకల్పో నామ తృతీయోధ్యాయః

ఈ విధముగా అగ్నివేశునిచే రచింపబడిన తన్త్రమును, చరకునిచే ప్రతిసంస్కరింపబడినదియు అయిన సంహిత పారకకపోవుటచే దృఢబలునిచే సంపూరిత మైన కల్పస్థానమునందు ఇక్ష్వాకు కల్పమను తృతీయ అధ్యాయము సంపూర్ణము.

శ్రీ చక్రపాణిదత్తవిరచితాయాం ఆయుర్వేదదీపికాయాం
చరకతాత్పర్యటీకాయాం కల్పస్థానే ఇక్ష్వాకుకల్పో నామ తృతీయోధ్యాయః

శ్రీ చక్రపాణి దత్తునిచే రచింపబడిన 'ఆయుర్వేదదీపిక' అను చరక తాత్పర్య టీకయందలి కల్పస్థానములో 'ఇక్ష్వాకు కల్పము' అను తృతీయ అధ్యాయము.

— x —

wild variety, small in size. two types

చేదు బీర - useful part - seeds

# చతుర్థాధ్యాయము

పెద్దచేదుబీర చిన్న

wild variety of

నేతి బీర

1. అథాతో ధామార్గవకల్పం వ్యాఖ్యాస్యామః
2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః

**తాత్పర్యము :** అటు తరువాత ధామార్గవ కల్పమును వ్యాఖ్యానము చేయగలము. భగవంతుడైన ఆత్రేయుడు ఈ విధముగా చెప్పెను.

**ఆయుర్వేద దీపిక :** పై చెప్పిన సంబంధ క్రమానుసారము ధామార్గవ కల్పము చెప్పబడుచున్నది.

## ధామార్గవ పర్యాయనామములు

3. కర్కోటకీ కోఠఫలా మహాజాలినిరేవ చ
   ధామార్గవస్య పర్యాయాః రాజకోశాతకీ తథా

**తాత్పర్యము :** కర్కోటకీ, కోఠఫలా (కటుఫలా అనునది పాఠాంతరము) మహాజాలినీ, రాజకోశాతకి అనునవి ధామార్గవము (పెద్ద చేదుబీర) యొక్క పర్యాయ నామములు.

**ఆయుర్వేద దీపిక :** "కర్కోటకీ" అను మొదలగువానిచే పర్యాయ నామములు చెప్పబడినవి. ధామార్గవ అనగా పీతఘోషకము.

**విశేష వ్యాఖ్య :** చక్రపాణి తన వ్యాఖ్యానములో ధామార్గవకు పీత-ఘోషకమును [illegible] తెలుగు వ్యాఖ్యానకారులు [illegible] చేదుబీరను ధామార్గవగా గ్రహింపవలెనని వివరించిరి. పీతవర్ణము పుష్పమునకా లేక [illegible] ఆలోచించవలసి యున్నది

## ధామార్గవ గుణములు

4. గరే గుల్మోదరే కాసే వాతే శ్లేష్మాశయస్థితే
   కఫే చ కంఠవక్త్రస్థే కఫసంచయజేషు చ
5. రోగేష్వేషు ప్రయోజ్యం స్యాత్ [illegible]

**తాత్పర్యము :** గరము (కృత్రిమ విషము, పెట్టుడు మందు), గుల్మము, ఉదరవ్యాధి, కాసవ్యాధులందును, కఫస్థానమున వాతము చేరినప్పుడును, కఫము కంఠమునందును, నోటియందును చేరినప్పుడును, కఫ సంచయముచే గల్గిన వ్యాధుల యందును, స్థిరములై బలీయమైన వ్యాధులయందును పెద్ద చేదుబీరను వమనమునకై ఉపయోగింపవలెను.

**ఆయుర్వేద దీపిక :** "స్థిరాశ్చ గురవశ్చ యే" అనుచోట వ్యాధులని అన్వయము.

## ధామార్గవ ప్రయోజ్యాంగములు

5. ఫలం పుష్పం ప్రవాలం చ విధినా తస్య సంహరేత్

**తాత్పర్యము :** పైన చెప్పబడిన పెద్ద చేదుబీర యొక్క కాయలు, పువ్వులు, చిగుళ్ళను వమనౌషధము కొరకు విధ్యుక్త ప్రకారము సంగ్రహించ వలెను.

**ఆయుర్వేదదీపిక :** "విధినా" అనగా భేషజ సంగ్రహణమున చెప్పిన విధానముతో అని భావము.

## ధామార్గవ పల్లవయోగములు తొమ్మిది

6. ప్రవాలస్వరసం శుష్కం కృత్వా చ గులికాః పృథక్
కోవిదారాదిభిః పేయాః కషాయైర్మధుకస్య చ

**తాత్పర్యము :** పెద్ద చేదుబీర స్వరసమును (ఎండలో) ఎండించి ఆ స్వరస చూర్ణమును అతిమధురము, దేవకాంచనము మున్నగు తొమ్మిది ద్రవ్యము లతో వేరువేరుగా చేయబడిన కషాయములలో దేనియందైనను పక్వముచేసి గుటిక లుగా చేసి ఆ గుటికలను ఆ కషాయమునందు లేదా అతిమధురకషాయమున చేర్చి త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'ప్రవాలము' అను మొదలగువానిచే తొమ్మిది యోగములు (చెప్పబడుచున్నవి). ప్రవాల స్వరసము అనగా లేతాకు స్వరసము. ఇచ్చట కోవిదారము మొదలగు కషాయములచే గుటికలు చేసి ఆ కషాయముతోనే త్రాగవలెనని తెలుసుకొనదగినది.

7. పుష్పాదిషు పయోయోగాశ్చత్వారః పఞ్చమీ సురా పూర్వవత్

**తాత్పర్యము :** జీమూతకల్పమున క్షీర-పేయా-మస్తు-దధిమస్తు యోగముల నాల్గింటిని, సురాయోగము కలిపి అయిదు యోగములను పెద్ద చేదుబీరతో కల్పించునది.

**ఆయుర్వేదదీపిక :** "పుష్పాదిషు" అను మొదలగువానిచే జీమూతక కల్పవిధానము ననుసరించి నిర్దేశింపబడిన నాలుగు క్షీర ప్రయోగములు అయిదవదైన సురాయోగము ఇచ్చట వర్తించును. అదియును "పయః పుష్పేఽన్య" (క. అ. 2) అను మొదలగువానిచే చెప్పబడినదిగా తెలుసుకొనదగినది. "పూర్వవత్" అనగా పూర్వము చెప్పినదానితో సంబంధము కల్గియుండును.

## నాలుగు క్షీరయోగములు-సురాయోగము-
## తొమ్మిది కషాయయోగములు

జీర్ణశుష్కాణామతః కల్పః ప్రవక్ష్యతే
8. మధుకస్య కషాయేణ బీజకణ్వోద్ధృతం ఫలమ్
సగుడం వ్యుషితం రాత్రిం కోవిదారాదిభిస్తథా
9. దద్యాద్గుల్మోదరార్తేభ్యో యే చాప్యన్యే కఫామయాః

**తాత్పర్యము :** చక్కగా పండి యెండిన పెద్ద చేదు బీరకాయను తెచ్చి తొడిమవద్ద విత్తనములు నిలచియుండు భాగమున తెగకోసి అతిమధుర కషాయముచే ఆ బుర్ర నిండువరకుపోసి, అందు బెల్లమును కూడా ఉంచి ఒక రాత్రి యంతయు ఉంచి ఆ మరునాటి ఉదయమున విద్యుక్త ప్రకారము దానిని త్రాగించవలెను. ఇదే విధముగ దేవకాంచనము మొదలగు ఎనిమిది కషాయములలో ఒక్కొక్కదానిని వేరుగా నుపయోగించవలెను. ఈ కషాయ యోగములను గుల్మము, ఉదరము, ఇతరములైన కఫవ్యాధులందు ఉపయోగించవలెను.

**ఆయుర్వేద దీపిక :** "జీర్ణ శుష్కాణాం" అనువానిచే తొమ్మిది కషాయ యోగములను చెప్పెను. అట్లే "జాత్యాః" అనువానిచే పదకొండు కషాయ యోగములను చెప్పగలడు ఈ విధముగా ఇరువది కషాయయోగములు సంగ్రహమున చెప్పబడినట్లు పూరింపబడుచున్నవి.

"బీజ కణ్ఠోద్ధృతం ఫలం" అనగా ఎచ్చట విత్తనములు బంధింపబడినవో అది బీజ కంఠము. ఆ బీజ కంఠము దేనియందు కోయబడినదో అది బీజకంఠోద్ధృత ఫలము. అహితాగ్నులు పూర్వ నియమమును ఆచరించునట్లు ఇందు కూడా పూర్వ అధ్యాయమున చెప్పబడిన కల్పవిధానముగా తెలుసుకొనదగినది. ఈ విధముగా అయిన ఫలమును బెల్లముతో కలిపిన కషాయముచే నింపి రాత్రియంతయు పులియ బెట్టవలెను. జతూకర్ణ తన్త్రమునందు ధామార్గవ కల్పములో "ధామార్గవ ఫలేషూ-ద్ధృత బీజ మధ్యేషు సుగుడోషితాః కోవిదార కషాయా నవ" అని చెప్పబడినది. గుల్మ వ్యాధి పీడితులందు అవస్థానుసారము వమనము హితమేయగును. అందువలన ఇచ్చట గుల్మమునకు వమనకర్మ చెప్పుట విరుద్ధము కాజాలదు.

**విమర్శ :** అహితాగ్నులు ఆ అగ్నిని నిత్యకర్మల యందు అవహనీయ అగ్నికి ఉపయోగింతురు. ఇందు పూర్వాగ్నియే పరంపరగా తదుపరి హవనమునకు ఉపయోగించబడును అదే విధముగా పూర్వాధ్యాయమున చెప్పబడిన పరికల్పనలు ఇచ్చటను అన్వయించుకోవలెను.

## అన్నయోగము

దద్యాదన్నేన సంయుక్తం ఛర్దిహృద్రోగశాన్తయే

**తాత్పర్యము :** చేదుబీర విత్తుల చూర్ణమును అన్నముతో కలిపి తినినచో వాంతియగును. దీనిని ఛర్ది, హృద్రోగములందు ఉపయోగించవచ్చును.

**ఆయుర్వేద దీపిక :** "దధ్యాది" అనువానిచే ఒక అన్నయోగము చెప్పబడుచున్నది. అన్నమునందు ధామార్గవ యొక్క కలయికచే ఒక యోగము.

## ఘ్రేయ యోగము

10. చూర్ణైర్వాఽప్యుత్పలాదీని భావితాని ప్రభూతశః
రసక్షీరయవాగ్వాదితృప్తో ఘ్రాత్వా వమేత్ సుఖమ్

**తాత్పర్యము :** పెద్ద చేదుబీర చూర్ణము చేత నల్ల కలువ, తామరపువ్వు మొదలగు పుష్పములను పలుమారు భావన చేసి రోగికి మాంసరసము, క్షీరము, యవాగు మొదలగు ఆహారములను తృప్తిగ భుజింపచేసి పైన చెప్పిన పుష్పాలను వాసన చూపించినచో సుఖముగ వమనమగును.

**ఆయుర్వేదదీపిక :** "చూర్ణై" అనువానిచే ప్రమేయమందు ఒక యోగము చెప్పెను. ఉత్పలము మొదలైనవానికి ఇచ్చట భేదము చెప్పబడలేదు. ఉత్పలమునకు ఒకటే ప్రమేయయోగము. ఇక్కడ ఆది శబ్దముచే సౌగంధిక, పద్మము మొదలగు వానిని గ్రహించుట. ఎక్కువగా చూర్ణములతో భావన చేయవలెనని తెలుసుకొన దగినది.

## పన్నెండు శకృద్రస యోగము

11. చూర్ణీకృతస్య వర్తిం వా కృత్వా బదరసంమితామ్
వినీయాఞ్జలిమాత్రే తు పిబేద్గోఽశ్వశకృద్రసే

12. పృషతర్ష్యకురఙ్గాహ్వగజోష్ట్రాశ్వతరావికే
శ్వదంష్ట్రఖరఖడ్గానాం చైవం పేయా శకృద్రసే

చేదుబీర విత్తుల చూర్ణమును జలములో నూరి రేగుపండంత మాత్రలు చేసి అంజలి ప్రమాణముగల ఆవుపేడరసమందైనను, గొఱ్ఱెపులద్దె రసమందైనను కలిపి త్రాగవలెను. ఇదే విధముగా పృషత (బొడలయిర్రి), ఋష్య (దుప్పి), కురంగ (దుప్పి), ఏనుగు, ఒంటె, అశ్వతర (కంచర గాడిద), గొఱ్ఱె, శ్వదంష్ట్రి (తోడేలు?), గాడిద, ఖడ్గమృగము అను నీపది జంతువులయొక్క శకృద్రసములందు పై చూర్ణమును కలిపి వమనము కొరకు త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** "చూర్ణీకృతస్య" అనువానిచే ఆవు, గుర్రముల శకృద్రసములు అని రెండు యోగములు (అని గ్రహించవలెను). పృషత అను మొదలైన పది యోగములలో కూడా శకృద్రస యోగసంబంధము వలన పంద్రెండు శృకృద్యోగములు చెప్పబడుచున్నవి. పృషతః అనగా చుక్కలతో చిత్రితమైన లేడి, ఋష్యః అనగా నీలాండము, మరంగమనగా చంచలగతి, అశ్వతర మనగా వేగసరము, శ్వదంష్ట్రమనగా నాలుగు దన్తములు గల్గిన విశిష్ట మృగము.

## పది లేహ యోగములు

13. జీవకర్షభకౌ వీరాం మాత్మగుప్తాం శతావరీమ్
కాకోలీం శ్రావణీం మేదాం మహామేదాం మధూలికామ్

14. ఏకైకశోఽధిసంయూర్ణ్య సహ ధామార్గవేణ తే
శర్కరామధుసంయుక్తాః లేహా హృద్దాహకాసినామ్

15. సుఖోదకానుపానాః స్యుః పిత్తోష్మసహితే కఫే

**తాత్పర్యము :** జీవకము, ఋషభకము, వీరా (క్షీరకాకోలీ), మాలగొండి విత్తులు, పిల్లిపీచర, కాకోలి, బోడతరము, మేద, మహామేద, మధూలికా (అతి మధురము?)-వీనిలో ఒక్కొక్క దానిని వేరువేరుగా చూర్ణముచేసి ఆయా చూర్ణము లకు సమభాగముగా చేదుబీర (విత్తనములు, పుష్పము మరియు పత్రములు) యొక్క చూర్ణమును లేహపాకమునకు కావలసినంత చక్కెరను, తేనెను కలిపి లేహపాక విధి ప్రకారము పక్వము చేయవలెను. దీని సేవనవలన హృద్దాహము మరియు కాస వ్యాధి శాంతించును. ఈ లేహమును పిత్తము యొక్క ఉష్ణముతో కూడిన కఫమందు సుఖోష్ణమైన జలమునను పానముగా చేసికొని ఉపయోగించవలెను.

**ఆయుర్వేదదీపిక :** "జీవక" అనువానిలో పది లేహములను చెప్పెను. ధూలికా "మర్కటక హస్త"మని ప్రసిద్ధమైనది. ఇక్కడ లేహములందు ఇతర ద్రవ్య చూర్ణములను ధామార్గవమునకు సమాన భాగముగా (కలుపవలెను) యుండును. లేక పాకమునకు ఎంత ప్రమాణములో మధు, శర్కరలు కావలెనో అంతే పరిమితిలో మధు, శర్కరలుండవలెను. "పిత్తోష్మసహితే కఫే" అనగా పుట్టిన ఉష్ణగుణము గల్గిన పిత్తముతో కూడిన కఫమందు (అని భావము). ఇతరులు మాత్రము "పిత్తోష్మ" శబ్దముచేత పిత్తోష్మచే గల్గిన జ్వరమని చెప్పిరి.

## కల్క యోగము

ధాన్యతుమ్బురుయూషేణ కల్కః సర్వవిషాపహః

**తాత్పర్యము :** ధనియాలు, తుంబుర్లుతో సిద్ధము చేయబడిన యూషము నందు చేదుబీరగింజల కల్కమును కలిపి త్రాగిన వమనములగును. దీనిచే విషము లన్నియు నశించును.

**ఆయుర్వేదదీపిక :** "ధాన్య" అను మొదలైనవానితో ఒక కల్క యోగము చెప్పెను. ధాన్యతుంబురు క్వాథమే ధాన్య తుంబురు యూషము(గా గ్రహించ వలెను) "ధాన్యతుమ్బురురసేన కల్కో విషనుత్" అని జతూకర్ణమునందు చెప్ప బడినది గదా !

## పదకొండు కషాయ యోగములు

16. జాత్యాః సౌమనసాయన్యా రజన్యాశ్చోరకస్య చ
వృశ్చీరస్య మహాక్షుద్రసహాహైమవతస్య చ

17. బిమ్బ్యాః పునర్నవాయా వా కాసమర్దస్య వా పృథక్
ఏకం ధామార్గవం ద్వే వా కషాయే పరిమృద్య తు

18. పూతం మనోవికారేషు పిబేద్వమనముత్తమమ్

**తాత్పర్యములు :** జాజి, సౌమనసాయినీ (అడవి మొల్ల ?), పసుపు, చోరక (గ్రంధిపర్ణము?), తెల్లగలిజేరు, అడవి పెసర, అడవి మినుము, వస, దొండ, అటుక మామిడి, కసివెంద అనునీ పదకొండు ద్రవ్యములలో నొకదాని కషాయమునందు ఒకటి (లేదా) రెండు చేదుబీర కాయలను కలిపి పిసికి వడగట్టి మానసిక వ్యాధులందు వమనమునకై త్రాగించినచో చక్కగా వమనమగును.

**ఆయుర్వేదదీపిక :** "జాత్యా" అను మొదలైనదానితో పదకొండు కషాయ యోగములు చెప్పెను. జాతి (జాజి) అనగా సౌమనస్యాయినీ. ఇతరులు 'యూథికా' అని చెప్పుచున్నారు. వృశ్చీర అంటే శ్వేత పునర్నవా. మహాసహా, క్షుద్రసహా అంటే ముద్గపర్ణీ, మాషపర్ణీలు, హైమవతీ అనగా వస.

## ఘృత యోగము

తచ్ఛృతక్షీరజం సర్పిః సాధితం వా ఫలాదిభిః

**తాత్పర్యము :** చేదుబీరకాయల చూర్ణమును కలిపి కాచబడిన పాలనుండి తీసిన ఘృతము నందు మంగకాయ మొదలగు వమనద్రవ్యకషాయములలో దేనినైన నొకదానిని కలిపి ఘృతపాక విధి ప్రకారము పక్వము చేయబడిన ఘృతము నుపయోగించినను చక్కగ వమనమగును.

**ఆయుర్వేదీపిక :** "తచ్ఛృతం" అను మొదలైనదానితో ఒక ఘృత యోగము చెప్పెను.

## అధ్యాయ విషయసంగ్రహము

తత్ర శ్లోకా-

19. పల్లవే నవ చత్వారః క్షీర ఏకః సురాసవే
కషాయే వింశతిః కల్కే దశ ద్వౌ చ శకృద్రసే

20. అన్న ఏక స్తథా శ్రేయే దశ లేహాః స్తథా ఘృతమ్
కల్పే ధామార్గవస్యోక్తాః షష్టిర్యోగా మహర్షిణా

**తాత్పర్యము :** ఈ ధామార్గవ కల్పమున

| | |
|---|---|
| పల్లవములు (చిగుళ్ళతో) చేయబడిన యోగములు | 9 |
| క్షీర యోగములు | 4 |
| సురా మద్యముతో యోగము | 1 |
| కషాయ యోగములు | 20 |
| కల్క యోగము | 1 |
| శకృద్రస యోగములు | 12 |
| అన్న యోగము | 1 |
| శ్రేయ యోగము | 1 |
| ఘృత యోగము | 1 |
| లేహ యోగములు | 10 |
| మొత్తం యోగముల సంఖ్య | 60 |

అను అరువది వమన యోగములు మహర్షి ఆత్రేయునిచే చెప్పబడెను.

**ఆయుర్వేదదీపిక :** పల్లవే నవ అను సంగ్రహమునందు చందస్సు సరిపడకపోవుటచే క్రమము తప్పి సంగ్రహమున చెప్పబడెను. పది రెండు అనగా పండ్రెండు అని అర్థము.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతి సంస్కృతేఽప్రాప్తే
దృఢబలసంపూరితే కల్పస్థానే ధామార్గవకల్పో నామ చతుర్థోఽధ్యాయః

ఈ విధముగా లభ్యము కాకపోవుటచే దృఢబలునిచే పూరింపబడిన చరకుని ద్వారా ప్రతి సంస్కరింపబడిన అగ్నివేశకృత తన్త్రమందలి కల్పస్థానములో ధామార్గవ కల్పమను నాల్గవ అధ్యాయము (సంపూర్ణము).

శ్రీచక్రపాణిదత్తవిరచితాయాం ఆయుర్వేదదీపికాయాం చరకతాత్పర్య-టీకాయాం కల్పస్థానే ధామార్గవకల్పో నామ చతుర్థోఽధ్యాయః

శ్రీ చక్రపాణి దత్తునిచే రచింపబడిన 'ఆయుర్వేద దీపిక' అనెడు చరక తాత్పర్య టీకాయందు కల్పస్థానములో 'ధామార్గవ కల్పము' అను పేరుగల చతుర్థాధ్యాయము.

ఓజే bark — best Anti diarrhoeal. called as
Kurchicin present in bark is Antiprotozoal ఇంద్రీఢ

# పంచమాధ్యాయము

1. అథాతో వత్సకకల్పం వ్యాఖ్యాస్యామః good స్తంభకి.
2. ఇతి హస్మాహ భగవానాత్రేయః

**తాత్పర్యము :** అటు తరువాత వత్సక కల్పమును వ్యాఖ్యానము చేయ గలము. భగవంతుడైన ఆత్రేయుడు ఈ విధముగా చెప్పెను.

**ఆయుర్వేదదీపిక :** చెప్పిన సంబంధమునను గురించి వత్సక కల్పము చెప్పుట.

## వత్సక పర్యాయనామములు - భేదములు - గుణములు

3. అథ వత్సకనామాని భేదం స్త్రీపుంసయో స్తథా
కల్పం చాస్య ప్రవక్ష్యామి వి స్తరేణ యథాతథమ్
4. వత్సకః కుటజః శక్రో వృక్షకో గిరిమల్లికా
బీజానీన్ద్రయవా స్తస్య తదోచ్య న్తే కలిఙ్గకాః
5. బృహత్ఫలః శ్వేతపుష్పః స్నిగ్ధపత్రః పుమాన్ భవేత్
శ్యామా చారుణపుష్పా స్త్రీ ఫలవృన్తై స్తథాఽణుభిః
6. ర క్తపి త్తకఫఘ్న స్తు సుకుమారేష్వనత్యయః
హృద్రోగజ్వరవాతాసృగ్వీసర్పాదిషు శస్యతే

**తాత్పర్యము :** వత్సక (కొడిసెపాల)మునకు సంబంధించిన పర్యాయ నామంబులను, స్త్రీ పురుష భేదంబును, వాని కల్పనమును వి స్తరముగ ఉన్నది యున్నట్లు చెప్పెదను వినుము. వత్సకము, కుటజము, శక్రము, వృక్షకము, గిరి మల్లికా అనునీ నామములచే కొడిసెపాల చెప్పబడును. మరియు దాని వి త్తనములు ఇంద్రయవ, కలింగము అను పర్యాయములచే చెప్పబడును. పెద్దకాయలును, తెల్లని పుష్పములును, సున్నటి ఆకులును కల్గినది పురుషజాతికి చెందిన కొడిసెపాల యగును. శ్యామ వర్ణమును, అరుణవర్ణము గల్గిన చిన్నవైన పువ్వులును, చిన్న ఫలములను కల్గినది స్త్రీజాతిదనియు తెలుసుకొనవలెను. కొడిసెపాల ర క్తపి త్తమును హరించును. మిక్కిలి సుకుమారులుగ నుండువారికి శ్రమను కల్గించక పనిచేయును. హృద్రోగము, జ్వరము, వాతర క్తము, వినర్పము మొదలగు వ్యాధులందు చాలా ప్రశ స్తముగా యుండును.

not so useful.

**ఆయుర్వేదదీపిక** : వత్సకము యొక్క పేర్లను వ్యవహారము కొరకు స్త్రీ పురుష భేదములను 'అథ' మొదలైనవానితో చెప్పెను. ఇచ్చట కొడిసెపాల స్త్రీ పురుష భేదానుసారము గుణభేదముగాని, ప్రయోగ భేదముగాని ప్రతిపాదింపబడక పోయినను, స్త్రీ జాతి కొడిసెపాల అపుష్ప ఫలత్వ(చిన్న పువ్వులు, కాయలు) మొదలైన విశిష్ట లక్షణములతో కూడియున్నను విశేషము (తేడా) లేకుండా రెండు రకములైన కొడిసెపాలలచే రోగనివృత్తి అగును-అనుసీ అర్థము రెండింటికినీ సమాన గుణముగా తెలిసికొనదగినది.

## వత్సకములో తొమ్మిది కషాయయోగములు

7. కాలే ఫలాని సంగృహ్య తయోః శుష్కాణి నిక్షిపేత్,
   తేషామన్తర్నఖం ముష్టిం జర్జరీకృత్య భావయేత్

8. మధుకస్య కషాయేణ కోవిదారాదిభిస్తథా
   నిశి స్థితం విమృద్యైతల్లవణ క్షౌద్రసంయుతమ్

9. పిబేత్తద్వమనం శ్రేష్ఠం పిత్తశ్లేష్మనిబర్హణమ్

**తాత్పర్యము** : చక్కగ పండి ఎండిన కాయలను యుక్తమైన కాలమున విధి ప్రకారము గ్రహించి వానిని చూర్ణించి పిడికిలి పరిమాణమున గ్రహించి **అతి** మధుర కషాయము నందైనను, కోవిదారా మొ॥న ఎనిమిది కషాయ ద్రవ్యములలో నొకదాని యందైనను ఒక రాత్రి యంతయు నుంచి మరునాటి ఉదయమున చక్కగ పిసికి కషాయమును వడగట్టుకొని అందు సైంధవ లవణమును, తేనెను కలిపి త్రాగవలెను. ఈ వమన యోగము మిక్కిలి శ్రేష్టమైనది. పిత్త కఫములను చక్కగ హరించును.

**ఆయుర్వేదదీపిక** : "కాలే" అనగా తగిన కాలమున. "శుష్కాణి" అనగా పండి ఎండినవి. "తేషామన్తర్నఖం" అను మొదలైనవానిచే కషాయముతో తొమ్మిది యోగములను చెప్పెను. క్షౌద్రసైంధవ యోగము అన్ని వమనములయందు సామాన్యముగా చెప్పబడినప్పటికినీ ఇచ్చట "లవణక్షౌద్రసంయుతమ్" అను మాట వలన సైంధవలవణయోగమునకు ప్రాధాన్యత చెప్పబడుచున్నది.

## అయిదు చూర్ణయోగములు - మూడుసలిల యోగములు

అష్టాహం పయసాఽఽర్కేణ తేషాం చూర్ణాని భావయేత్
10. జీవకస్య కషాయేణ తతః పాణితలం పిబేత్
ఫలజీమూతకేక్ష్వాకుజీవ న్తీనాం పృథక్ తథా
11. సర్షపాణాం మధూకానాం లవణస్యాథవాఽమ్బునా

**తాత్పర్యము :** కొడిసెపాల విత్తుల చూర్ణమును జిల్లేడు పాలయందు ఎనిమిది దినములు భావనచేసి అందు పాణితల (1 కర్షము) ప్రమాణమున జీవకము యొక్క కషాయముతో కలిపి త్రాగవలెను. ఇదే విధముగా మంగకాయ, దేవదాళి, చేదుసొర, జీవన్తీ (ముక్కు తుమ్మడు తీగ) అను నాల్గు ద్రవ్యములలో దేని కషాయము నందైనను చేర్చి త్రాగవచ్చును. మరియు ఆవాలు, ఇప్పపువ్వు, లవణములను జలముతో కలిపి ఆ జలములో పై చూర్ణమును కలిపి త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** "అష్టాహం" అనుదానిలో అయిదు చూర్ణ యోగములను చెప్పెను.

## కృశర యోగము

11. కృశరేణాథవా యుక్తం విదద్యాద్వమనం భిషక్

**తాత్పర్యము :** పైన చెప్పిన చూర్ణమును కృసరముతో కలిపి త్రాగించినను చక్కగ వమనమగును.

**ఆయుర్వేదదీపిక :** "కృశరేణ" అనుదానితో కృశర యోగము చెప్పబడుచున్నది. ఇక్కడ ఇంద్రియవ చూర్ణము గూర్చియే చెప్పబడుచున్నది.

**విశేషవ్యాఖ్య :** భావప్రకాశ సంహితయందు బియ్యమును, పప్పును, చేర్చి అందు ఉప్పును, అల్లమును, ఇంగువను కలిపి నీళ్ళుపోసి యుడక పెట్టబడిన దానిని కృశరమని పేర్కొనబడినది. దీనినే తెలుగులో పులగము అందురు.

## అధ్యాయ విషయ సంగ్రహము

తత్ర శ్లోకః—
12. కషాయైర్నవ చూర్ణైశ్చ పంచోక్తాః సలిలైస్త్రయః
ఏకశ్చ కృశరాయాం స్యాద్యోగాస్తేఽష్టాదశ స్మృతాః

తాత్పర్యము : ఈ వత్సక కల్పమున

| | | |
|---|---|---|
| కషాయ యోగములు | — | 9 |
| చూర్ణ యోగములు | — | 5 |
| ఉదకముతో యోగములు | — | 3 |
| కృసర యోగము | — | 1 |

అను పదునెనిమిది వమన యోగములు చెప్పబడినవి.

ఆయుర్వేదదీపిక : "కషాయైః" అను సంగ్రహశ్లోకము వ్యాఖ్యానము చేయబడిన అర్థము గలదియే (అనగా వ్యాఖ్యానింపబడినదని అర్థము)

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరక ప్రతిసంస్కృతేఽప్రాప్తే
దృఢబలసంపూరితే కల్పస్థానే వత్సకకల్పో నామ
పంచమోధ్యాయః

ఈ విధముగా లభ్యము కాకపోవుటచే దృఢబలునిచే పూరింపబడిన చరకుని ద్వారా ప్రతిసంస్కరింపబడిన అగ్నివేశకృత తన్త్రమందలి కల్పస్థానములో వత్సక కల్పమను అయిదవ అధ్యాయము సంపూర్ణము.

శ్రీ చక్రపాణిదత్తవిరచితాయామాయుర్వేదదీపికాయం చరకతాత్పర్య-టీకాయాం-కల్పస్థానే వత్సకకల్పో నామ పఞ్చమోఽధ్యాయః

శ్రీ చక్రపాణి దత్తునిచే రచంపబడిన "ఆయుర్వేదదీపిక" అనెడు చరక తాత్పర్యటీకా యందు కల్పస్థానములో 'వత్సక కల్పము' అను పేరు గల పంచమా ధ్యాయము.

# షష్ఠాధ్యాయము

1. అథాత · కృతవేధనకల్పం వ్యాఖ్యాస్యామః
2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః

అటు తరువాత కృతవేధన కల్పమును వ్యాఖ్యానము చేయగలము. ఆత్రేయ భగవానుడు ఈ విధముగా చెప్పెను

**ఆయుర్వేదదీపిక** : వమన కల్పమున మిగిలినది అగుటచే కృతవేధన కల్పము చెప్పబడుచున్నది.

## కృతవేధన పర్యాయ నామములు-గుణములు

3. కృతవేధననామాని కల్పం చాస్య నిబోధత
క్ష్వేడః కోశాతకీ చోక్తం మృదఙ్గఫలమేవ చ
4. అత్యర్థకటుతీక్ష్ణోష్ణం గాఢేష్విష్టం గదేషు చ
కుష్ఠపాండ్వామయప్లీహశోఫగుల్మగరాదిషు

**తాత్పర్యము** : కృతవేధనము (చిన్న చేదుబీర) యొక్క పర్యాయ నామములు, దానిచే చేయబడు కల్పనలను చెప్పెద వినుము.

క్ష్వేడ - కోశాతకీ-మృదఙ్గఫలము అనునవి కృతవేధనమునకు పర్యాయ నామములు. చిన్న చేదుబీర అధికమైన కటురసము, తీక్ష్ణగుణము గల్గియుండును. దీనిని గంభీరమైన కుష్ఠము, పాండువ్యాధి, ప్లీహవృద్ధి, శోఫము, గుల్మము, గరమను విషము మొదలగు రోగముల యందు ఉపయోగించవలెను.

**ఆయుర్వేదదీపిక** : "గాఢేషు" అనగా మిక్కిలి గాఢమైన కుష్ఠము మొదలైన వాని యందు (అని అర్థము).

## కృతవేధనతో నాలుగు క్షీరయోగములు : సురాయోగము

5. క్షీరాది కుసుమాదీనాం సురా చైతేషు పూర్వవత్

**తాత్పర్యము** : చిన్న చేదుబీర పుష్పాల చేర్చి కాచబడిన క్షీర యోగమును, కాయలు చేర్చి కాచబడిన పాలను చేర్చి సిద్ధము చేయబడిన పేయూ

యోగమును, క్షీర సన్తానికాది యోగమును, దధిసరదధ్యమ్ల యోగమును, సురా యోగమును ఈ ఐదింటిని పూర్వము చెప్పిన (జీమూత కల్పము నందు) విధానము ననుసరించి కల్పించవలెను.

**ఆయుర్వేదదీపిక** : 'క్షీరాది' అనువానితో క్షీరయోగములు చెప్పబడు చున్నవి. నాలుగు క్షీరయోగములను, మదిరా యోగమును జీమూతక కల్పవిధానము కంటె మిక్కుటముగా చెప్పెను. క్షీర మొదలైన శబ్దముచే క్షీరకృతపేయము, క్షీర సన్తానిక, దధ్యుత్తర (పెరుగు మీగడ) లను గ్రహించుట. "క్షీరే ద్వౌ ద్వౌ" అనుమాటచే ఇవి సంగ్రహమున క్షీర రూపములు కాకపోయినను క్షీర వికారములుగా క్షీర శబ్దము చేత గ్రహింపబడినవి. "కుసుమాదీన" అనగా కృతవేధనముతో.

"పయః పుష్పేఽస్య నిర్వృత్తే ఫలే పేయా పయస్కృతా

లోమశే క్షీరసంతానం దధ్యుత్తరమలోమశే" (క. అ. 2.) చెప్పబడు పుష్పాదులకు జీమూతక విధానమున చెప్పినట్లు అని అర్థము.

"సురా చైతేషు పూర్వవత్" అనగా జీమూతక కల్ప విధానము చేత క్షీరాదులు చేయదగు విధముగ సురయు చేయదగినది.

## ఇరువది రెండు కషాయ యోగములు

సుశుష్కాణాం తు జీర్ణానామేకం ద్వే వా యథాబలమ్
6. కషాయైర్మధుకాదీనాం నవభిః ఫలవత్ పిబేత్
క్వాథయిత్వా ఫలం తస్య పూత్వా లేహం నిధాపయేత్
7. కృతవేధన కల్కాంశం ఫలాద్యర్ధాంశసంయుతమ్
పృథక్ చారగ్వధాదీనాం త్రయోదశభిరాసుతమ్

**తాత్పర్యము** : చక్కగ పండి ఎండిన చిన్నచేదు బీరకాయల నుండి విత్తనములను గ్రహించి, రోగి బలానుసారము ఒకటి గాని రెండు గాని మదన కల్పమున చెప్పబడిన మధుక, కోవిదారాది ద్రవ్యములచే వేరువేరుగ సిద్ధము చేయ బడిన కషాయములలో తొమ్మిదింట్లో నొకదాని యందు చేర్చి రాత్రి యంతయు ఉంచి మదన కల్పమున చెప్పబడిన విధి ప్రకారము త్రాగవలెను. చిన్నచేదు బీరకాయ గింజలను చూర్ణము చేసి ఆ చూర్ణము ఒక భాగము, ప్రియంగువు మొదలగు ఫలపు

ద్రవ్యము లాంటిలో నొకదాని చూర్ణము అర్ధభాగమును, పై చెప్పబడిన మధూక, కోవిదారాది తొమ్మిది ద్రవ్యములతో వేరువేరుగ సిద్ధమైన కషాయములలో ఒక దాని యందు చేర్చి లేహపాకమునకు కావలసినంత చక్కెరను, తేనెను కలిపి లేహ పాక ప్రకారము పక్వము చేయవలెను. రేల-కొడిసెపాల విత్తులు మున్నగు పదమూడు ద్రవ్యముల వేరువేరుగ కషాయములతో నొక్కొక్కదానియందు చిన్న చేదు బీర విత్తనముల చూర్ణమును కలిపి రాత్రియంతయు యుంచి మరునా డుదయమున వడగట్టి త్రాగవలెను. పదమూడు కషాయ యోగములలో వేరువేరుగ నుపయోగించుటచే యీ కషాయ యోగములు పదమూడగును.

**ఆయుర్వేదదీపిక :** "సుకుష్కాణాం" అను దానితో తొమ్మిది కషాయ యోగములు చెప్పెను. "ఫలవత్" అనగా మదనఫలము యష్టిమధుకాదులచే త్రాగ బడిన విధముగ ఇదియు త్రాగదగినదని అర్థము. కొంత మంది నవకషాయ యోగములలో శేషవిధికి మారుగా లేహమును "క్వాథయిత్వా రసం తస్య పూత్వా లేహం నిధాపయేత్" అనుదానితో చదువుతున్నారు. అది కలియునట్టి భావము (అది విధానమునకు సరైన భావము). "అత్ర జీర్ణబీజానాం మదనఫలవత్ కషాయైర్లేహా భవన్తి నవ" అని జతూకర్ణమునందు చెప్పబడినది. "పృథక్" అను దానితో 13 కషాయ యోగములు చెప్పెను. ఈ విధముగా 22 కాషాయ యోగములగుచున్నవి. ఆరగ్వధాదులు పదమూడు మదన కల్పమందు "ఆరగ్వధ వృక్షక" (క. అ. 1) మొదలగువానితో గుడూచీ (చివర) వరకు చెప్పబడినవిగా తెలిసికొనదగినది.

## పది పిచ్ఛాయోగములు

౮. శాల్మలీమూలచూర్ణానాం పిచ్ఛాభిర్దశభిస్తథా

**తాత్పర్యము :** బూరుగు మొదలగు పది ద్రవ్యముల చూర్ణమును పిచ్ఛా విధాన ప్రకారము రసము తీసి దానియందు చేదుబీరకాయల చూర్ణమును కలిపి త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** "శాల్మలీ"అనువానిచే పది పిచ్ఛాయోగములను చెప్పెను. "శాల్మలీమూలా" అనుచోట మూల శబ్దము ఆదివాచకము. "శాల్మలీమూలం - యేషాం తే శాల్మలీ మూలం" అను విగ్రహముచే విధాన

స్థానమండలి (రోగభిషగ్జితీయ) చదువబడిన పది ద్రవ్యములు - శాల్మలీశాల్మలక భద్రపర్ణ్యేలాపర్ణ్యుపోదికోద్దాలధన్వనరాజాదనోపచిత్రాగోవ్యస్త్రాః" (వి అ. 8) గ్రహించవలెను. ఈ చూర్ణములను పిచ్ఛలతో యుక్తితో చేయుట చేతనే పది యోగములుగా తెలిసికొనదగినది. శాల్మలక మనగా శాల్మలీ భేదము, లేదా రోహితకముగాని (గ్రహించవలెను). భద్రపర్ణీ అనగా గంభారీ. ఏలాపర్ణీ అనగా నాగబలా. కొంతమంది అహింస్రా అని అందురు. రాజాదనము అనగా క్షీరికా, ఉపచిత్రా అనగా దన్తీ, గోపీ అనగాసారివా.

## ఆరువర్తి యోగములు-ఘృతయోగము

వర్తిక్రియాః షట్ ఫలవత్ ఫలాదీనాం ఘృతం తథా

**తాత్పర్యము :** మ్రంగకాయ నుద్దేశించి మదన కల్పమున చెప్పబడిన రీతిగ చిన్నచేదుబీరకు ఆరు వర్తిక్రియ యోగములు కల్పించవలెను. పూర్వ అధ్యాయములందు చెప్పిన విధానము ననుసరించి చేదుబీర గింజలు చేర్చి పక్వము చేయబడిన క్షీరము నుండి తీయబడిన వెన్నతో మ్రంగకాయ మున్నగు ఆరు ద్రవ్యముల కల్కములను, వానిచే కషాయమును చేర్చి ఘృతపాక విధి ప్రకారము ఘృతము చేయవలెను.

**ఆయుర్వేదదీపిక :** "వర్తిక్రియాః షట్ ఫలవత్", "ఫలపిప్పలీ చూర్ణాని పూర్వవత్" అను శ్లోకములో మదన కల్పము నందు ఏవర్తిక్రియకు చెప్పబడినదో ఆవిధముగానే ఇచ్చటను కృతవేధన చూర్ణములకు ఆరు వర్తిక్రియలు చేయదగినవి. మదన ఫలఘృతము వలెనే కృతవేధనముతో చేర్చి పాక మొనర్చిన క్షీరము నుంచి వచ్చిన వెన్నను మదన ఫలము మొదలగువాని కషాయములలో సాధింపవలెనని (ఘృతపాక మొనర్పవలెను) అర్థము.

## మొనిమిది లేహ యోగములు

9. కోశాతకాని పఞ్చాశత్ కోవిదారరసే పచేత్
తం కషాయం ఫలాదీనాం కల్కైర్లేహం పునః పచేత్

10. క్ష్వేడస్య తత్ర భాగః స్యాచ్ఛేషాణ్యర్ధాంశికాని తు
కషాయైః కోవిదారాద్యైరేవం తత్ కల్పయేత్ పృథక్

**తాత్పర్యము :** చిన్న చేదు బీరకాయ విత్తులను ఏబదిని కోవిదార స్వర సము (లేదా సిద్ధమైన కషాయము నందు)న చేర్చి కాచవలెను. ఆ కషాయమును మంగకాయ మున్నగు (ఆరు) ద్రవ్యములను వేరు వేరుగా అర్ధాంశమును, చిన్న చేదుబీర విత్తులు నొక భాగమును కల్కము చేసి కలిపి లేక పాకవిధి ననుసరించి మరల పాకము చేయవలెను. ఇదే విధముగా కోవిదార మొదలగు ఎనిమిది ద్రవ్య ముల వేరు వేరు కషాయములతో ఎనిమిది లేహ యోగములు కల్పించవలెను.

**ఆయుర్వేదదీపిక :** "కోశాతకాని" మొదలైనవి ఇక్కడనే నాల్గు భాగ ములు మిగులునట్లు కషాయము కాచి కృతవేధన కల్కము ఒక భాగము యివ్వదగి నది. మంగకాయ మొదలైనవి కృతవేధన కల్కమునకు అర్ధభాగములో గ్రహించ వలెను.

## ఏడు మాంసరసయోగములు

11. కషాయేషు ఫలాదీనామానూపం పిశితం పృథక్
కోశాతక్యా సమం పక్త్వా రసం సలవణం పిబేత్

12. ఫలాదిపిప్పలీతుల్యం తద్వత్ క్ష్వేడరసం పిబేత్

**తాత్పర్యము :** మంగకాయగింజలు, దేవదాలి మున్నగు వమన ద్రవ్య ముల వేరు వేరు కషాయములందు అనూప మాంసమును, చిన్న చేదు బీరకాయ విత్తులను సమభాగములుగా కలిపి పక్వము చేసి, ఆరసమందు సైంధవ లవణమును చేర్చి త్రాగవలెను. చిన్న చేదుబీరగింజల రసము (కషాయము) నందు మంగ కాయ మొదలగు ఆరు వమన ద్రవ్యముల సముదాయ చూర్ణమును అనూప మాంసమునకు సమభాగములుగ చేర్చి పక్వము చేసి అట్టి మాంస రసమున లవణము కలిపి త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'కషాయేషు' అను దానిలో ఏడు మాంస యోగము లను చెప్పెను. సమమనగా కోశాతకీతో సమానమైన భాగము గల మాంసమని. ఇచ్చట 'పిబేత్' అను అంతముతో ఆరు మాంస రసము (చెప్పబడినది). "ఫలాది"

**అనుదానిలో** ఒక యోగము (చెప్పబడినది). "ఫలాదిపిప్పలీతుల్యం తద్వత్" **అను** దానిలో ఫలాదులతో సమానముగా మాంసమును గ్రహించవలెను. "తద్వత్" **అను** మాట వలన కోశాతకీ యొక్క కషాయముతో సాధింపదగినది.

క్ష్వేడం కాసీ పిబేత్ సిద్ధం మిశ్రమిక్షురసేన చ

**తాత్పర్యము** : చిన్న చేదు బీరగింజల చూర్ణమును చెరుకు రసమున కలిపి పక్వము చేసి కాసవ్యాధియందు త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక** : "క్ష్వేడం" అని ఇక్షురస యోగము నొకదానిని చెప్పెను. "సిద్ధం" అనగా చెరుకు రసములో కలిపి పాకము చేసి త్రాగవలెనని అర్థము. జతూకర్ణము నందు "క్ష్వేడమిక్షురసే శృతం" అని చెప్పబడినది గదా !

## అధ్యాయ విషయసంగ్రహము

తత్రశ్లోకా—

13 క్షీరే ద్వౌ ద్వౌ సురా చైకా క్వాథా ద్వావింశతి స్తథా
దశ పిష్టా ఘృతం చైకం షట్ చ వ_ర్తిక్రియాః శుభాః

14. లేహాఽష్టౌ స_ప్త మాంసే చ యోగ ఇక్షురసేఽపరః
కృతవేధనకల్పేఽస్మిన్ షష్టిర్యోగాః ప్ర_కీ_ర్తితాః

**తాత్పర్యము** : ఈ కృతవేధన కల్పమున చేదుబీరకు

| | |
|---|---|
| క్షీరయోగములు | 4 |
| సురాయోగము | 1 |
| క్వాథయోగములు | 22 |
| పిష్టయోగములు | 10 |
| ఘృతయోగము | 1 |
| వ_ర్తియోగములు | 6 |
| లేహయోగములు | 8 |
| మాంసయోగములు | 7 |
| ఇక్షురస యోగము | 1 |

అరువది వమన యోగములు చెప్పబడినవి.

ఆయుర్వేదదీపిక : "క్షీరేద్వాద్వా" అను మొదలగు సంగ్రహము. "ద్వాద్వా" అనగా నాలుగు అని అర్థము.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతేఽప్రాప్తే
దృఢబలసంపూరితే కల్పస్థానే కృతవేధనకల్పో నామ షష్ఠోఽధ్యాయః

ఈ విధముగా లభ్యము కాకపోవుటచే ధృఢబలునిచే పూరింపబడిన చరకుని ద్వారా ప్రతిసంస్కరింపబడిన అగ్నివేశకృత తన్త్రమందలి కల్పస్థానములో కృత వేధన కల్పమను ఆరవ అధ్యాయము (సంపూర్ణము).

శ్రీచక్రపాణిదత్తవిరచితాయాం చరకతాత్పర్యటీకాయాం ఆయుర్వేదదీపి-
కాయాం కల్పస్థానే కృతవేధనకల్పో నామ షష్ఠోధ్యాయః

శ్రీ చక్రపాణి దత్తునిచే రచింపబడిన 'ఆయుర్వేదీపిక' అనెడు 'చరక తాత్పర్యటీకా' యందు కల్పస్థానములో కృతవేధన కల్పము అను పేరు గల ఆరవ అధ్యాయము.

# సప్తమాధ్యాయము

1. అథాతో శ్యామాత్రివృత్కల్పం వ్యాఖ్యాస్యామః

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః

**తాత్పర్యము :** అటు తరువాత శ్యామా త్రివృత్ కల్పమును వ్యాఖ్యానము చేయగలము. ఆత్రేయ భగవానుడు ఈ విధముగా చెప్పెను.

**ఆయుర్వేదదీపిక :** వమన విషయక కల్పము తరువాత విరేచన కల్పములు చెప్పదగియుండగ తెగడ విరేచన ద్రవ్యములలో సుఖవిరేచనమునకు ప్రధానమగుట వలన త్రివృత్ కల్పమే చెప్పబడుచున్నది.

త్రివృత్ భేదమే శ్యామము - దానిచేత శ్యామమైన త్రివృత్‌కి కల్పము శ్యామా త్రివృత్ కల్పమగుచున్నది. అరుణవర్ణము గల మూలంతో కూడియున్న త్రివృత్ ఇచ్చట ఉత్కృష్టమైనను, అధ్యాయ సంజ్ఞలో శ్యామమును మొదట పఠించుట చేతను, వెంటనే దోషమును పరిహరించుట వలనను శ్యామ యొక్క ఉత్కర్షను చూపించుచున్నాడు. ఇక్కడ ఏ యోగములు చెప్పబడినవో అవి వాతాది దోషములు, శరీరము మొదలగు వానియొక్క బలాబలములను పరిశీలించి అరుణచేతగాని శ్యామ చేతగాని లేక రెండింటి చేతనుగాని చేయదగినది.

## విరేచనములో త్రివృన్మూల శ్రేష్ఠత్వము

3. విరేచనే త్రివృన్మూలం శ్రేష్ఠమాహుర్మనీషిణః
తస్యాః సంజ్ఞా గుణాః కర్మ భేదః కల్పశ్చ వక్ష్యతే

**తాత్పర్యము :** విరేచన విషయమై తెగడ వేరు మిగుల శ్రేష్ఠమని జ్ఞానగరిష్ఠులగు మునిపుంగవులు చెప్పెదరు. అట్టి తెగడకు సంబంధించిన పర్యాయనామములు, గుణములు, కర్మ భేదము, విరేచనౌషధముగ ఉపయోగింపదగిన కల్పనా విధానము ఈ క్రింద చెప్పబడును.

**ఆయుర్వేదదీపిక :** 'విరేచనే' అను మొదలగువానియందు 'త్రివృన్మూల' శబ్దముచేత శ్యామా మూలమునకు అరుణ మూలమునకు సామాన్యముగా మూలము గ్రహింపబడుచున్నది.

## త్రివృత్ పర్యాయనామములు

4. త్రిభణ్డీ త్రివృతా చైవా శ్యామా కూటరణా తథా
సర్వానుభూతిః సువహా శబ్దాః పర్యాయవాచకాః

**తాత్పర్యము :** త్రిభండీ, త్రివృత, శ్యామ, కూటరణ, సువహ, సర్వానుభూతి అనునీ పర్యాయనామములచే తెగడ సామాన్యముగ చెప్పబడును.

**ఆయుర్వేదదీపిక :** పర్యాయిత్వములో చెప్పబడిన వాటిచే అని అర్థము.

## త్రివృత్ సామాన్య గుణములు

5. కషాయా మధురా రూక్షా విపాకే కటుకా చ సా
కఫపిత్తప్రశమనే రౌక్ష్యాచ్చానిలకోపనే

6. సేదానీమౌషధైర్యుక్తా వాతపిత్తకఫాపహా
కల్పవైశేష్యమాసాద్య సర్వరోగహరా భవేత్

**తాత్పర్యము :** తెగడ కషాయ మధుర రసములు, రౌక్ష్యగుణము, కటు విపాకమును కలిగియుండును. స్వభావము చేతనే కఫపిత్తముల శమింపచేయును రూక్ష గుణము కల్గియుండుటచే వాతమును మాత్రము ప్రకోపింపజేయును.

**ఆయుర్వేదదీపిక :** స ఇదానీం ఇత్యాది - వాతాన్ని పోగొట్టి ఔషధము యోగముతో వాతమును పోగొట్టరేని దగుచున్నది. కఫపిత్త హరత్వము అధికమగు చున్నది అని తెలుసుకొనవలెను.

'కల్పవైశేష్య' మనగా కల్పనా విశేషమని అర్థము. 'సర్వరోగహర' అనగా వ్యస్త, సమస్తములైన అన్ని దోషములలో ప్రారంభించదగిన రోగములను పోగొట్టునది.

7. మూలంతు ద్వివిధం తస్యాః శ్యామం వారుణమేవ చ
తయోర్ముఖ్యతరం విద్ధి మూలం యదరుణప్రభమ్

8 సుకుమారే శిశౌ వృద్ధే మృదుకోష్ఠే చ తచ్ఛుభమ్
మోహయేదాశుకారిత్వాచ్ఛ్యామా క్షిణ్వీత మూర్ఛయేత్

9. తైక్ష్ణ్యాత్ కర్షతి హృత్కణ్ఠమాశు దోషం హరత్యపి
శస్యతే బలదోషాణాం కల్యాణోష్ణాశ్చ యే నరాః

**తాత్పర్యము :** పైన చెప్పబడిన తెగడవేరు శ్యామవర్ణముగ నుండునది ఒకటి, అరుణవర్ణముగ నుండునది వేరొకటి. ఆ రెంటిలో ఎఱ్ఱని తెగడ వేరు మిగుల శ్రేష్ఠముగనుండును. అది సుకుమారులకు, పసిబాలురకును, వృద్ధులకును, మృదువైన కోష్ఠము కలవారికిని విరేచనమునకు చాల ప్రశస్తముగ నుండును. నల్లని రంగుగల తెగడ వేరు ఆశుకారియగుటచే చిత్తభ్రమము కల్గించును. ధాతువులను క్షీణింప జేయును. తీక్ష్ణ గుణమువలన హృదయమును కంఠమును లాగివట్టును. ఐనను దోషములను శీఘ్రముగా హరించును కావున నిది ప్రబలముగ దోషసంచయము కల వారికిని కోష్ఠము కఠినముగ నుండువారికి మిక్కిలి శ్రేష్ఠముగనుండును.

**ఆయుర్వేదదీపిక :** "మూలంతు ద్వివిధం" అనుదానితో త్రివృత్‌ల భేదమును చెప్పెను. ముఖ్యతరమనగా విరేచన క్రియలోనే వ్యాపత్తు లేనిదగుట వలన మిక్కిలి శ్రేష్ఠమైనది. సుకుమారులను, శిశువులను అవిరేచనేయులుగా చెప్పబడి నప్పటికినీ వారికి విధింపబడిన విరేచనమున హితమైనదని తెలుసుకొనదగినది. "మోహయేత్" అనుదానితో శ్యామ మూలమునకు గుణకర్మలను చెప్పుచున్నాడు. 'క్షిణ్వీత' అను మొదలైనదానితో ధాతునాశము (చేయును.)

## గ్రహించు విధానము

10. గుణవత్యాం తయోర్భూమౌ జాతం మూలం సముద్ధరేత్
ఉపోష్య ప్రయతః శుక్లే శుక్లవాసాః సమాహితః

11. గమ్భీరానుగతం శ్లక్ష్ణమతిర్యగ్విసృతం చ యత్
తద్విపాట్యోద్ధరేద్గర్భం త్వచం శుష్కాం నిధాపయేత్

**తాత్పర్యము ·** మొదటి అధ్యాయమునందు ఓషధి గ్రహణ ప్రస్తావముగ చెప్పబడిన గుణముగల ప్రశస్త భూమియందు పుట్టిన పై చెప్పిన రీతిగ రెండు విధములైన తెగడవేరును, శుక్లపక్షమున నుపవాసము చేసి తెల్లని వస్త్రమును ధరించి నిశ్చలచిత్తుడై గ్రహించవలెను. అట్టి వేరు భూమిలో మిక్కిలి లోతునకు దిగి కణుపులు లేక నునుపుకల్గి యుండవలెను. అడ్డముగ భూమిలో వ్యాపించియుండు వేరును గ్రహింపకూడదు. అట్టి తెగడవేరును పై చెప్పిన నియమముతో గ్రహించి మధ్యముగ కడిగి చీల్చి అందుండు నరములను కాక పట్టను మాత్రము చక్కగ నెండించి విధ్యుక్త ప్రకారము పదిలముగ నుంచవలెను.

**ఆయుర్వేదదీపిక** . మదన కల్పమునందే ప్రశస్తమైన భూమియందు పుట్టుట మొదలైనవి సామాన్యముగా భేషజ (సంగ్రహణ)ములకు చెప్పబడియుండుట వలన గంభీరానుగతత్వము మొదలైన విశేషము అక్కడ చెప్పబడకుండుటవలన ఇక్కడ చెప్పబడగా ఆ ప్రసంగమున 'గుణవత్యాం' ఈ మొదలైన దానితో ఇక్కడ చెప్పబడుచున్నది 'శుక్లే' అనగా శుక్లపక్షము. గంభీరానుగతమనగా లోతుగా ప్రవేశించినది 'ఉద్ధరేత్' గర్భమనగా వేరుయొక్క మధ్యభాగమును తీసి వేయవలెను. 'నిధాపయేత్' అనగా భైషజ్య స్థాపన విధానము ఉంచవలెను.

12. స్నిగ్ధస్విన్నో విరేచ్యస్తు పేయామాత్రోషితః సుఖమ్

**తాత్పర్యము** : విరేచనము చేయించవలసిన వానికి తొలుత విద్యుక్త ప్రకారము స్నేహ స్వేదవిధులు చేసి, ముందు దినమున పేయను మాత్రము ఆహారము చేయించి మరుసటినాడు సుఖముగ విరేచనము చేయించవలెను.

**ఆయుర్వేదదీపిక** : "పేయామాత్రోషితా" అనగా ముందురోజున త్రాగుటకు తగినంత ఆహారముగ పులియబెట్టినది. "స్నేహవత్ ద్రవముష్ణం చ త్ర్యహం భుక్త్వా రసౌదనమ్" - సు. అ. 13. అనుదానిచేత మరియొకచోట విరేచనమునకు పూర్వదినములందు ఆ విధముగానే ఆహారము నియమింపబడి నప్పటికినీ త్రివృత్ విరేచన ప్రయోగమున పూర్వదినమందు విశేషముగా చెప్పుటవలన పేయమును ఇచ్చుట అని తెలుసుకొనదగినది. మరియు ఇదే ఆ మాట వలన స్నిగ్ధము, ఉష్ణమైన మాంసరసముచే సాధించునట్లుగా చేయబడినదై పూర్వము చెప్పబడిన స్నేహమువలె ద్రవోష్ణమాంసరసౌదనమునకు విరుద్ధము కాదు.

## త్రివృత్‌తో తొమ్మిది కల్కయోగములు

అక్షమాత్రం తయోః పిణ్డ విసీయామ్లేన నా పిబేత్

13. గోఽవ్యజామహిషీమూత్రసౌవీరకతుషోదకైః
ప్రసన్నయా త్రిఫలయా శృతయా చ పృథక్ పిబేత్

**తాత్పర్యము** : పై చెప్పిన రీతిగ గ్రహించి పదిలముగ నుంచబడిన ఎఱ్ఱ తెగడల వేరుపట్టను వేరు వేరుగనైనను రెంటినైనను కర్షపరిమితమును నూరి ముద్దచేసి యా ముద్దను పులిగంజిలో కలిపి విద్యుక్త ప్రకారము త్రాగవలెను. ఈ

విధముగనే గోమూత్రము, గొఱ్ఱె పంచితము, మేక పంచితము, బఱ్ఱె పంచితము, సౌవీరకము, తుషోదకము, సురామద్యము యొక్క తేట, త్రిఫలా కషాయము, అనుసీ ద్రవములలో ఒకదానిలో కలిపి త్రాగవలెను

**ఆయుర్వేదదీపిక :** అక్షమాత్రము అనుదానితో తొమ్మిది అమ్లాది ద్రవ్యములలో తొమ్మిది యోగములను చెప్పెను. తయోః అనగా శ్యామా త్రివృత్, అరుణ త్రివృత్ కలిసిన ఈ రెండింటికి ప్రత్యేకముగా ప్రయోగములు అని ముందే ప్రతిపాదింపబడినది. అమ్లేన అనగా కాంజికముతో (అని అర్థము).

## సైంధవ లవణాదులలో చేరిన పన్నెండు చూర్ణయోగములు

14. ఏకైకం సైన్ధవాదీనాం ద్వాదశానాం సనాగరం
త్రివృద్ద్విగుణసంయుక్తం చూర్ణముష్ణామ్బునా పిబేత్

**తాత్పర్యము :** రోగభిషగ్జితీయాధ్యాయము నందలి లవణ స్కంధమున చెప్పబడిన సైంధవాది లవణములలో పండ్రెండు లవణములందు నొకదానిని గ్రహించి దానికి సమభాగము శుంఠిని, ఈ రెంటికిని ద్విగుణము త్రివృత్తము చేర్చి చూర్ణము చేసి సుఖోష్ణముగ నుండు వేడినీళ్ళలో కలిపి త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** "ఏకైక" అనుదానిలో సైంధవాదులలో పన్నెండు యోగములను చెప్పెను. సైంధవాదులకు పన్నెండు రోగభిషగ్జితీయాధ్యాయమున లవణస్కంధమున చెప్పబడినదిగా తెలిసికొనదగినవి. సనాగరమనగా శొంఠితో కూడా కూడినదై ప్రత్యేకము సైంధవాదుల చూర్ణము రెండురెట్లు త్రివృత్ చూర్ణముతో కూడినదై త్రాగదగినది.

## గోమూత్రములో పదునెనిమిదియోగములు

15. పిప్పలీ పిప్పలీ మూలం మరిచం గజపిప్పలీ
సరలః కిలిమం హిఙ్గు భార్గీ తేజోవతీ తథా

16. ముస్తం హైమవతీ పథ్యా చిత్రకో రజనీ వచా
స్వర్ణక్షీర్యజమోదా చ శృఙ్గవేరం చ తైః పృథక్

17. ఏకైకార్ధాంశసంయుక్తం పిబేద్గోమూత్రసంయుతమ్

తాత్పర్యము : పిప్పళ్ళు, సొంఠి, మిరియాలు, ఏనుగ పిప్పళ్ళు, సరళ దేవదారు, కిరిషము, ఇంగువ, భారంగి, పెదవెక్కుడు తీగ, తుంగముస్తలు, తెల్లని వస, కరక్కాయలు, చిత్రమూలము, పసుపు, వస, కంకుష్ఠము, ఓమము, శుంఠి, అను నీ పదునెనిమిది ద్రవ్యములలో ఒక్కొక్కదానిని అర్ధభాగముగను, తెగడ చూర్ణమునొక భాగమును కలిపి చూర్ణముచేసి గోమూత్రమున కలిపి త్రాగవలెను. పిప్పలి మున్నగు పదునెనిమిది ద్రవ్యములతో వేరువేరుగ కల్పించుటచే ఈ యోగ ములు పదునెనిమిది యగును.

ఆయుర్వేదదీపిక : 'పిప్పలీ' అనుదానితో పిప్పలి మొదలైన ద్రవ్య భేదముతో మూత్రమున 18 యోగములు చెప్పెను.

## యష్టిమధుతో ఒక యోగము

మధుకార్ధాంశ సంయుక్తం శర్కరామ్బుయుతం పిబేత్

తాత్పర్యము : అర్ధభాగము అతిమధురము, ఒక భాగము తెగడ చూర్ణము, చక్కెర పానకములో కలిపి త్రాగవలెను. ఈ యోగమును క్రింద "యష్ట్యాహ్వావిధినా పిబేత్" అని చెప్పబడు యోగమును చేర్చి సంగ్రహమున "యష్ట్యాం ద్వౌ" అని నిర్దేశింపబడును.

ఆయుర్వేదదీపిక : మధూక అనుదానితో ఒక ప్రయోగము. ఇది సంగ్ర హమున చెప్పబడిన "యష్ట్యాం ద్వౌ" అని రెండింటిలో ఒకటి.

## జీవకాదులలో పదునాల్గుయోగములు

18. జీవకర్షభకౌ మేదాం శ్రావణీం కర్కటాహ్వయం
ముద్గమాషాఖ్యపర్ణ్యౌ చ మహతీం శ్రావణీం తథా
19. కాకోలీం క్షీరకాకోలీమిన్ద్రాహ్వం ఛిన్నరుహాం తథా
క్షీరశుక్లాం పయస్యాం చ యష్ట్యాహ్వాం విధినా పిబేత్
20. వాతపిత్తహితాన్యేతాన్యన్యాని తు కఫానితే

తాత్పర్యము : జీవకము, ఋషభకము, మేద, పిన్న బోదతరము, కర్కాటకశృంగి, అడవి పెసర, అడవి మినుము, పెద్దబోదతరము, కాకోలి, క్షీర

కాకోలి, పిన్నపాపర, తిప్పతీగ, నేలగుమ్మడు, మనుబాల, అతిమధురము అను నీ పదునైదు ద్రవ్యములలో నొక్కొక్క దానిని అర్ధభాగమును, తెగడ చూర్ణము నొక భాగమును ప్రత్యేకముగా కలుపుచు పదునైదు యోగములుగ కల్పించి పై చెప్పిన విధ్యుక్త ప్రకారము త్రాగవలెను. ఈ యోగములు వాత-పిత్త-రోగములందు విరేచనమునకై హితకరములుగా నుండును. తక్కిన యోగములు కఫవాత సంసర్గమున ఉపయోగింపదగును.

**ఆయుర్వేదదీపిక :** 'జీవక' అనుదానితో '14' యోగములను ఆక్లేయష్ట్యా అను పేరుగల ఒకదానిని చెప్పెను. ఇది సంగ్రహమున చెప్పబడిన 'యష్ట్యాద్యోం' అను రెండింటిలో ఒకటి. క్షీరాక్లా అంటే క్షీరవిదారి, ఇంద్రా అంటే నీరుగొబ్బి (కోకిలాక్ష). పయస్యా అంటే అర్కపుష్పి.

## క్షీరాదులలో ఏడుయోగములు

క్షీరమాంసేక్షుకాశ్మర్యద్రాక్షాపీలురసైః పృథక్

21. సర్పిషా వా తయోశ్చూర్ణమభయార్ధాంశికం పిబేత్

**తాత్పర్యము :** అపుపాలు, మాంసరసము, చెరకురసము, నేలగుమ్మడి గడ్డ రసము, ద్రాక్షపండ్ల రసము, కొండగోగుకాయల రసము, నెయ్యి అనునీ ద్రవములతో రెండు విధములైన తెగడ వ్రేళ్ళలో నేదైన నొకదాని చూర్ణమొక భాగమును, కరక్కాయల చూర్ణమర్ధ భాగము కలిపి త్రాగవలెను. ఇచ్చట క్షీరాదీ ద్రవము లేడిటితో 7 యోగములుగ కల్పింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'క్షీర' అను దానితో క్షీరాదిలో ఏడు యోగములను చెప్పెను. పీలు అనగా ఉత్తరాపథమునకు సంబంధించిన ఫలము.

## ఎనిమిది లేహయోగములు

లిహ్యాద్వా మధుసర్పిర్భ్యాం సంయుక్తం ససితోపలమ్

22. అజగన్ధా తుగాక్షీరే విదారే శర్కరా త్రివృత్
చూర్ణితం క్షౌద్రసర్పిర్భ్యాం లీఢ్వా సాధు విరిచ్యతే

23. సన్నిపాతజ్వరస్తమ్భదాహతృష్ణార్దితో నరః
శ్యామాత్రివృత్కషాయేణ కల్కేన చ సశర్కరమ్

24. సాధయేద్విధివల్లేహం లిహ్యాత్ పాణితలం తతః

సక్షౌద్రాం శర్కరాం పక్త్వా కుర్యాన్మృద్వాజనే నవే

25 క్షిపేచ్ఛీతే త్రివృచ్చూర్ణం త్వక్పత్రమరిచైః సహ
మాత్రయా లేహయేదేతదీశ్వరాణాం విరేచనమ్

26. కుడవాంశాన్ రసాన్నిక్షుద్రాక్షాపీలుపరూషకాత్
సితోపలాపలం క్షౌద్రాత్ కుడవార్ధం చ సాధయేత్

27. తం లేహం యోజయేచ్ఛీతం త్రివృచ్చూర్ణేన శాస్త్రవిత్
ఏతదుత్పన్నపిత్తానామీశ్వరాణాం విరేచనమ్

28. శర్కరామోదకాన్ వర్తిర్గులికామాంసపూపకాన్
అనేన విధినా కుర్యాత్ పైత్తికానాం విరేచనమ్

29. పిప్పలీం నాగరం క్షారం శ్యామాం త్రివృతయా సహ
లేహయేన్మధునా సార్ధం శ్లేష్మలానాం విరేచనమ్

30. మాతులుఙ్గాభయాధాత్రీశ్రీపర్ణీకోలదాడిమాత్
సుభృష్టాన్ స్వరసాంస్తైలే సాధయేత్తత్ర చావపేత్

31. సహకారాత్ కపిత్థాచ్చ మధ్యమష్లం చ యత్ ఫలమ్
పూర్వవద్బహలీభూతే త్రివృచ్చూర్ణం సమావపేత్

32. త్వక్పత్రకేశరైలానాం చూర్ణే మధు చ మాత్రయా
లేహోఽయం కఫపూర్ణానామీశ్వరాణాం విరేచనమ్

**తాత్పర్యము :** తెగడ చూర్ణమును, చీనాకలకండపొడిని, తేనెను, నేతిని వీనినన్నింటిని ఒకటిగ కలిపి లేహము చేయవలెను. ఓమము, వెదురుప్పు, నేల గుమ్మడిగడ్డ, తెగడ వీనినన్నిటిని చూర్ణముచేసి అందు తేనెను కలిపి నాకినను చక్కగ విరేచనమగును. ఈ యోగములచేత సన్నిపాత జ్వరములను, మల మూత్రాది స్తంభనమును, దప్పిని శమింపజేయును. రెండు విధములైన తెగడ వ్రేళ్ళ యొక్క కషాయమును, వాని కల్క చూర్ణమును, చక్కెరను కలిపి లేహపాక విధి ప్రకారము పక్వము చేసి, అందు కర్ష ప్రమాణము సేవించిన సుఖముగ విరేచనములగును. ఇచ్చట చక్కెరను, తెగడ చూర్ణమును సమభాగములుగను, క్వాథమును నాల్గవవంతు చేర్చి లేహపాకము చేయదగును. తేనెను, చక్కెరను కలిపి పాకము చేసి ఒక కొత్త మట్టి పాత్రలో నుంచి యందు తెగడ చూర్ణమును, లవం

గపు పట్ట, లవంగపుపత్రి, మిరియాలు ఈ మూడిటి చూర్ణమును కూడ కలిపి యుక్తమైన పరిమాణముతో సేవించిన చక్కగ విరేచనములగును. ఇది రాజ యోగ్యములైన విరేచనయోగము. ఇచ్చట శర్కరా పాకమునకు నాల్గవవంతు త్రివృచ్చూర్ణమును కలిపి, అందు సుగంధము కల్గుటకై లవంగపుపట్ట మున్నగువానిని యదోచితముగ చేర్చనగును. ఈ యోగము కేవలము సుకుమార శరీరులు స్నిగ్ధ శరీరులును నగువారికి ఉపయోగింపదగియుండునని 'ఈశ్వరాణాం విరేచనమ్' అని చెప్పబడినది.

చెరకురసము, ద్రాక్షపండ్ల రసము, వరగోగురసము, చిట్టీతరసము. ఈ రసములు ప్రత్యేక మొక్కొక్క కుడవము, చీనాకల్కండ పలము, తేనె అర్ధ కుడవము వీనినన్నిటినొకటిగ గూర్చి లేహపక్వము చేసి అది చల్లబడిన పిదప తెగడ చూర్ణమును లేహమునకు నాల్గవపాలు ప్రక్షేపన్యాయానుసారము కలిపియుంచ వలెను. ఈ లేహమును మిక్కిలి వృద్ధి నొందిన పిత్తమున, సుకుమారులకు విరేచ నమునకై యుపయోగింపదగును.

శర్కరయందు పై జెప్పబడిన చెరకు రసము మున్నగు నాల్గు రసములను ప్రత్యేక మొక్కొక్క కుడవము వంతునను, అర్ధ కుడవము తేనెను కలిపి పై జెప్పిన రీతిగ పక్వము చేసి, అందు త్రివృచ్చూర్ణమును కలిపి ఆ లేహపాకము చేతనే మోదకములను, వర్తులను, గులికలను, మాంసముతో కూడిన అపూపములను కూడ సిద్ధము చేయనగును. ఈ యోగముల 'చత్వారస్సితయాపి' అని సంగ్రహమున నిర్దే శింపబడును.

పిప్పళ్ళు, శుంఠి, యవక్షారము, నల్లతెగడవేళ్ళు, ఎఱ్ఱతెగడవేళ్ళ - వేనినన్ని టిని చూర్ణము చేసి తేనెలో కలిపి సేవించవలెను. ఇది కఫము ప్రకోపించినవారికి విరేచనమునకై ఉపయోగింపనగును.

మాదీఫలముల రసము, కరక్కాయల స్వరసము, ఉసిరిక కాయల స్వర సము, పెద్ద గుమ్మడికాయ స్వరసము, రేగుపండ్ల స్వరసము, పుల్లదానిమ్మ రసము- ఈ స్వరసములను తైలము చేర్చి చక్కగా కాచి లేహపాకముగా జేసి యందు తీయ మామిడిపండు గిజరులు, వెలగపండులోని గుజ్జును, మాదీఫలము మున్నగువాని రసమును ప్రత్యేకము కుడవము వంతునచేర్చి ముద్దయగునట్లు పక్వము చేసి, అందు తెగడ చూర్ణమును, లవంగపు పట్ట, లవంగపు పత్రి, నాగకేసరములు, ఏలకులు వేసి చూర్ణమును కూడ కలిపి, తేనెను మితముగ కలిపి లేహము చేయవలెను. ఇది

కఫము ప్రేరేపించి యుండు సుకుమారులకు విరేచనమునకై ఉపయోగింపవచ్చును. 'త్రివృచ్ఛ్యామతా స్త్రిస' అని చెప్పబడు లేహయోగము చేరి ఎనిమిదియగును.

**ఆయుర్వేదదీపిక :** 'లిహ్యాద్వా మధు' అనుదానితో ఎనిమిది లేహములు చెప్పబడినవి. లిహ్యాద్వా అను దానితో మొదటిది లేహము. అజగంధా అనుదానితో రెండవది. అజగంధా అనగా అజామోదము. శ్యామాత్రివృత్ అనుదానితో మూడవ లేహము ఇందు చక్కెర, త్రివృత్ చూర్ణములతో సమానమైన నాలుగవ భాగముగా మిగులునట్లు సాధించబడిన కషాయము ద్వారా చేయబడిన లేహము. నక్షౌద్ర అను దానితో నాల్గవది. ఇక్కడ క్షౌద్రపాకము యోగమహిమచే త్వక్, పత్రములను త్రివృత్ చూర్ణముతో కలుపుట పరిమళ మాత్ర ప్రయోజనము కొరకు (అని భావము). 'ఈశ్వరాణాం విరేచనమ్' అను మాటచే సుకుమారత్వము వలన దానికి స్నేహకర్మ చేయకుండుటకు చూపించుచున్నారు. ప్రభువులు సామాన్యముగా సుకుమారులు, స్నిగ్ధ శరీరము గలవారుగా అగుచున్నారు. 'కుడవాంశాని' అనునది అయిదవది. ఇచ్చట త్రివృత్ చూర్ణము కొలమానము లేనిది. అది ప్రక్షేప న్యాయమున లేహము నుంచి ఒక చతుర్థ భాగము చేయదగినది ఉత్పన్నపిత్తానాం అనగా ఉద్భవించిన పిత్తము గల వారలకు (అని భావము). 'శర్కరా' అనుదానితో నాలుగు శర్కరా యోగములను అతి దేశమునకు అనుగుణముగా లేహముల మధ్యలోనే చెప్పెను. ఇచ్చట వర్త్యాదులు కూడా చక్కెర చేతనే చేయబడినవిగా తెలిసికొనదగినవి. 'అనేన విధినా' అనగా ఇక్ష్వాది రస సంస్కారముతోను త్రివృత్ చూర్ణ యోగములతోను. 'పిప్పలీ నాగరం' అనుదానితో ఆరవలేహము. 'మధ్య'మనగా పులుపు వెలగ యొక్క మధ్యభాగము. 'అమ్లం' ఏదీ ఫలమో అనగా మాతులుంగం మొదలైనవి. 'పూర్వవత్' అని మాతులుంగము మొదలగు రసములకు కొడవికత్వము (కుడవ ప్రమాణములో గ్రహించవలసినది) చూపించుచున్నారు.

## ఐదు పానకాదియోగములు

33. పానకాని రసాన్ యూషాన్మోదకాన్ రాగషాడవాన్
అనేన విధినా కుర్యాద్విరేకార్థం కఫాధికే

**తాత్పర్యము :** పై చెప్పిన లేహవిధి ననుసరించి తెగడ చూర్ణముతో పానకములను, మాంస రసములను, యూషములను, మోదకములను, రాగములతో

కూడిన షాడవములను సిద్ధముచేసి కఫమధికముగ నున్నపుడు విరేచనమునకై ఉప యోగింపదగును.

**ఆయుర్వేద దీపిక :** 'పానకాని' అనుదానితో అతిదేశాను గుణము వలన పానకము మొదలైన ఐదు యోగములు చెప్పెను. రాగ ప్రధానమైన షాడ వము, రాగషాడవము. 'అనేన విధినా' అనగా పూర్వము లేహములు చెప్పబడిన విధముగా.

## ప్రథమ తర్పణయోగము

34. త్వగేలాభ్యాం సమా నీలీ తైస్త్రివృత్తైశ్చ శర్కరా
చూర్ణం ఫలరసక్షౌద్రశక్తుభిస్తర్పణం పిబేత్

35. వాతపిత్తకఫోత్థేషు రోగేష్వల్పానలేషు చ
నరేషు సుకుమారేషు నిరపాయం విరేచనమ్

**తాత్పర్యము :** దాల్చినచెక్క, ఏలకులు- ఈ రెండు సమభాగములు, ఈ రెంటికిని సమభాగము నీలి, ఈ మూటికిని సమభాగము తెగడవేళ్ళు, ఈ నాల్గిటికిని సమభాగము చక్కెర, ఈ భాగముల ప్రకారము వేసినవన్నిటిని కూర్చి చూర్ణము చేసి దానిమ్మపండ్ల రసములో కలిపి అందు తేనెను సత్తుపిండిని కలిపినది సంతర్పణ మగును. దీనిని వాతపిత్త కఫరోగముల యందును, జఠరాగ్ని మందగించిన వారికిని, సుకుమారులకును, విరేచనమునకై యుపయోగించినచో నిరపాయముగ విరేచనము లగును.

**ఆయుర్వేదదీపిక :** 'త్వగేలాభ్యాం' అనుదానితో తర్పణ యోగము మొదటే చెప్పెను. రెండవది మాత్రము తర్పణ యోగము కాగలదని (అని భావము) త్వంగం అంటే గుడత్వక్ (దాల్చినచెక్క). త్వంగ, ఏలా, నేలి, త్రివృత్‌కు సమాన ముగా చక్కెర అని. ఫలరసముగా దానిమ్మరసము.

## ఐదు మోదక యోగములు

36. శర్కరాత్రిఫలాశ్యామాత్రివృత్పిప్పలిమాక్షికైః।
మోదకః సన్నిపాతోర్ధ్వరక్తపిత్తజ్వరాపహాః॥

**తాత్పర్యము :** చక్కెర, త్రిఫలములు, నల్లతెగడ, ఎఱ్ఱతెగడ వేళ్ళు, పిప్పళ్లు, తేనెవేసి నన్నిటిని కూర్చి మోదకముల జేసి విరేచనమునకై ఉపయోగించిన సన్నిపాతమును, ఊర్ధ్వగత రక్తపిత్తమును, జ్వరమును శమించును.

**ఆయుర్వేదదీపిక :** 'శర్కరా' అనుదానిలో మోదకము మొదటిది. మోదకే ద్విగుణోగుడః అనుమాట వలన చక్కెరను చూర్ణముకంటె రెండురెట్లు కోరుచున్నారు.

37. త్రివృచ్ఛాణా మతా స్త్రిస్త్రిస్రశ్చ త్రిఫలాత్వచః
విడఙ్గపిప్పలీక్షారశాణా స్త్రిస్రశ్చ చూర్ణితాః

38. లిహ్యాత్ సర్పిమధుభ్యాం చ మోదకం వా గుడేన తు
భక్షయేన్నిష్పరీహారమేతచ్ఛోదనముత్తమమ్

39. గుల్మం ప్లీహోదరం శ్వాసం హలీమకమరోచకమ్
కఫవాతకృతాంశ్చాన్యాన్ వ్యాధీనేతద్వ్యపోహతి

**తాత్పర్యము :** తెగడ వేళ్ళు పట్ట మూడు శాణములు, త్రిఫలముల బెరడు మూడు శాణములు, వాయు విడంగములు, పిప్పళ్ళు, యవక్షారము చేరి మూడు శాణములు- ఈ విధమున వేనినన్నిటిని కూర్చి చూర్ణము చేసి తేనెను నేతిని కలిపి సేవించవలెను. లేక పైజెప్పిన చూర్ణమును బెల్లము పాకమున కలిపి మోదకములుగ చేసి సేవించదగును. ఇది నిరపాయమైన విరేచన యోగము. దీనివలన గుల్మము, ప్లీహము, ఉదరము, శ్వాసకాసములు, హలీమకము, అరోచకము, కఫవాతములచే జనించిన ఇతర రోగములు నివర్తించును.

**ఆయుర్వేదదీపిక :** 'త్రివృచ్ఛాణా' అనువానిచే ఇచ్చట మోదకమునందు యోగము పఠింపబడినప్పటికిని దీనికి లేహములోనే తీసికొనుట వలన ఇది ఎనిమిదవ లేహమగుచున్నది.

40. విడఙ్గపిప్పలీమూలత్రిఫలాధాన్యచిత్రకాన్
మరిచేన్ద్రయవాజాజీపిప్పలీహస్తిపిప్పలీః

41. లవణాన్యజమోదం చ చూర్ణితం కార్షికం పృథక్
తిలతైలత్రివృచ్చూర్ణభాగౌ చాష్టపలోన్మితౌ

42. ధాత్రీఫలరసప్రస్థాంస్త్రీన్ గుడార్ధతులాం తథా
పక్త్వా మృద్వగ్నినా ఖాదేద్బదరోదుమ్బరోపమాన్

43. గుడాన్ కృత్వా న చాత్ర స్యాద్విహారాహారయన్త్రణా
మన్దాగ్నిత్వం జ్వరం మూర్ఛాం మూత్రకృచ్ఛ్రమరోచకమ్

44. అస్వప్నం గాత్రశూలం చ కాసం శ్వాసం భ్రమం క్షయమ్
కుష్ఠార్శఃకామలామేహగుల్మోదరభగన్దరాన్

45. గ్రహణీపాణ్డురోగాంశ్చ హన్యుః పుంసవనాశ్చ తే
కల్యాణకా ఇతి ఖ్యాతాః సర్వేష్వృతుషు యౌగికాః (ఇతి కళ్యాణగుడః)

**తాత్పర్యము :** వాయు విడంగములు, మోడి, త్రిఫలములు, ధనియాలు, చిత్రమూలము, మిరియాలు, కొడిసె పాల విత్తులు, జీలకర్ర,పిప్పళ్లు, ఏనుగుపిప్పళ్లు, పంచలవణములు, ఓమము వీనిని వేరువేరుగ ఒక్కొక్క కర్షము వంతున గ్రహించి చూర్ణముచేసి యుంచుకొనవలెను. నువ్వులనూనె ఎనిమిది పలములు, తెగడ చూర్ణము ఎనిమిది పలములు, ఉసిరిక పండ్లరసము మూడు ప్రస్థములు, ఏబది పలములు బెల్లము, పై జెప్పిన ద్రవముగా బెల్లము పాకముపట్టి, అందు పై జెప్పిన విడంగాది చూర్ణమును, తెగడ చూర్ణమును కూడ కలిపి మృద్వగ్నిచే వండి పక్వమైన పిదప, రేగుపండంతీసిమైనను, అత్తిపండంతీసిమైనను గుళికలుచేసి సేవించవలెను. దీనిని సేవించునపుడు ఆహార విహారముల విషయమై నియమము లేదు. దీనివలన అగ్నిమాంద్యము, జ్వరము, మూర్ఛ, మూత్రకృచ్ఛ్రము, అరోచకము, నిదురపట్టకుండుట, ఒడలి నెప్పులు, శ్వాసకాసములు, ఒడలు తిరుగుట, ధాతు క్షయము, కుష్ఠము, అర్శోరోగము, కామల, ప్రమేహము, గుల్మము, ఉదరము, భగందరము, గ్రహణి రోగము, పాండు రోగము నివర్తించును మరియు నీగుళికలు పురుష సంతానమును కలిగించును. ఇవి కల్యాణ గుడమని చెప్పబడును. మరియు నివి వసంతాది ఋతువులన్నిటియందు నుపయోగింపదగియుండును.

**ఆయుర్వేదదీపిక :** 'విడఙ్గ' అనుదానితో రెండవ మోదకము.

46. వ్యోషత్వక్పత్రముస్తైలావిడశామలకాభయాః
సమభాగాః భిషగ్దద్యాత్ద్విగుణం చ షుషాలకమ్

47. త్రివృతోఽష్టగుణం భాగం శర్కరాయాశ్చ షడ్గుణం

చూర్ణితం గుడికాః కృత్వా క్షౌద్రేణ పలసమ్మితాః
48. భక్షయేత్ కల్యముత్థాయ శీతం చాను పిబేజ్జలమ్
మూత్రకృచ్ఛ్రే జ్వరే వమ్యాం కాసే శ్వాసే భ్రమే క్షయే
49. తాపే పాణ్డ్వామయేఽల్పేగ్నౌ శస్తా నిర్యన్త్రిశాళినః
యోగః సర్వవిషాణాం చ మతః శ్రేష్ఠో విరేచనే
50. మూత్రజానాం చ రోగాణాం విధిజ్ఞేనాఽవచారితః

**తాత్పర్యము :** త్రికటుకములు, లవంగపుపట్ట, లవంగపుపత్రి, తుంగ గడ్డలు, ఏలకులు, వాయువిడంగము, ఉసిరిక కాయల బెరడు, కరక్కాయల బెరడు ఇవన్నియు సమభాగములు, నేపాళపువేళ్ళు రెండు భాగములు, తెగడవేళ్ళ పట్ట ఎనిమిది భాగములు, చక్కెర ఎనిమిది భాగములు వీనన్నిటిని పై చెప్పిన భాగముల ప్రకారము చేర్చి ఔషధములనన్నిటిని మెత్తని చూర్ణము చేసి చక్కెర పాకములో కలిపి పక్వముచేసి, అందు మోదకములుగ చేయుటకు వలసినంత తేనెను కలిపి ఒక్కొక్క పలపరిమితముగ మోదకములను కల్పించవలెను. ఈ మోదకములను పూటకొకటి వంతున ప్రాతఃకాలముననే లేచి సేవించి వెంటనే చల్లని నీళ్ళను త్రాగవలెను. ఈ మోదకములను మూత్రకృచ్ఛ్రము, జ్వరము, వాంతి, శ్వాసకాసములు, భ్రమము, ధాతుక్షయము, తాపము, పాండురోగము, అగ్నిమాంద్యము అనునీ వ్యాధులయందెల్ల విరేచనమునకై సేవింపదగును. ఇది సర్వవిషములయందును శ్రేష్ఠమైన విరేచనౌషధము మూత్రవ్యాధులన్నిటియందు పయోగింపదగును. దీనిని సేవించునపుడు ఆహార విహారముల నియమము లేదు. దీనిని ప్రయోగ సమర్థుడైన వైద్యుడు దేశకాలాదులకనుగుణముగ నుపయోగించినచో పై చెప్పిన వ్యాధులన్నియు శమించును.

**ఆయుర్వేదదీపిక :** వ్యోష అనుదానిలో మూడవ మోదకము. ఈ మోదకము మరియొక తంత్రమున 'అభయాద్యా' అని ప్రసిద్ధి నొందినది. ముకూలక మనగా దన్తీ. ముకూలకము మొదలైన ఒక్కొక్క ద్రవ్యమునకు రెట్టింపు ప్రమాణము అగుచున్నది. మోదకమెంత యుండునో తేనె అంత యుండవలెను. కొంతమంది ఇచ్చట వ్యోషము మొదలైనవాటితో కూడిన చూర్ణము కంటె దన్త్యాదులకు రెట్టింపు చెప్పుచున్నారు.

పథ్యాధాత్ర్యురుబూకాణాం ప్రసృతౌ ద్వౌ త్రివృత్పలమ్
51. దశ తాన్మోదకాన్ కుర్యాదీశ్వరాణాం విరేచనమ్

**తాత్పర్యము :** కరక్కాయల బెరడు, ఉసిరి కాయల బెరడు, **ఆముదపు** వేళ్ళు-ఈ మూడును చేరి రెండు ప్రసృతములు, తెగడ ఒక పలము, వీనిని **చూర్ణము** చేసి నిద్యుక్త ప్రకారము పది మోదకములు చేసి ఉపయోగించవలెను. ఇది మిక్కిలి సుకుమారులగు ప్రభువులకుపయోగించదగును.

**ఆయుర్వేదదీపిక :** 'పథ్య' అనుదానితో నాల్గవది.

త్రివృద్ధైమవతీ శ్యామా నీలినీ హస్తిపిప్పలీ
52. సమూలా పిప్పలీ ముస్తమజమోదా దురాలభా
కార్షికం నాగరపలం గుడస్య పలవింశతిమ్
53 చూర్ణితం మోదకాన్ కుర్యాదుదుమ్బరఫలోపమాన్
హిఙ్గుసౌవర్చలవ్యోషయవానీబిడజీరకైః
54. వచాజగన్ధాత్రిఫలాచవ్యచిత్రకధాన్యకైః
మోదకాన్ వేష్టయేచ్చూర్ణైస్తాన్ సతుమ్బురుదాడిమైః
55. త్రికవఙ్క్షణహృద్వస్తికోష్ఠార్శఃప్లీహశూలినమ్
హిక్కాకాసారుచిశ్వాసకఫోదావర్తినాం శుభాః

**తాత్పర్యము :** ఎఱ్ఱతెగడపట్ట, కరక్కాయలబెరడు, నల్లతెగడ, నీలి వేళ్ళు, పెద్దపిప్పళ్ళు, మోడి, పిప్పళ్ళు, తుంగగడ్డలు, ఓమము, దురదగొండి ఇవి ప్రత్యేక-మొక్కొక్క కర్షము, శుంఠి ఒక పలము, 20 పలముల బెల్లము వీని నన్నిటిని చూర్ణము చేసి అత్తిపండంతేసి మోదకములను చేయనగును. మరియు ఇంగువ, సౌవర్చల లవణము, త్రికటుకము, ఓమము, బిడాలవణము, జీలకర, వస, వాయింట, త్రిఫలములు, చవ్యము, చిత్రమూలము, ధనియాలు, తుంబురులు, దానిమ్మకాయల బెరడు-వీనిని సమభాగములుగ కూర్చి చూర్ణము చేసి ఆ చూర్ణమున పైన చెప్పబడిన మోదకము లను ఈ మోదకములపై పూర్తిగ చూర్ణము కవచము వలె అంటుకొనియుండునట్లు చల్లి సేవించవలెను.

ఈ మోదకములు వెన్నెముకకు క్రింది సంధియందును, గజ్జల యందును, హృదయమునందును, వస్తియందు, కోష్ఠమునందు నొప్పికలవారికి, అర్శోరోగము, ప్లీహరోగము, హిక్కాకాసములు, అరుచి, శ్వాస, కఫరోగములు, ఉదావర్తము కలవారికిని విరేచనమునకై చాల హితకరములుగ నుండును.

ఆయుర్వేదదీపిక : 'త్రివృద్హైమవతీ' అనుదానిలో అయిదవ మోదకము పూరింపబడుచున్నది. 'వేష్టయేత్' అనగా చూర్ణము చేయుట.

## ఆరుఋతువులందుపయోగించు ఆరుయోగములు - రెండు చూర్ణయోగములు

56. త్రివృతాం కౌటజం బీజం పిప్పలీం విశ్వభేషజమ్
క్షౌద్రద్రాక్షారసోపేతం వర్షాస్వేతద్విరేచనమ్

57. త్రివృద్దురాలభాముస్తశర్కరోదీచ్యచన్దనమ్
ద్రాక్షామ్బునా సయష్ట్యాహ్వసాతలం జలదాత్యయే

58. త్రివృతాం చిత్రకం పాఠాం మాజాజీం సరలం వచామ్
స్వర్ణక్షీరీం చ హేమన్తే పిష్ట్వా తూష్ణామ్బునా పిబేత్

59. శర్కరా త్రివృతా తుల్యా గ్రీష్మకాలే విరేచనమ్
త్రివృత్రాయన్తిహపుషాః సాతలాం కటురోహిణీమ్

60. స్వర్ణక్షీరీం చ సంచూర్ణ్య గోమూత్రే భావయేత్రహమ్
ఏష సర్వర్తుకో యోగః స్నిగ్ధానాం మలదోషహృత్

61. త్రివృచ్ఛ్యామా దురాలభా వత్సకం హస్తిపిప్పలీ
నీలినీ త్రిఫలా ముస్తం కటుకా చ సుచూర్ణితమ్

62. సర్పిర్మాంసరసోష్ణామ్బుయుక్తం పాణితలం తతః
పిబేత్ సుఖతమం హ్యేతద్రూక్షాణామపి శస్యతే

63 త్ర్యూషణం త్రిఫలా హిఙ్గు కార్షికం త్రివృతాపలమ్
సౌవర్చలార్ధకర్షం చ పలార్ధం వాస్తువేతసాత్

64 తచ్చూర్ణం శర్కరాతుల్యం మద్యేనామ్లేన వా పిబేత్
గుల్మపార్శ్వార్తినుత్సిద్ధం జీర్ణే చాద్యాంద్రసౌదనమ్

**తాత్పర్యము :** తెగడ, కొడిసెపాలవిత్తులు, పిప్పళ్ళు, శుంఠ వీనిని సమ **భాగములుగ** చూర్ణము చేసి తేనెను. ద్రాక్షాపండ్ల రసమును కలిపి వర్షఋతువునందు విశేషమునకై సేవింపదగును.

తెగడి, దూలగొండివేళ్లు, తుంగగడ్డలు, చక్కెర, వట్టివేరు, చందనము, అతిమధురము, సంబరేణు వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి ద్రాక్షపండ్లరసమున కలిపి శరదృతువునందు విరేచనమునకై సేవింపదగును.

తెగడ, చిత్రమూలము, చిరుబొద్ది, జీలకర, సరలదేవదారు పట్ట, వస, స్వర్ణక్షీరి వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి వేడినీళ్ళతో కలిపి నూరి హేమంత ఋతువున విరోచనమునకై త్రాగునది.

తెగడ చూర్ణమును శర్కరతో సమభాగములుగ కలిపి గ్రీష్మఋతువునందు విరేచనమునకై ఉపయోగింపదగును. తెగడ, కలుకానుగ, బోడకరము, సంబరేణు, కటుకరోహిణి, స్వర్ణక్షీరి, వీనినన్నిటిని సమభాగములుగ గూర్చి చూర్ణముచేసి గోమూత్రమునందు మూడు దినములు భావనచేసి యుంచుకొనునది ఈ చూర్ణమును శిశిరఋతువునందేకాక తక్కినఋతువు లన్నిటియందును సామాన్యముగ విరేచనము నకై ఉపయోగింపదగును. మరియు స్నిగ్ధ శరీరులుగ నుండువారికి మలములను త్రిదోషములను హరించుటకు ఇది ప్రశస్తముగ నుండును. ఎఱ్ఱతెగడ, నల్లతెగడ, దూలగొండి, కొడిసెపాలవిత్తులు, ఏనుగు పిప్పళ్ళు, నీలివేరు, త్రిఫలములు, తుంగ గడ్డలు, కటుకరోహిణి వీనినన్నిటిని మెత్తగ చూర్ణము చేసి నెయ్యి, మాంసరసము, వేడినీళ్ళు అను ద్రవములతో కర్షమాత్రము కలిపి త్రాగవలెను. ఇది వసంతమునను సర్వఋతువు సామాన్యముగను ఉపయోగింపదగిన సుఖమైన విరేచన యోగము. మరియు రూక్ష శరీరులకును ఇది ప్రశస్తముగ నుండును.

త్రికటుకములు, త్రిఫలములు, ఇంగువ, ఇవి ప్రత్యేక మొక్క కర్షము. తెగడ యొక పలము. సౌవర్చలవణము అర్ధకర్షము, అమ్లవేతసము అర్ధపలము, ఈ భాగము ప్రకారము అన్నిటిని చేర్చి చూర్ణము చేసి చూర్ణమునకు సమభాగము చక్కెరను కలిపి మద్యముతోనైనను, అమ్ల కాంజికముతోనైనను చేర్చి త్రాగునది. ఈ యోగము గుల్మములయందును, ప్రక్కనొప్పులయందు నుపయోగించినచో నవి శమించును. ఔషధము జీర్ణమైన పిదప మాంసరసముతో అన్నమును భుజింప నగును.

ఆయుర్వేదదీపిక : 'త్రివృతాం కౌటజం' అనుదానిలో ఆరు ఋతువులలో చెప్పబడిన యోగములను రూక్షములకు చెప్పబడుచున్నది అనువరకు తీసుకొనవలెను. సాతలా అనగా 'చర్మకశ' 'జలదాత్యయే' అనగా శరత్కాలమునందు బలవత్తరమైన చలిగాలిగల హేమంత ఋతువులో విరేచనము నిషేధింపబడినను దానిని వ్యాధి అవస్థానుసారము చేయబడిన విరేచనముగా తెలుసుకొనదగినది. అన్ని ఋతువులకు సంబంధించిన యోగము చెప్పబడనప్పటికీ వసంతాది ఋతువులందు చెప్పబడిన యోగమును తెలుసుకొనదగినవి. 'త్రివృత శ్యామా' అనునది కూడా సర్వఋతువులందు ఉపయోగించు యోగము. 'త్ర్యూషణం' అను చూర్ణయోగము రెండవది.

## రెండు తర్పణ యోగములు

65. త్రివృతాం త్రిఫలాం దన్తీం సప్తలాం వ్యోషసైన్ధవమ్
కృత్వా చూర్ణం తు సప్తాహం భావ్యమామలకీరసే
66. తదోయ్జ్యం తర్పణే యూషే పిశితే రాగయుక్తిషు

తాత్పర్యము : తెగడ, త్రిఫలములు, దంతి, సంబరేణు, త్రికటుకములు, సైంధవ లవణము వీనినన్నిటిని చూర్ణము చేసి ఉసిరికకాయల రసమునందు ఏడు దినములు భావనచేసి యూషము నందైనను, మాంసము నందైనను, రాగషాడబాది పానకములందైనను కలిపి త్రాగునది. ఇది సంతర్పణమునకై ఉపయోగింపదగియుండును.

ఆయుర్వేదదీపిక : త్రివృతాం త్రిఫలాం అను మొదలైనది తర్పణ యోగము. ఇట్లు అన్ని ఋతువుల యోగములతో కూడా రెండు తర్పణ యోగములగుచున్నది.

## ఘృతయోగము - క్షీరయోగము

తుల్యామ్లం త్రివృతా కల్క సిద్ధం గుల్మహరం ఘృతమ్
67 శ్యామా త్రివృతయోర్మూలం [illegible] పయః

జలే తేన కషాయేణ పక్త్వా సర్పిః పిబేన్నరః
68. శ్యామాత్రివృత్కషాయేణ సిద్ధం సర్పిః పిబేత్తథా
సాధితం వా పయస్తాభ్యాం సుఖం తేన విరిచ్యతే

**తాత్పర్యము :** తెగడ కల్కమును ఘృతమునకు నాల్గవవంతును ఘృతమునకు సమభాగము మాతులుంగాది ఫలముల పుల్ల నిరసమును కలిపి ఘృత పాక విధి ననుసరించి పక్వముచేసి త్రాగిన గుల్మముల హరించును. ఎఱ్ఱని తెగడను, నల్లతెగడను, ఉసిరికాయల పెరడును జలమున జేర్చి విద్యుక్త ప్రకారము కషాయ మును పక్వము చేసి, ఆ కషాయమును ఘృతమును కలిపి ఘృతపాకవిధి ప్రకారము పక్వముచేసి విరేచనమునకై త్రాగవలెను. రెండు విధములైన తెగడువేళ్ళను రెంటిని మాత్రము సమభాగములుగ జలమున జేర్చి క్వాథము చేసి ఆ కషాయమున ఘృతమును చేర్చి విద్యుక్త ప్రకారము ఘృతమును పక్వముచేసి విరేచనమునకై త్రాగవలెను. ఎఱ్ఱతెగడ వేళ్ళను, నల్లతెగడ వేళ్ళను ఆవుపాలలో చేర్చి క్షీరపాక విధి ప్రకారము క్షీరమును పక్వము చేసియైనను త్రాగునది.

**ఆయుర్వేదదీపిక :** తుల్యామ్ల అను ఒక ఘృతము. శ్యామా అను దానిలో రెండవది. 'శ్యామా త్రివృత్ కషాయేణ' అనుదానిలో మూడవది. సాధితం చ అనుదానితో ఒక క్షీరయోగము చెప్పెను. నెయ్యితోను, పాలతోనుగాని తరువాత నేతితోగాని పాలతోగాని ఒకదానితో కలిపి ఘృత క్షీరములతో నాలుగు యోగములు.

## మద్యయోగము

69. త్రివృన్ముష్టీంస్తు సనఖానష్టౌ ద్రోణేఽమ్భసః పచేత్
పాదశేషం కషాయా తం పూతం గుడతులాయుతమ్
70. స్నిగ్ధే స్థాప్యం ఘటే క్షౌద్రపిప్పలీఫలచిత్రకైః
ప్రలిప్తే విధినా మాసం జాతం తన్మాత్రయా పిబేత్
71. గ్రహణీపాణ్డురోగఘ్నం గుల్మశ్వయథునాశనమ్
సురాం వా త్రివృతాయోగకిణ్వాం తత్క్వాథసంయుతామ్

**తాత్పర్యము :** తెగడవేరు పట్టను ఎనిమిది పిడికిళుల పరిమితమును ద్రోణ పరిమిత జలమునవేసి నాల్గవవంతు మిగులునటు కషాయము కాచి వడగట్టి, అందు నూరుపలములు బెల్లమును కలిపి, పిప్పళ్ళను మ్రంగకాయ విత్తులను, చిత్ర

మూలమును, తేనెపోసి నూరి, నేతితో మాగిన ఒక కుండ లోభాగమున పూసి ఆ కుండయందు పై చెప్పిన ఔషధమును పోసి వాసెనగట్టి ఒక మాసము పదిలముగ ఉంచవలెను. అది చక్కగ రసముదిగిన పిదప యుక్తమైన పరిమితముగ గ్రహించి తేనెలో కలిపి సేవించవలెను ఇది గ్రహణి రోగములను, పాండురోగములను, గుల్మములను, శోఫలను హరించును లేక తెగడనుకూడ చేర్చి సిద్ధము చేయబడిన సురాబీజముతో విద్యుక్త ప్రకారము సాధితమైన సురామద్యమునందు తెగడ కషాయ మును కలిపియైనను త్రాగవలెను. ఇది రెండవ సురాయోగము.

**ఆయుర్వేదదీపిక :** 'త్రివృన్మస్తీమ్' అనుదానిలో మొదటి సురా యోగము. 'సురాంవా' అనుదానిలో రెండవది. ఈ విధముగా రెండు సురాయోగ ములు అగుచున్నవి. త్రివృత్‌తో కూడిన సురాబీజము దేనియందుండునో, అది త్రివృత్ యోగ కిణ్వము.

## కాంజిక యోగము

72. యవైః శ్యామాత్రివృతాక్వాథస్విన్నైః కుల్మాషమప్సా
ఆసుతం షడహం పల్లే జాతం సౌవీరకం పిబేత్

73. భృష్టాన్ వా సతుషాన్ క్షుణ్ణాన్ యవాంస్తచ్చూర్ణసంయుతాన్
ఆసుతానప్సా తద్వత్ పిబేజ్జాతం తుషోదకమ్

**తాత్పర్యము :** యవలను తెగడ కషాయమున ఉడికించి పైపొట్టు నొలిచి నూరి ఆ పిష్టమును నీళ్ళతో కలిపి కుండలో పోసి మూతమూసి చేలమన్ను లేపనము చేసి ఆరుదినములు ధాన్యరాశి నడుమ నుంచి, చక్కగ రసము దిగిన పిదప ఆ రస మును విరేచనమునకై త్రాగవలెను.

పొట్టుతోటి శుభ్రమైన యవలను వేయించి నలుగగొట్టి తెగడ చూర్ణముతో కలిపి నీళ్ళలో పోసి మూతమూసి వాసెనగట్టి ఆరుదినములు ధాన్యరాశి నడుమనుంచి చక్కగ రసము కల్గిన పిదప వడగట్టి త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'యవైః' అనువానిలో సౌవీరకము, తుషోదకము లను చెప్పెను. ఇవి రెండు కాంజిక యోగములు. 'కుల్మాష' మనగా ఉడికించిన యవల పిండి. పల్లె అనగా ధాన్యం మొదలైన రాశియందు. తచ్చూర్ణసంయుతావి అనగా త్రివృత్ చూర్ణముతో కూడియున్న. 'తద్వత్' అనగా ఆరురోజులు ధాన్య శాలిలో ఉన్నవి.

### షాడవాది పదియోగములు

74. తథా మదనకల్పోక్తాన్ షాడవాదీన్ పృథగ్దశ
త్రివృచ్చూర్ణేన సంయోజ్య విరేకార్థం ప్రయోజయేత్

**తాత్పర్యము:** తెగడచూర్ణమును షాడబ-రాగ-లేహ-మోదక-ఉత్కారికా-తర్పణ-పానక-మాంసరస-యూష-మద్యములను పదింటిలో వేరు వేరుగ చేర్చి పది యోగములను మదన కల్పోక్త ప్రకారము కల్పించి విరేచనమునకై ఉపయోగించ వలెను. ఈ యోగములు "దశాన్యేషాడబాదిషు" అను సంగ్రహమున నిర్దేశింప బడును.

**ఆయుర్వేద దీపిక :** తథా అనుదానితో షాడవము మొదలైన 10 యోగములను చెప్పెను. ఆ 10 షాడవములు "బదరషాడవరాగలేహామోదకోత్కారికాతర్పణశాకమాంసరసయూషమద్యానామ్" (క. అ. 1) అను శ్లోకములో మదనకల్పమున చెప్పబడినది.

### విరేచనౌషధము సేవించినపుడు వాంతి కాకుండుటకై ఉపాయము

75. త్వక్కేసరామ్రాతకదాడిమైలా సితోపలామాక్షికమాతులుఙ్గైః
మద్యైస్తథామ్లైశ్చ మనోనుకూలైర్యుక్తాని దేయాని విరేచనాని

76. శీతామ్బునా పీతవతశ్చ తస్య సించేన్ముఖం ఛర్దివిఘాతహేతోః
హృద్యాంశ్చ మృత్పుష్పఫలప్రవాలానమ్లం చ దద్యాదుపజిఘ్రణార్థమ్

**తాత్పర్యము :** మరియు లవంగపుపట్ట, నాగకేసరములు, అమ్రాతకము, దానిమ్మపండ్లు, ఏలకులు, కండచక్కెర, తేనె, మాదీఫలములు ఈ ద్రవ్యములతో యథా లాభముగ చేర్చియైనను, మద్యములతో చేర్చియైనను, దానిమ్మ మున్నగు పుల్లని రసములతో కూర్చియైనను రోగికి వమనము కాకుండుటకై మనస్సుకింపుగా నుండునట్లు సంస్కరించి విరేచనౌషధమును త్రాగింపవలెను. మరియు విరేచనౌషధమును త్రాగిన వెంటనే వమనము రాకుండుటకై చల్లని నీళ్ళను ముఖముపై చిలకరించి మనసుకు రమ్యమైన మృత్తు, పుష్పములు, ఫలములు, చిగుళ్ళు, అమ్ల రసములు మున్నగువానిని మూర్కొనుటకై (ఆఘ్రాణించుటకై) ఇవ్వవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'త్వక్కేశర' అనుదానితో ఇప్పుడు 110 యోగములను చెప్పి వాన్తి పోగొట్టుట కొరకు మూడు కృత్యములతో కూడా విరేచన ప్రయోగములను చెప్పెను.

## అధ్యాయోక్త విషయములు

77. ఏకోఽమ్లాదిభిరష్టౌ చ దశ ద్వౌ సైన్ధవాదిభిః
మూత్రేఽష్టాదశ యష్ట్యాం ద్వౌ జీవకాదౌ చతుర్దశ

78. క్షీరాదౌ సప్త లేహేఽష్టౌ చత్వారః సితయాఽపి చ
పానకాదిషు పంచైవ షడృతౌ పఞ్చ మోదకాః

79. చత్వారశ్చ ఘృతే క్షీరే ద్వౌ చూర్ణే తర్పణే తథా
ద్వౌ మద్యే కాఞ్జికే ద్వౌ చ దశాన్యే షాడవాదిషు

80. శ్యామాయాస్త్రివృతాయాశ్చ కల్పేఽస్మిన్ సముదాహృతమ్
శతం దశోత్తరం సిద్ధం యోగానాం పరమర్షిణా

**తాత్పర్యము :** శ్యామా త్రివృత్కల్పమున

| | |
|---|---|
| అమ్లాదులలో యోగములు | 9 |
| సైంధవాదులతో చేరిన యోగములు | 12 |
| గోమూత్రముతో యోగములు | 18 |
| అతి మధురముతో యోగములు | 2 |
| జీవకాదులతో యోగములు | 14 |
| క్షీర మాంసాదులతో యోగములు | 7 |
| లేహ యోగములు | 8 |
| మోదకాది రూపమైన సితా యోగములు | 4 |
| పానకాదులతో యోగములు | 5 |
| వర్షాది ఋతువులకు సంబంధించిన యోగములు | 6 |
| మోదక యోగములు | 5 |
| ఘృత యోగములు | 3 |
| క్షీర ఘృతాదులతో యోగములు | 4 |
| తర్పణచూర్ణ యోగములు | 2 |
| మద్య యోగములు | 2 |
| సౌవీరక — తుషాదిరూపమైన కాంజిక యోగములు | 2 |
| షాడవాది యోగములు | 10 |
| | 110 |

ఇవన్నియు కలిసి నూటపది విరేచనసిద్ధయోగములు ఋషివర్యుడగు అగ్నివేశునిచే ఈ అధ్యాయమున చెప్పబడినవి.

ఆయుర్వేదదీపిక : 'ఏకోఽష్టాధిభిః' అను మొదలైన సంగ్రహము స్పష్టమైన అర్థము గలది. 'యష్ట్యాండ్వౌ' అని 'యష్ట్యాహ్వాం విధినా' అని జీవ కాదితో ఒకటి మధూక అనుదానితో మరియొకటి.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతేఽప్రాప్తే దృఢబలసమ్పూరితే కల్పస్థానే శ్యామాత్రివృత్కల్పో నామ సప్తమోఽధ్యాయః

ఈ విధముగా లభ్యము కాకపోవుటచే దృఢబలునిచే పూరింపబడిన చరకుని ద్వారా ప్రతిసంస్కరింపబడిన అగ్నివేశకృత తన్త్రమందలి కల్పస్థానములో శ్యామా త్రివృత్కల్పమును ఏడవ అధ్యాయము.

శ్రీచక్రపాణిదత్తవిరచితాయాం ఆయుర్వేదదీపికాయాం చరకతాత్పర్య-టీకాయాం కల్పస్థానే శ్యామాత్రివృత్కల్పో నామ సప్తమోఽధ్యాయః

శ్రీ చక్రపాణిదత్తునిచే రచింపబడిన 'ఆయుర్వేదదీపిక' అనెడి చరక తాత్పర్య టీక యందు కల్పస్థానములో శ్యామాత్రివృత్కల్పమను పేరుగల ఏడవ అధ్యాయము.

No vamps occur

# అష్టమాధ్యాయము

1. అథాతశ్చతురఙ్గులకల్పం వ్యాఖ్యాస్యామః
ఇతి హ స్మాహ భగవానాత్రేయః

**తాత్పర్యము :** అటు తరువాత చతురఙ్గులకల్పమును వ్యాఖ్యానము చేయగలము. ఆత్రేయ భగవానుడు ఈ క్రింది విధముగా చెప్పెను.

**ఆయుర్వేదదీపిక :** శ్యామాది త్రివృత్ కల్పము తరువాత మృదు విరేచనత్వము సామాన్యత్వముగాగల చతురంగుల కల్పము చెప్పబడుచున్నది.

## ఆరగ్వధ పర్యాయనామములు

3. ఆరగ్వధో రాజవృక్షః శమ్పాకశ్చతురఙ్గులః
ప్రగహః కృతమాలశ్చ కర్ణికారోఽవఘాతకః

**తాత్పర్యము :** ఆరగ్వధ, రాజవృక్ష, శంపాక, చతురంగుల, ప్రగ్రహ, కృతమాల, కర్ణికార, అవఘాతక అను ఈ పర్యాయనామములచే చతురంగులము వ్యవహరింపబడును.

**ఆయుర్వేదదీపిక :** 'ఆరగ్వధ' అనుదానితో వ్యవహారము కొరకు పర్యాయపదములు చెప్పెను.

## ఆరగ్వధ గుణములు

4. జ్వరహృద్రోగ వాతాసృగుదావర్తాది రోగిషు
రాజవృక్షోఽధికం పథ్యో మృదుర్మధురశీతలః

5. బాలే వృద్ధే క్షతేక్షీణే సుకుమారే చ మానవే
యోజ్యో మృద్వనపాయిత్వాద్విశేషాచ్చతురఙ్గులః

**తాత్పర్యము :** చతురంగులమనునది మృదు విరేచనంబును, మృదు గుణము కలిగి శీత వీర్యముగనుండును. జ్వరము, హృద్రోగము, వాతరక్తము, ఉదావర్తము మున్నగు రోగములచే పీడితులగువారికి విరేచనములకై ఉపయోగించిన

చాలా హితకరముగ నుండును. మరియు బాలురకు, వృద్ధులకు, ఉరఃక్షతముచే బాధితులకును, ధాతుక్షయము కలవారికిని, సుకుమారులకును కూడా ఇది మృదు విరేచనంబై నిరపాయకరముగా నుండుటచే విశేషముగా ఉపయోగింపదగియుండును.

**ఆయుర్వేదదీపిక :** 'అధికం పథ్య' అనగా జ్వరాదులయందు విశేషముగా విరేచన ప్రయోగమునందు హితమైనది.

## ఉపయోగవిధి

6. ఫలకాలే ఫలం తస్య గ్రాహ్యం పరిణతం చ యత్
తేషాం గుణవతాం భారం సికతాసు నిధాపయేత్
సప్తరాత్రాత్ సముద్ధృత్య శోషయేదాతపే భిషక్
తతో మజ్జానముద్ధృత్య శుచౌ భాణ్డే నిధాపయేత్

**తాత్పర్యము :** రేలచెట్టు ఫలించుకాలమున చక్కగా పండి శుభ్రముగను, ఓషధి సామాన్యమునకు చెప్పియుండు ప్రశస్త గుణములు కల్గినవి యగు రేల పండ్లను సమృద్ధిగ గ్రహించి, ఇసుకలో 7 రాత్రులు గడచునంతదాక పాతిపెట్టవలెను. పిదప ఆ ఫలములను గ్రహించి ఎండలో ఎండించి వాని నొక్కొక్క దానిని చీల్చి వానిలోపల ఉండు మజ్జను గ్రహించి పరిశుభ్రమైన ఒక మట్టిపాత్రలో నుంచి పదిలముగ భద్రపరచుకొనవలయును.

**ఆయుర్వేదదీపిక :** 'ఫలకాలే' అనగా ఫలించుకాలమున 'తేషాం' అనగా ఫలములను. 'భారం' అనగా ఎక్కువ బరువు కలిగిన ద్రవ్యములకు అని భావము. 'మజ్జానాం' అనగా ఫలముయొక్క గుజ్జును అని అర్థము.

## ద్రాక్ష రసముతో ఒక యోగము

8. ద్రాక్షారసయుతం దద్యాద్దాహోదావర్తపీడితే
చతుర్వర్షముఖే బాలే యావద్ద్వాదశవార్షికే
చతురఙ్గులమజ్జస్తు ప్రసృతం వాఽథవాఽఞ్జలిమ్

**తాత్పర్యము :** రేలగుజ్జు రెండు పలములనైనను నాలుగు పలములనైనను ద్రాక్ష పండ్ల రసమున కల్పి 4 సంవత్సరముల మొదలు 12 సం॥ల వయసుతో ఉండిన

బాలురకు దాహము, ఉదావర్తము, అను వ్యాధులు సంభవించినపుడు విరేచనమునకై త్రాగించవలయును.

ఆయుర్వేదదీపిక : 'ద్రాక్షా' అను మొదలైనది ప్రథమయోగము. "చతుర్వర్షముఖే బాలే యావద్ద్వాదశవార్షికే" అను మాటచే నాలుగు సంవత్సరములు లోపువారికి, 12 సం॥ల దాటినవారికి అవశ్యముగా ఈ కల్పయోగమును నిషేధించు చున్నాడు.

## సురామణ్డ యోగము—సీధుయోగము-దధిమణ్డ యోగము ఆమలకర సయోగము-సౌవీరకయోగము

సురామణ్డేన సంయుక్తమథవా కోలసీధునా
10. దధిమణ్డేన వా యుక్తం రసేనామలకస్య వా
కృత్వా శీత కషాయం తం పిబేత్ సౌవీరకేణ వా

తాత్పర్యము : రేల గుజ్జు సురయను మద్యముయొక్క పైతేటతోనైనను, రేగుపండ్లచే సిద్ధమైన శీధుమద్యముతోనైనను, పెరుగుమీది తేట నీటితోనైనను, ఉసిరికపండ్ల రసముతోనైనను కలిపి విరేచనమునకై త్రాగవలెను. మరియు రేల గుజ్జును శీతకషాయమున సిద్ధముచేసి, ఆ కషాయమును సౌవీరకమను కాంజికము చేర్చి త్రాగవలెను.

ఆయుర్వేదదీపిక : 'సురామణ్డేన' అనునది రెండవ యోగము. 'అథవా కోలశీధునా' అనునది మూడవ యోగము. కోలము చేత చేయబడిన శీధు కోలశీధు. 'సౌవీరకేణవా' అను అంతముతో మరియొక మూడు యోగములు స్పష్టము.

## త్రివృత్ కషాయయోగము—బిల్వ కషాయయోగము—లేహ యోగము

11. త్రివృతో వా కషాయేణ మజ్ఞః కల్కం తథా పిబేత్
తథా బిల్వకషాయేణ లవణక్షౌద్రసంయుతమ్

తాత్పర్యము : తెగడను విధ్యుక్త ప్రకారము క్వాథము చేసి, అందు రేల మజ్జను కలిపి త్రాగవలయును. మరియు బిల్వ వేరును క్వాథము చేసి అందు సైంధవ లవణమును తేనెను కలిపి రేలమజ్జను చేర్చి త్రాగవలయును.

**ఆయుర్వేదదీపిక :** 'త్రివృతో వా కషాయేణమజ్జః కల్కంతథాపిబేత్' అనునది 7వ యోగము 'తథా' అను దానితో 8వది. ఈ రెండు కల్కకషాయములను 'త్రివృద్బిల్వ కషాయాభ్యాం సక్షౌద్రలవణౌ ద్వౌ' అని జతూకర్ణమునందును చెప్ప బడినవే. అందువలన ఇక్కడ మరియొక పాఠము (పాఠాంతరము) ప్రమాణము కాదు. కషాయే చ త్రివృతో బిల్వకస్య చ' అని సంగ్రహమునందు చేయగలడు.

12. 'కషాయేణాథవా తస్య త్రివృచ్చూర్ణం గుడాన్వితమ్
సాధయిత్వా శనైర్లేహం లేహయేన్మాత్రయా నరమ్

**తాత్పర్యము :** రేలగుజ్జును చేర్చి క్వాథము చేసి ఆ క్వాథమున బెల్లం పాకము పట్టి అందు తెగడ చూర్ణమును కలిపి లేహపాక విధి ప్రకారము మందాగ్నిచే పక్వము చేసి తగిన పరిమాణముతో ఆ లేహమును విరేచనమునకై సేవింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'కషాయేణ' అను మొదలైనది 9వ యోగము.

## రెండు ఘృతయోగములు

13. చతురఙ్గులసిద్ధాద్వా క్షీరాద్యదుదియాద్ఘృతమ్
మజ్జః కల్కేన ధాత్రీణాం రసే తత్సాధితం పిబేత్

**తాత్పర్యము :** రేలగుజ్జును పాలలో కలిపి క్షీరపాక విధి ప్రకారము పక్వము చేసి ఆ పాలనుండి తీయబడిన నేతిలో రేలగుజ్జు కల్కమును, ఉసిరిక పండ్ల రసమును చేర్చి ఘృతపాక విధి ప్రకారము చేసి ఆ ఘృతమును విరేచనమునకై త్రాగవలయును.

**ఆయుర్వేదదీపిక :** 'చతురఙ్గుల' అనుదానితో మొదటి ఘృతము. 'మజ్జ' అనగా రేలపండు గుజ్జు.

14. తదేవ దశమూలస్య కులుత్థానాం యవస్య చ
కషాయే సాధితం సర్పిః కల్కైః శ్యామాదిభిః పిబేత్

**తాత్పర్యము :** చతురంగుల సిద్ధక్షీరమునుండి తీయబడిన ఘృతము నందు దశమూలకములను, ఉలవలను, యవలను చేర్చి క్వాథము చేయబడిన కషాయమును కలిపి మదన కల్పమున చెప్పబడిన ద్రవ్యముల తొమ్మిదింటిని కల్కముగ చేసి కలిపి ఘృతపాకవిధి ప్రకారము ఘృతమును సిద్ధము చేసి విరేచనమునకై త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'తదేవ' అనుదానితో రెండవ ఘృతము. '**శ్యామాదిభిః**' అనగా మదన కల్పమందు పఠింపబడిన 'శ్యామాత్రివృద న్తీ' (క. అ.1) అని మొదలైన తొమ్మిదింటితో అని అర్థము.

## అరిష్టయోగము

15. ద న్తీక్వాథేఽఞ్జలిం మఞ్జః శమ్పాకస్య గుడస్య చ
దత్వా మాసార్ధమాసస్థమరిష్టం పాయయేత్ చ

**తాత్పర్యము :** నేపాళపు వేళ్ళ కషాయమున 4 పలముల రేల గుజ్జును కలిపి బెల్లమును చేర్చి ఒక మట్టి పాత్రలో పోసి పైన మూత వేసి 1½ మాసము వరకు ధాన్యరాశిలో ఉంచి సిద్ధమైన ఆ అరిష్టమును విరేచనమునకై తగు ప్రమాణమున త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** ద న్తీ అను దానితో విశిష్ట యోగములను చెప్పెను. "గుడస్య" అనుదానికి "అఞ్జలిం" అను దానితో సంబంధము. "మాసార్ధ మాసస్థం" అనగా ఒకటిన్నర నెలయున్నదని అర్థము.

## అనుక్త విరేచనయోగోపదేశము

16. యస్య యత్ పానమన్నం చ హృద్యం స్యాద్వథ వా కటు
లవణం వా భవే త్తేన యు క్తం దద్యాద్విరేచనమ్

**తాత్పర్యము :** మనుజునకు మధుర-కటు-లవణ రసములలో ఏ రసములతో కూడిన అన్నపానములు రుచించునో, అట్టి అన్నపానముల యందు విరేచన ఔషధములను చేర్చి విరేచనమునకు ఉపయోగించవలెను.

**ఆయుర్వేదదీపిక :** "యస్యయత్" అనుదానితో చెప్పబడని ఉత్త మోత్తమమైన సాధనమును చేయుచున్నారు. హృద్యమైన దానితోనే విరేచనయోగమునకు ఇష్టత చేకూరును "పానమన్నం చ" అనునది "హృద్యం" అను మొదలైనవానితో ప్రత్యేకముగా సంబంధించియున్నది.

## అధ్యాయో క్త విషయములు

తత్రశ్లోకాః

17. ద్రాక్షారసే సురాసీధ్వోర్దధ్ని చామలకీరసే
సౌవీరకే కషాయే చ త్రివృతో బిల్వకస్య చ

18. లేహేఽరిష్టే ఘృతే ద్వౌ చ యోగా ద్వాదశ కీర్తితాః
చతురఙ్గులకల్పేఽస్మిన్ సుకుమారాః సుఖోదయాః

**తాత్పర్యము :** చతురఙ్గుల కల్పమను ఈ అధ్యాయమున

| | |
|---|---|
| రేలకు ద్రాక్షారసముతో యోగము | — 1 |
| సురా, శీధు, దధి, ఆమలకీరస, సౌవీరకములతో యోగములు | — 5 |
| తెగడ యొక్కయు, మారేడు యొక్క కషాయములతో యోగము | — 2 |
| లేహ యోగము | — 1 |
| అరిష్ట యోగము | 1 |
| ఘృత యోగము | 2 |
| | 12 |

అను 12 యోగములు చెప్పబడినవి. ఈ చతురఙ్గుల యోగములు సుకుమారులు ఉపయోగింప దగినవియు, సుఖమును కల్గించునవియునై యుండును.

**ఆయుర్వేదదీపిక :** 'ద్రాక్ష' మొదలైన సంగ్రహము స్పష్టమైనదే.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతేఽప్రాప్తే
దృఢబలసంపూరితే కల్పస్థానే చతురఙ్గులకల్పో నామా అష్టమోఽధ్యాయః

ఈ విధముగా లభ్యముకాకపోవుటచే దృఢబలునిచే పూరింపబడిన చరకునిచే ప్రతిసంస్కరింపబడిన అగ్నివేశతన్త్రమందలి కల్పస్థానములో చతురఙ్గులకల్పమను ఎనిమిదవ అధ్యాయము.

శ్రీచక్రపాణిదత్తవిరచితాయామాయుర్వేదదీపికాయాం చరకతాత్పర్య-
టీకాయాం కల్పస్థానే చతురఙ్గులకల్పో నామాష్టమోఽధ్యాయః

శ్రీచక్రపాణిదత్తునిచే రచింపబడిన 'ఆయుర్వేదదీపిక' అనెడు చరక తాత్పర్య టీక యందు కల్పస్థానములో 'చతురఙ్గుల కల్పము' అను పేరుగల ఎనిమిదవ అధ్యాయము.

— x —

# నవమాధ్యాయము

1. అథాత స్తిల్వకకల్పం వ్యాఖ్యాస్యామః
2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః

**తాత్పర్యము :** అటు తరువాత తిల్వక కల్పమును వ్యాఖ్యానము చేయ గలము. భగవానుడగు ఆత్రేయుడు ఈ విధముగా చెప్పెను.

**ఆయుర్వేదదీపిక :** చతురఙ్గులమువలె తిల్వకము అపాయము లేనిదగుట వలన చతురఙ్గులకల్పము తర్వాత తిల్వకకల్పము చెప్పబడుచున్నది.

## తిల్వక పర్యాయనామములు - ఉపయోగ విధి

3. తిల్వకస్తు మతో లోధ్రో బృహత్పత్ర స్తిరీటకః
తస్య మూలత్వచం శుష్కా మన్తర్వల్కలవర్జితమ్
4. చూర్ణయేత్తు త్రిధా కృత్వా ద్వౌ భాగౌ శ్చోతయేత్తతః
లోధ్రస్యైవ కషాయేణ తృతీయం తేన భావయేత్
5. భాగం తం దశమూలస్య పునః క్వాథేన భావయేత్
శుష్కం చూర్ణం పునః కృత్వా తత ఊర్ధ్వం ప్రయోజయేత్

**తాత్పర్యము :** తిల్వకము, లోధ్ర, బృహత్పత్ర, తిరీటక అనునవి పర్యాయనామములు. దోషరహితమై ఓషధుల కుండవలసిన గుణములతో కూడి యున్న తిల్వక (లొద్దుగచెట్టు?) వేళ్ళను ఓషధీగ్రహణ విధ్యుక్త ప్రకారము యుక్త కాలమున గ్రహించి, వానిలోపలుండు కఠినమైన భాగమును తీసివేసి, పట్టను మాత్రము గ్రహించి చూర్ణము చేసి మూడు భాగములు చేసి, అందు రెండు భాగము లను క్వాథము చేసి 21 పర్యాయములు ఈ క్వాథమును వడియగట్టి ఉంచవలెను. తర్వాత ఈ కషాయమునందే మూడవవంతు లొద్దుగపట్ట కల్కమును భావనచేసి ఎండించి మరల దశమూల కషాయమున భావనచేసి మెత్తని చూర్ణముచేసి ఎండించి చూర్ణం చేసి పదిలముగ నుంచుకుని ఆయా యోగములందు ఉపయోగింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** "అన్తర్వల్కలవర్జితామ్" అనగా తిల్వకము యొక్క లోపలి భాగము కఠినమైనది. అందువలన దానిని వదిలిపెట్టుట అని అర్థము, "శ్చోతయేత్" అనుమాటచే మదన కల్పమందు ఇటువంటి వడగట్టినటువంటి (కషాయములు). దానిని చూచుటవలన అటువెట్లు ద్రవ్యములో 21 సార్లు వడగట్ట వలెనని తెలిసికొనదగినది. భావనావిధికూడా నిరంతరము వివరింపబడినదే.

## దధ్యాదులతో ఐదు యోగములు

6. దధిత్వక్రసూరామణ్డమూత్రైర్బదరసీధునా
రసేనామలకానాం వా తతః పాణితలం పిబేత్

**తాత్పర్యము :** పెరుగుమీది తేట, సురయను మద్యముపై తేట, గోమూత్రము, రేగుపండ్ల రసముతో సిద్ధము చేయబడిన శీధుమద్యము, ఉసిరిక కాయలరసము, ఈ 5 ద్రవ్యములలో వేరు వేరుగ పైన చెప్పబడిన లొద్దుగ చూర్ణమును పాణితల (కర్ష) ప్రమాణము కలిపి విరేచనమునకై త్రాగవలెను.

## సౌవీరక యోగము

7. మేషశృఙ్గ్యభయాకృష్ణచిత్రకైః సలిలే శృతే
మరుజాన్ సునుయా త్తచ్చ జాతం సౌవీరకం యదా

8. భవేదజ్జలినా తస్య లోధ్రకల్కం పిబేత్ సదా

**తాత్పర్యము :** — "దధిమణ్డ మొదలుకొని 'పిబేత్' అనువరకు 5 యోగములు మేషశృంగి (పొడపత్రి), కరకకాయల బెరడు, పిప్పళ్ళు, చిత్ర మూలము వీనినన్నింటిని సమ భాగములుగా తీసుకుని నలుగగొట్టి నీళ్ళలోపోసి క్వాథముచేసి వడగట్టి, అందు వేయించిన యవలను నలుగగొట్టి వేసి మూతవేసి, వాసెనకట్టి ధాన్యరాశిలో ఉంచిన అది జాతరసమైన సౌవీరకము అనబడును. అందు అంజలి (4 పలములు) పరిమితమున గ్రహించి ఒక కర్ష ప్రమాణము లొద్దుగ కల్కమును కలిపి విరేచనమునకై సేవింపవలెను

**ఆయుర్వేదదీపిక :** "మేషశృంగీ" అనుదానితో విశిష్టమైన సౌవీరకముతో ఒక యోగము. "మరుజా" అనగా వేయించిన యవలు.

## సురాయోగము - అరిష్టయోగము

సురాం లోధ్రకషాయేణ జాతాం పక్షిస్థితాం పిబేత్

9. దన్తీచిత్రకయోర్ద్రోణే సలిలస్యాఢకం పృథక్
సముత్క్వాథ్య గుడస్యైకాం తులాం లోధ్రస్య చాజ్జలిమ్

10. ఆవపేత్తత్ పరం పక్షాన్మద్యపానాం విరేచనమ్

**తాత్పర్యము :** లొద్దుగ పట్టను జలమునచేర్చి క్వాథముచేసి, యా కషాయమున వరిపిండి మున్నగు పిష్టమును చేర్చి సురాసంధాన విధి ప్రకారము పూసి వాసెన గట్టి, అది చక్కగా రసము కల్గునట్లు 15 దినములు ధాన్యరాశిలో నుంచి, ఆ సురను మిత ప్రమాణములో త్రాగినచో విరేచనమగును. మరియు దన్తీవేళ్ళు ఒక ఆఢకము (256 తులములు), చిత్రమూలము ఒక ఆఢకము పరిమిత జలమున వేసి క్వాథము కాచి, ఆ కషాయమును వడగట్టి, అందు నూరు పలముల బెల్లము, 4 పలముల లొద్దుగ చూర్ణమును కలిపి, అన్నింటిని ఒక భాండమున పోసి అరిష్ట సంధానవిధి ప్రకారము మూతమూసి బిగించి, ఒకపక్షము (15 రోజులు) వరకు ధాన్యరాశిలో ఉంచి, చక్కగా రసము కల్గినపిదప ఆ మద్యమును లొద్దుగ చూర్ణమును కలిపి త్రాగినచో చక్కగా విరేచనమగును

**ఆయుర్వేదదీపిక :** "సురాం" అనుదానితో సురాయోగమును చెప్పెను. "దన్తీ" అనుదానితో ఒక అరిష్ట యోగమును చెప్పెను. దన్తీ చిత్రకములకు ఆఢక ప్రమాణమున వేరు వేరుగా ద్రోణ పరిమితి (1024 తు॥) గల నీటియందు క్వాథము కాచవలెను. ఇక్కడ తిల్వక చూర్ణమును కలుపవలెను.

## కమ్పిల్లక యోగము

కమ్పిల్లకకషాయేణ దశకృత్వః సుభావితమ్

11. మాత్రాం కమ్పిల్లకస్యైవ కషాయేణ పునః పిబేత్

**తాత్పర్యము :** కంపిల్లకము విధ్యుక్త ప్రకారము ~~కషాయము~~ కాచి ఆ కషాయమున తిల్వక చూర్ణమును మిత ప్రమాణమున పదిసార్లు భావనచేసి ఆ చూర్ణమును కంపిల్లక కషాయమును పానమునకు త్రాగినచో విరేచనమగును.

**ఆయుర్వేదదీపిక :** "కమ్పిల్లక" అను దానితో కంపిల్లక యోగమును చెప్పెను. కంపిల్లక అనగా గుండారోచనికా అని అర్థము. "మాత్రాం" అనగా తిల్వకచూర్ణ పరిమాణమని అర్థము.

## మూడు లేహయోగములు

చతురఙ్గులకల్కేన లేహోఽస్యాః పార్శ్య ఏవ చ

12. త్రిఫలాయాః కషాయేణ సర్పిర్మధుసమాయుతః
లోధ్రచూర్ణయుతః సిద్ధో [illegible]

13. తిల్వకస్య కషాయేణ కల్కేన చ సశర్కరః
సఘృతః సాధితో లేహః స చ శ్రేష్ఠో విరేచనే

**తాత్పర్యము :** చతురఙ్గుల కల్పమున చెప్పబడిన ప్రకారము (లేహవిధి) లొద్దుగ పట్టను కషాయముకాచి, అందు త్రివృత్ చూర్ణమును కలిపి విధి ప్రకారము లేహము చేయవలెను. త్రిఫలములు క్వాథముచేసి అందు లొద్దుగ చూర్ణము కలిపి లేహ పాక విధి ప్రకారము పక్వము చేసి, చల్లారిన పిదప తేనె కలిపి ఉపయోగించ వలెను. ఇది శ్రేష్ఠమైన విరేచనయోగము లొద్దుగపట్టను కషాయముకాచి చక్కెర పాకమున ఆ కషాయమును లొద్దుగ చూర్ణమును నేతిని చేర్చి లేహపాక విధి ప్రకారము లేహమును సిద్ధముచేసి ఉపయోగింపవలెను. ఇది శ్రేష్ఠమైన విరేచనౌషధము.

**ఆయుర్వేదదీపిక :** 'చతురఙ్గుల' అనుదానితో మొదటి లేహయోగము 'చతురఙ్గుల కల్పేన' అనగా 'కషాయేణాథవా ఽస్య' (క. అ. 8) ఈ మొదలుగా చెప్పిన విధానముతో అని అర్థము. అందుచేత యిచ్చట బిల్వ కషాయముతో బెల్లము కలిపిన తెగడ చూర్ణము పాకముచేసి లేహము చేయదగినది. 'త్రిఫలాయాః' అనుదానితో రెండవ లేహము. 'తిల్వకస్య' అనుదానితో మూడవది.

## నాలుగు ఘృతయోగములు

14. అష్టాష్టౌ త్రివృతాదీనాం ముష్టింస్తు సనఖాన్ పృథక్
ద్రోణేఽపాం సాధయేత్ పాదశేషే ప్రస్థం ఘృతాత్ పచేత్
15. పిష్టైస్తైరేవ బిల్వాంశైః సమూత్రలవణైరథ
తతో మాత్రాం పిబేత్ కాలే శ్రేష్ఠమేతద్విరేచనమ్
16. లోధ్రకల్కేన మూత్రామ్లలవణైశ్చ పచేద్ఘృతమ్
చతురఙ్గుల కల్పేన సర్పిషీ ద్వే చ సాధయేత్

**తాత్పర్యము :** త్రివృత్ మొదలగు (శ్యామాత్రివృత్-చతురఙ్గుల-తిల్వక-మహావృక్ష-సప్తలా-శంఖినీ-దన్తీ-ద్రవన్తీ) తొమ్మిది ద్రవ్యములను ప్రత్యేక ముగ ఎనిమిదేసి పిడికిళ్ళవంతున ద్రోణపరిమితమైన (1024 తులములు) జలమున చేర్చి నాల్గవ భాగము మిగుల క్వాథముచేసి, అందు ప్రస్థమాత్రమును (64 తులములు) నేతిని పై చెప్పబడిన 9 ద్రవ్యములను ప్రత్యేకము ఒక్కొక్క పలము వంతున నూర్చి కల్కముచేసి, ఆ కల్కమును కూడ కలిపి ఘృతమునకు సమభాగము

గోమూత్రమును, పలమాత్రము సైంధవ లవణమును చేర్చి ఘృతపాకవిధి ప్రకారము పక్వము చేసి, ఆ ఘృతమును అగ్నిబలాద్యనుసారముగ పరిమాణము కల్పించి త్రాగించినచో విరేచనమగును. ఇదియును శ్రేష్ఠమైన విరేచనయోగము. లొద్దుగ యొక్క కల్కమును ఘృతమునకు నాల్గవ వంతును, అమ్లవర్గములో చేరిన నిమ్మ కాయలు, దానిమ్మ మున్నగువాని పులుపురసమును ఘృతమునకు నాలుగింతలును కలిపి ఘృతముతో ఘృతపాక విధి ప్రకారము పక్వముచేసి యుపయోగించవలెను. చతురఙ్గుల కల్పన చెప్పబడిన ప్రకారము తిల్వకముతో రెండు ఘృతయోగములు కల్పించవలెను.

ఆయుర్వేదదీపిక : "అష్టాఽష్టా" అనుదానిలో మొదటి ఘృతము. 'సనఖాన్' అనగా గోళ్ళు ఉన్న అని అర్థము. ఇచ్చట త్రివృత్ మొదలైన వానితో తీసుకొనబడిన లోధ్రము ప్రధానమగుట వలన రెట్టింపు భాగమగుచున్నది. "త్రివృదాదిద్విగుణో లోధ్రక్వాథః" అని జతూకర్ణమందు చెప్పబడినదిగదా. లోధ్రప్రయోగత్వమునకు సమభాగమున్నచో విశేషమేమియు లేకుండుటచేత వ్యాఖ్యానము నందు చెప్పబడినదియే (లోధ్రకు - రెట్టింపు భాగము) శ్రేష్ఠము. ఇచ్చట లవణముకూడా పలప్రమాణమే (గ్రహించవలెను)'లోధ్ర' అనునది రెండవ ఘృతము. 'చతురఙ్గుల' అనుదానిలో రెండు ఘృతములు చెప్పబడుచున్నవి. ఇట్లు ఘృతముతో నాలుగు యోగములు అగుచున్నవి. చతురఙ్గుల ఘృతమందును 'చతురఙ్గుల సిద్ధాత్' (క. అ. 8) అనుదానితోను, అట్లే "తదేవ దశమూలస్య" (క. అ. 8) అనుదానితోను చెప్పబడినవిగా తెలిసికొనదగినది. ఆ విధముగా చతురఙ్గుల కల్పముతో, లోధ్రాదితో రెండు లోధ్రఘృతములగుచున్నవి.

## అధ్యాయోక్త విషయసంగ్రహము

తత్ర శ్లోకౌ -

17. పఞ్చ దద్యాదధిస్త్వేతా సురా సౌవీరకేణ చ
ఏకోఽరిష్టస్తథా యోగ ఏకః కమ్పిల్లకేన చ

18. లేహాస్త్రయో ఘృతేనాపి చత్వారః సంప్రకీర్తితాః
యోగాస్తే లోధ్రమూలానాం కల్పే [illegible] దర్శితాః

**తాత్పర్యము :** తిల్వక కల్పాధ్యాయమున

| | |
|---|---|
| పెరుగు మున్నగు వానితో యోగములు | 5 |
| సురా, సౌవీరకము, అరిష్టము అనువానితో యోగములు | 3 |
| కంపిల్లముతో యోగము | 1 |
| లేహ యోగములు | 3 |
| ఘృతయోగములు | 4 |
| | 16 |

అను పదహారు విరేచన సిద్ధయోగములు చెప్పబడినవి.

**ఆయుర్వేదదీపిక :** 'పఞ్చ దదాద్యైభిః' అనునట్టి సంగ్రహము స్పష్టమైనది.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతేఽప్రాప్తే దృఢబలసంపూరితే కల్పస్థానే తిల్వకకల్పో నామ నవమోఽధ్యాయః

ఈ విధముగా చరకునిచే సంస్కరింపబడిన అగ్నివేశునిచే వ్రాయబడిన తన్త్రము లభ్యముకాక పోవుటచేత దృఢబలునిచే పూర్తి చేయబడిన కల్పస్థానమున **తిల్వక** కల్పమనునది నవమాధ్యాయము సమాప్తము.

శ్రీ చక్రపాణిదత్తవిరచితాయాం ఆయుర్వేదదీపికాయాం చరకతాత్పర్య-టీకాయాం కల్పస్థానే తిల్వకకల్పోనామ నవమోఽధ్యాయః

శ్రీ చక్రపాణిదత్తునిచే రచింపబడిన 'ఆయుర్వేదదీపిక' అనెడు చరక తాత్పర్య టీకయందు కల్పస్థానమున 'తిల్వకకల్పము' అను పేరుగల తొమ్మిదవ **అధ్యాయము.**

—×—

# దశమాధ్యాయము

can be ....

1. అథాతః సుధాకల్పం వ్యాఖ్యాస్యామః

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః

**తాత్పర్యము :** అటు తరువాత సుధాకల్పమును వ్యాఖ్యానము చేయగలము. తిల్వక కల్పమును చెప్పిన పిదప సుధాకల్పమును భగవానుడగు ఆత్రేయుడు ఈ విధముగ చెప్పెను.

**ఆయుర్వేదదీపిక :** 16 సంఖ్య గల యోగములను తిల్వక కల్పమునందు చెప్పిన తర్వాత యథాక్రమముగ అధిక సంఖ్యలో ప్రయోగములను పేర్కొనుటకు 20 యోగములను తెలిపెడి సుధాకల్పము పేర్కొనబడుచున్నది. ఇటుపైన ఎక్కువ సంఖ్యలో పేర్కొను క్రమము చేతనే 39 ప్రయోగములను తెలిపెడి సప్తలాశఙ్ఖినీ కల్పము చెప్పబడును.

## సుధాగుణములు - సుధాప్రయోగమునకనర్హులు

3. విరేచనానాం సర్వేషాం సుధా తీక్ష్ణతమా మతా
సజ్ఞాతం హి భినత్త్యాశు దోషాణాం కష్టవిభ్రమా

4. తస్మాన్నైషా మృదౌ కోష్ఠే ప్రయోక్తవ్యా కదాచన
న దోషనిచయే చాల్పే సతి మార్గపరిక్రియే

**తాత్పర్యము :** పలురకములైన విరేచన ద్రవ్యములలో జెముడు మిక్కిలి తీవ్రమైనది ఇయ్యది చాలాకాలము నుండి వృద్ధిచెంది చేరియుండు దోష సంచయమును శీఘ్రముగా భేదించును. మిగుల కష్టసాధ్యములగు ఉపద్రవములను కల్గించునది. కావున అట్టి తీవ్రమైన జెముడును మృదుకోష్ఠము కలవారికిని, దోషసంచయము స్వల్పముగా నుండు వారికిని ఒకప్పుడును ఉపయోగింపరాదు. మరియు వ్యాధి ఎట్టి క్రూరదశయందున్నను చికిత్స చేయుటకు ఇతర ఔషధముల కవకాశము ఉన్నప్పుడు దీనిని ఉపయోగింపరాదు.

**ఆయుర్వేదదీపిక :** "విరేచనానాం" అనగా విరేచన ద్రవ్యములకు అని అర్థము. "కష్టవిభ్రమ" అనగా కష్టసాధ్యమైన విభ్రమము కలిగించునది. 'తస్మాత్'

అనగా అతి తీక్ష్ణత్వము వలన, కష్టవిభ్రమత్వము వలనను. "సతి మార్గపరిక్రమ" అనగా మరియొక ఉపక్రమమునకు వీలుండుగ సుధాను ప్రయోగింపరాదు. అందువలన మార్గాంతరము లేనపుడే సుధాను ప్రయోగింపవలెనని అర్థము.

## సుధాప్రయోగమునకర్హులు

5 పాణ్డురోగోదరే గుల్మే కుష్ఠే దూషీవిషార్దితే
శ్వయథౌ మధుమేహే చ దోషవిభ్రాన్తచేతసి

6. రోగైరేవంవిధైర్గ్రస్తం జ్ఞాత్వా సప్రాణమాతురమ్
ప్రయోజయేన్మహావృక్షం సమ్యక్ స హ్యవచారితః

7. సద్యో హరతి దోషాణాం మహాన్తమపి సంచయమ్

**తాత్పర్యము :** పాండురోగము, ఉదరరోగము, గుల్మము, కుష్ఠము, దూషీవిషము, శోథ, మధుమేహము, దోష ప్రకోపముచే మనస్సు చంచలమైయున్న ఉన్మాదము అను ఈ రోగముల చేతను, వీనికి సమానములైన ఇతర వ్యాధుల చేతను పీడితుడగు రోగి బలము కల్గియున్న యెడ అట్టి బలానుసారముగ జెముడును విరేచనమునకై ఉపయోగింపదగును. అట్టి వ్యాధులయందు జెముడును విధ్యుక్త ప్రకారముగ ఉపయోగించినచో వృద్ధి చెందియున్న దోష సంఘాతమునైనను అతి శీఘ్రముగ హరించును.

**ఆయుర్వేదదీపిక :** 'పాణ్డురోగే' అను వాటిలో మధుమేహ శబ్దము చేత ప్రమేహములనే చెప్పుచున్నారు. విశేషముగా వాతజన్య మధుమేహము అసాధ్యమే. అందువలన దానికి విరేచన కర్మను చెప్పుట అనర్థకమే అగును. ప్రమేహ చికిత్సయందు ప్రతిపాదించబడినట్లు మధుమేహ శబ్దము ప్రమేహమునకే వర్తించును. దేనియందు మనస్సు వృద్ధి చెందిన దోషములచే విభ్రమము చెందునో దానియందు అనగా ఉన్మాదమునందు. "సప్రాణః" అనగా బలవంతుడైన వానిని (అని అర్థము).

## సుధాభేదములు - ఉపయోగవిధి

ద్వివిధః స మహోఽల్పైశ్చ బహుభిశ్చైవ కణ్టకైః
8. సుతీక్ష్ణైః కణ్టకైరల్పైః ప్రవరో బహుకణ్టకః
స నామ్నా స్నుగ్గుడా నన్దా సుధా నిస్త్రింశపత్రకః

9. తౌ విపాట్యాహరేత్ క్షీరం శస్త్రేణ మతిమాన్ భిషక్
ద్వివర్షం వా త్రివర్షం వా శిశిరాన్తే విశేషతః

**తాత్పర్యము :** జెముడు రెండు విధములు. అందొకటి మిక్కిలి వాడి గల ముండ్లు కొద్దిగా కలిగియుండును. ఇంకొకటి దట్టముగా ముండ్లు కలిగియుండును. ఈ రెంటి యందును దట్టముగ ముండ్లు కలిగినది శ్రేష్ఠము. ఈ జెముడు స్నుక్, గుడ, నన్దా, సుధా, నిస్త్రింశపత్ర అను పర్యాయ నామములచే చెప్పబడును. ఈ రెండు విధములైన జెముడును శిశిరఋతువు నందలి చివరి దినములలో కత్తితో చీల్చి అందుండు స్రవించు జెముడు పాలను గ్రహించవలెను. రెండు, మూడు సంవత్సరములు గల్గిన జెముడు చెట్టు పాలను గ్రహించుటకు దగియుండును.

**ఆయుర్వేదదీపిక :** "ప్రవరోబహుకణ్టక" అనగా ఎక్కువ తీక్ష్ణము గాని, వాడిలేని తక్కువ సంఖ్యలో ముళ్ళుగల మహావృక్షము కంటె శ్రేష్ఠము అని అర్థము. 'తే' అనగా తక్కువ మరియు ఎక్కువ ముళ్ళు గలిగిన మహావృక్షములు రెండు. మదనకల్పమందు "శరది త్వక్కన్దక్షీరాణి" (క. అ. 1.) అని చెప్పబడినప్పటికీ ఇచ్చట జెముడు నుండి శిశిరఋతువు యొక్క చివరి కాలములో పాలను గ్రహించుట అనునది అపవాద రూపముగా తెలియవలెను. శిశిరము యొక్క మిగిలిన రోజులు శిశిరాన్తములు.

## సౌవీరకాదులతో ఏడు యోగములు

10. బిల్వాదీనాం బృహత్యా వా కణ్టకార్యాస్తథైకః
కషాయేణ సమాంశం తం కృత్వాఽఙ్గారేషు శోషయేత్
11. తతః కోలసమాం మాత్రాం పిబేత్ సౌవీరకేణ వా
తుషోదకేన కోలానాం రసేనామలకస్య వా
12. సురయా దధిమణ్డేన మాతులుఙ్గరసేన వా

**తాత్పర్యము :** మారేడు మున్నగు పంచమహా మూలముల వేళ్ళు, చిన్న ములక, పెద్ద ములకవేళ్లు, వీనిలో దేనినైన ఒకదానిని గ్రహించి క్వాథ విధి ప్రకారము కషాయము (నాల్గవవంతు) కాచి, దానికి సమభాగముగ జెముడు పాలను కలిపి ఒక పాత్రలో పోసి నిప్పులపై నుంచి, అది ముద్ద అగునట్లు ఇగరకాచి రేగు పండంత ప్రమాణము గల మాత్రలు చేయవలెను. పిమ్మట ఆ మాత్రలను త్రాపి

రకము,, తుషోదకము, రేగుపండ్ల రసము ఉసిరికాయల రసము, సురయను మద్యము, పెరుగుమీది తేటనీరు, మాదీఫలరసము అనునీ ద్రవములతో ఒకదానితో అనుపానమున సేవింపవలయును.

**ఆయుర్వేదదీపిక :** 'బిల్వాదీనాం' అనగా బిల్వాది పంచమూలములు అని అర్థము. 'అఙ్గారేషు శోషయేత్' అనగా నిప్పులపైన యున్న పాత్ర యందలి సుధాక్షీరమును బిల్వము మొ॥ ఇతర కషాయములతో సమానముగా ఇగిరించి గట్టిగా చేయవలెను. అటు పిమ్మట కోల ప్రమాణంలో గుటికలు చేయవలెను. తర్వాత సౌవీరకము మొ॥ ఇతర ద్రవ్యములతో త్రాగించవలెను. ఇట్లు సౌవీరకము మొ॥ భేదమువలన 7 యోగములగును. అట్లే ఇచట బిల్వాది కషాయమునకు భేదము చేత (అపరముగా) భేదము చూపించుట లేదు.

## ఘృతయోగము - మాంసరసము

సాతలాం కాఞ్చనక్షీరీం శ్యామాదీని కటుత్రికమ్
13. యదోపపత్తి సప్తాహం సుధాక్షీరేణ భావయేత్
కోలమాత్రాం ఘృతేనాతః పిబేన్మాంసరసేన వా

**తాత్పర్యము :** సాతలా, స్వర్ణక్షీరీ, త్రివృత్ మొదలగు విరేచన ద్రవ్యము (తొమ్మిది), త్రికటుకములు అను నీ ద్రవ్యములను దొరికినంత మటుకు గ్రహించి చూర్ణము చేసి జెముడుపాలతో ఏడుదినముల వరకు భావన చేసి కోల ప్రమాణములో నేతితోనైనను, మాంసరసముతోనైనను త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'సాతలాం' అను మొదలగువానిచే వాతమును జయించు ఘృత, మాంసరస భేదములచే రెండు యోగములు చెప్పెను. సాతలా అనగా చర్మకశా. శ్యామాదులు గ్రహించుట వలననే సాతల కూడా లభించినప్పటికీ వేరుగా కేవలము సాతలా పేర్కొనుటచే సాతలచే చేయబడిన సుధాయోగము యొక్క ప్రత్యేకత, ప్రాధాన్యత తెలియుచున్నది.

## పానక యోగము

14. త్ర్యూషణం త్రిఫలాం దన్తీం చిత్రకం త్రివృతాం తథా
స్నుక్క్షీరభావితం సమ్యగ్విదద్యాద్గుడపానకమ్

**తాత్పర్యము** : త్రికటుకములు, త్రిఫలములు, దన్తీ, చిత్రమూలము, తెగడ అను ద్రవ్యములను గ్రహించి చూర్ణము చేసి, పై యోగమున చెప్పిన రీతిగా 7 దినములు స్నుహీక్షీరమున చక్కగ భావన చేసి బెల్లమును చేర్చి సంస్కరించి సిద్ధము చేయబడిన పానకమున తగు మాత్రము కలిపి త్రాగినను చక్కగ విరేచనమగును.

**ఆయుర్వేదదీపిక** : 'త్ర్యూషణ' అను మొ॥ వానిచే పానక యోగమును చెప్పెను. గుడ పానకమనగా గుడముచే సంస్కరింపబడిన పానకము.

## ఘ్రేయ యోగము

15. త్రివృతారగ్వధం దన్తీం శఙ్ఖినీం సప్తలాం సమాన్
గోమూత్రే రజనీం కృత్వా శోషయేదాతపే తతః

16. సప్తాహం భావయిత్వైవం స్నుక్క్షీరేణాపరం పునః
సప్తాహం భావయేచ్చుష్కం తతస్తేనాపి భావితమ్

17. గన్ధమాల్యం తదాఘ్రాయ ప్రావృత్య, పటమేవ చ
సుఖమాశు విరిచ్యన్తే మృదుకోష్ఠా నరాధిపాః

**తాత్పర్యము** : తెగడ, రేల, దన్తీ, శంఖినీ, సప్తలా, వీనినన్నింటిని సమభాగములుగ చేర్చి గోమూత్రమున ఒక రాత్రంతయు ఉంచి మరునాడు పగలంతయు ఎండలో ఎండబెట్టవలెను ఇట్లు 7 రోజులు రేయి, పగలు భావన చేయవలెను. పిమ్మట జెముడు పాలలో పై విధముగానే భావన చేయవలెను. తరువాత ఎండించి చూర్ణము చేసి పుష్పమాలికలపై చల్లి భావన చేసి ఆ గంధమును ఆఘ్రాణించినచో చక్కగ విరేచనములగును. (లేక) భావన చేసిన ఆ చూర్ణమును గుడ్డపై చల్లి భావన చేసి ఆ గుడ్డను ముఖముపై కప్పుకొనిన సుఖముగా విరేచనమగును. ఇది మిక్కిలి సుకుమారులకును, మృదుకోష్ఠముగల రాజ మాత్రులకు ఉపయోగింపదగును.

**ఆయుర్వేదదీపిక** : "త్రివృత్" అను మొదలగువానిచే ఒక ఘ్రేయ యోగమును చెప్పెను. "గోమూత్రే రజనీం కృత్వా" అనగా గోమూత్రమునందు రాత్రి అంతయు ఉంచి అని అర్థము 'పటమేవ' అనగా విధి అనుసారము భావన చేయబడిన బట్టను కప్పి అని అర్థము.

18. శ్యామా త్రివృత్కషాయేణ స్నుక్ క్షీరఘృతఫాణితైః
లేహః పక్త్వా విరేకార్థం లేహయేన్మాత్రయా నరమ్

**తాత్పర్యము :** నల్లతెగడ, తెల్లతెగడ, ఈ రెంటిని నాల్గింతలు జలమును చేర్చి నాలుగు వంతులు మిగులునట్లు కషాయము కాచి, ఆ కషాయమును, జెముడుపాలను, ఆవునేతిని, ఫాణితములతో కలిపి లేహ విధి ప్రకారము పక్వము చేసి అగ్ని బలానుసారము సేవించిన విరేచనమగును.

**ఆయుర్వేదదీపిక :** "శ్యామా" అను మొ॥ వాని చేత లేహయోగమును చెప్పెను "మాత్రయా" అనగా ప్రమాదమును కలుగచేయని మాత్రలో అని అర్థము.

## యూషాదులతో మూడుయోగములు

19. పాయయేత్తు సుధాక్షీరం యూషైర్మాంసరసైర్ఘృతైః

**తాత్పర్యము :** జెముడుపాలను యూషమునందైనను, మాంసరసములయందైనను, ఆయా ఘృతములందైనను కలిపి విరేచనమునకై త్రాగవలెను.

**ఆయుర్వేదదీపిక :** "పాయయేత్" అను మొదలగుదానిచే వేరుగా యూషము, మాంసరసము, ఘృతములలో మూడు యోగములు చెప్పెను.

## శుష్కమత్స్యమాంసయోగము

భావితాచ్ఛుష్కమత్స్యాన్ వా మాంస వా భక్షయేన్నరః

**తాత్పర్యము :** ఎండిన చేపలనైనను, ఎండిన మాంసమునైనను జెముడు పాలలో పలుమార్లు భావన చేసి విరేచనమునకై తినవలెను.

**ఆయుర్వేదదీపిక :** "భావితాన్" అను మొదలగువానిచే శుష్కమత్స్య మాంసయోగమును చెప్పెను.

## ఘృత-సురాయోగములు

20. క్షీరేణామలకైః సర్పిశ్చతురఙ్గులవత్ పచేత్
సురాం వా కారయేత్ క్షీరే ఘృతం వా పూర్వవత్ పచేత్

**తాత్పర్యము :** చతురంగుళ కల్పమున చెప్పబడిన ఘృతయోగ ప్రకారము ఘృతమును సుధాక్షీరముతో సిద్ధము చేయవలెను. ఎట్లనగా - జెముడుపాలను అవుపాలలో చేర్చి కాచి, దాని నుండి తీయబడిన నేతిలో జెముడుపాలను, ఉసిరి కాయల కల్కమును చేర్చి ఘృతపాక విధి ప్రకారము సిద్ధము చేయవలెను. మరియు జెముడు పాలను సురామద్యమున కలిపి 15 దినములు ధాన్యపుటమున ఉంచి రసము చక్కగా కల్గిన పిదప పానము చేయవలెను. మరియు "లోధ్రకల్కేన మూత్రామ్లలవణైశ్చపచేద్ఘృతమ్" (క.అ 9.) అని చెప్పబడిన ఘృతయోగప్రకారము ఘృతమున గోమూత్రమును, పులుపు రసమును, జెముడు పాలను కలిపి ఘృతపాక విధి ప్రకారము పక్వము చేసి విరేచనమునకై ఉపయోగింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'క్షీరేణ' అను మొ॥దానిచేత ఒక ఘృతము, 'ఘృతంవా' అను మొదలగువానిచే ఒకటి చెప్పగలడు. 'ఆమలకైశ్చతురఙ్గులవత్' అను వాక్యము చేత ఉసిరికాయ రసముతో కూడిన చతురంగుళ కల్పమునందు "చతురఙ్గులసిద్ధాద్వా" (క. స్థా. అ. 8) అను మొదలగువానిచే చెప్పబడినది. దాని విధానము ఇచ్చటను వర్తించును.'సురాం వా కారయేత్ క్షీరే' అనగా స్నుహీక్షీరముచేత భావన అను మొదలగు విధానము చేత సురను చేయవలెను. "ఘృతం వా పూర్వవత్ పచేత్" అనుచోట 'పూర్వవత్' అను మొదలగువానిచే తిల్వకకల్పమందు "లోధ్ర కల్కేన" (క స్థా.అ.9) అను మొదలగువానిచే గ్రంథమునందు ఏదైతే చెప్పబడినదో ఆ విధానమునే ప్రత్యక్షముగా చూచియుండుటచేత ఇచటను వర్తింపచేయవలెను.

## అధ్యాయోక్త విషయసంగ్రహము

తత్ర శ్లోకా :

21. సౌవీరకాదిభిః సప్త సర్పిషా చ రసేన చ
పానకం ప్రేయలేహౌ చ యోగా యూషాదిభిస్త్రయః

22. ద్వౌ శుష్కమత్స్యమాంసాభ్యాం సురైకా ద్వే చ సర్పిషీ
మహావృక్షస్య యోగాస్తే వింశతిః సముదాహృతః

**తాత్పర్యము :** సుధాకల్పమను అధ్యాయమున,

| | |
|---|---|
| సౌవీరకాదులతో యోగములు | 7 |
| ఘృత యోగము | 1 |
| మాంసరస యోగము | 1 |
| పానక యోగము | 1 |
| యూషయోగము | 1 |
| లేహ యోగము | 1 |
| యూషాదులతో యోగములు | 3 |
| మత్స్య మాంసములతో యోగములు | 2 |
| సురా యోగము | 1 |
| ఘృత యోగములు | 2 |
| | 20 |

ఇవన్నియు కలిపి ఇరువది (20) యోగములు అగ్నివేశునిచే చెప్పబడినవి.

**ఆయుర్వేదదీపిక :** 'సౌవీరకాది' మొదలగునవి సంగ్రహమున వివరింపబడినవే.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతేఽప్రాప్తే దృఢబలసంపూరితే కల్పస్థానే సుధాకల్పో నామ దశమోఽధ్యాయః.

అగ్నివేశకృతంబును, చరక ప్రతి సంస్కృతమునైన ఈ చరక సంహిత లభ్యముకాకపోగా దృఢబలసంపూరిత కల్పస్థానమున సుధా కల్పమను దశమాధ్యాయము సమాప్తము.

శ్రీ చక్రపాణిదత్తవిరచితాయాం ఆయుర్వేదదీపికాయాం చరకతాత్పర్యటీకాయాం కల్పస్థానే సుధాకల్పోనామ దశమోఽధ్యాయః.

శ్రీ చక్రపాణి దత్తునిచే రచింపబడిన ఆయుర్వేదదీపిక అనెడు చరక తాత్పర్యటీకయందు కల్పస్థానములో 'సుధాకల్పము' అను పేరుగల పదియవ అధ్యాయము

# ఏకాదశాధ్యాయము

1. అథాతః సప్తలాశఙ్ఖినీకల్పం వ్యాఖ్యాస్యామః
2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః
3. సప్తలా చర్మసాహ్వా చ బహుఫేనరసా చ సా
   శఙ్ఖినీ తిక్తలా చైవ యవతిక్తాఽక్షీ(క్షి) పీడకః

**తాత్పర్యము :** అటు తరువాత సప్తలాశఙ్గినీ కల్పమును వ్యాఖ్యానము చేయగలము ఆత్రేయ భగవానుడు ఈ విధముగా చెప్పెను. సప్తలా, చర్మస్వాహ్వా, బహుఫేనరస అను పర్యాయ నామములు సప్తలా (సంబరేణు?) యును, శఙ్ఖినీ, [C] తిక్తలా, యవతిక్తా, అక్షి(క్షి) పీడక అను పర్యాయ నామములచే శఙ్ఖిణి (దింటెన?) చెప్పబడెను.

**ఆయుర్వేదదీపిక :** క్రిందటి అధ్యాయమున చెప్పబడిన సంబంధము చేతనే సప్తలా శంఖినీ కల్పము చెప్పబడుచున్నది. ఈ అధ్యాయమునందు ఏ ఏ యోగములు చెప్పబడుచున్నవో ఆ యోగములు సప్తలా (లేదా) శంఖినీ (లేదా) రెండింటికి సంబంధించియుండును. శ్యామా, త్రివృత్ యోగముల వలెనే.

## గుణములు - గ్రాహ్య అంగములు

4. తే గుల్మగరహృద్రోగకుష్ఠశోఫోదరాదిషు
   వికాసితీక్ష్ణరూక్షత్వాద్యోజ్యే శ్లేష్మాధికేషు తు

5. నాతిశుష్కం ఫలం గ్రాహ్యం శఙ్ఖిన్యాః నిస్తుషీకృతమ్
   సప్తలాయాశ్చ మూలాని గృహీత్వా భాజనే క్షిపేత్

**తాత్పర్యము :** పైన చెప్పబడిన సప్తల శంఖినులను గుల్మము, విషము, హృద్రోగం, శోషము, ఉదరము మున్నగు క్రూర వ్యాధులయందు ఉపయోగింపబడును. మరియు వికాసి-తీక్ష్ణ-రూక్ష గుణములు కల్గియుండును. కావున శ్లేష్మము అధికముగా కల్గియుండు వ్యాధులలో విశేషముగ ఉపయోగింపబడును. దింటెన చెట్టు నుండి కాయలను అవి పూర్తిగా ఎండియుండునపుడు పై పొట్టువలిచి వదులముగ ఉంచవలెను. సంబరేణు మంచి వేళ్ళను గ్రహించి ఉంచవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'తేగుల్మ' అనువానిచే, 'తే' అనగా సప్తలా శఙ్ఖినులు.

## పదహారు కల్కయోగములు

6. అక్షమాత్రం తయోః పిణ్డం ప్రసన్నాలవణాయుతమ్
హృద్రోగే కఫవాతోత్థే గుల్మే చైవ ప్రయోజయేత్

7. త్రిఫలాపీలుకర్కన్ధుకోలామ్రాతకదాడిమైః
ద్రాక్షాపనసఖర్జూరబదరామ్లపరూషకైః

8. మైరేయా దధిమణ్డేఽమ్లే సౌవీరకతుషోదకే
సీధౌ వాప్యేష కల్పః స్యాత్ సుఖం శీఘ్రవిరేచనః

**తాత్పర్యము :** సంబరేణు, దింటెన ఈ రెంటిని ఒకటిగానైనను, వేరు వేరుగా నైనను సైంధవ లవణమును కూడా చేర్చి మద్యము పైతేటను కూర్చి నూరి ముద్దచేసి యుంచుకొనవలెను ఆ కల్కములో కర్ష ప్రమాణము గ్రహించి మొరళి, వరగోగు, కమ్మరేగు, పెద్దరేగు, అడవిమామిడి, దానిమ్మ, ద్రాక్షపండు, పనస, ఖర్జూరము, పుల్లనిరేగు, చిట్టీత అను నీ 11 ద్రవ్యములలో ఒకదాని కషాయము నందైనను, మైరేయము అను మద్యమునందైనను. పుల్లని పెరుగు పై తేటయందైనను, సౌవీరక తుషోదకముల యందైనను, సీధుమద్యము నందైనను కలిపి త్రాగినచో శీఘ్రముగ సుఖముగా విరేచనమగును. ఈ ఔషధమును హృద్రోగమునందును, కఫవాతములచే కల్గిన రోగమునందును గుల్మమందును ఉపయోగింపదగును.

**ఆయుర్వేదదీపిక :** 'అక్షమాత్రం' అను మొ॥ వానిచే కల్కముయొక్క సురామణ్డము లవణములో కలిపి త్రిఫలా మొ॥ కషాయములందు 16 యోగములు అగుచున్నవి. ఇచ్చట మైరేయము, ఇడుపు (సీధులు) కషాయము కానప్పటికి చాలా కషాయములందు కలిసి యుండుటచే కషాయములుగానే చెప్పవలెను. సంగ్రహము నందు 'కషాయ దశ షట్' అనువానిచేత సూచింపబడినది. కషాయ శబ్దముచేత కల్క కషాయములు అభిప్రేతములు. 'కర్కన్ధుకోలబదర' శబ్దముచే 3 రకముల రేగుపండ్లు గ్రహించవలెను.

## ఆరుతైల యోగములు

9. తైలం విదారిగన్ధాద్యైః పయసి క్వథితే పచేత్
సప్తలాశఙ్ఖినీకల్కే త్రివృచ్ఛ్యామార్ధభాగికే

10. దధిమణ్డేన సన్నీయ సిద్ధం తత్ పాయయేత్ చ
శఙ్ఖినీచూర్ణ భాగౌ ద్వౌ తిలచూర్ణస్య చాపరః

11. హరీతకీకషాయే తైలం తత్పీడితం పిబేత్
అతసీసర్షపైరణ్డకరఞ్జేష్వేష సంవిధః

**తాత్పర్యము :** విదారిగంధాది ద్రవ్యములను చేర్చి క్వాథము చేసి ఆ క్వాథమునకు నాలుగవవంతు తైలమును, సప్తలా-శఙ్ఖినీ కల్కమునకు అర్ధభాగ ముండునట్లు తెల్లతెగడ, నల్లతెగడ కల్కమును చేర్చి తైలమునకు సమభాగముగ పెరుగుమీది తేటను కలిపి తైలపాక విధి ప్రకారము చేసి విరేచనమునకు ఉపయోగించునది. ఇచ్చట సప్తలా-శంఖినీ కల్కమును 2 భాగములు, త్రివృత్, శ్యామా కల్కములు 1 భాగమును చేరిన కల్క సముదాయము తైలమునకు 4వ వంతు ఉండవలెను.

దింటెన చూ॥ 2 భాగములను, నువ్వులపిండి 1 భాగమును కరక కషాయమున కలిపి మర్దనచేసి, అందునుండి తైలమును తీసి ఆ తైలమును విరేచనమునకై త్రాగవలయును. ఈ విధముగానే అతసీగింజలు, ఆవాలు, ఆముదపు గింజలు, కానుగ గింజలు అను ఈ నాలుగింటిలో ఒక్కొక్క దానిని చూర్ణముచేసి నువ్వుల చూర్ణమునకు బదులు కలుపుచు పై విధముగా తైలముతీసి విరేచనమునకై త్రాగవలయును.

**ఆయుర్వేద దీపిక :** "తైలం" మొ॥ వానిచేత మొదటి తైలయోగము. "త్రివృచ్ఛ్యామార్ధభాగికే" అనగా సప్తలా శంఖినీ కల్కమునకు సగభాగముచేత త్రివృత్, శ్యామలా కల్కమును ఇవ్వవలెను. శంఖినీ అను మొ॥ వానిచేత 5 తైల యోగములు చెప్పెను. ఈ విధముగా 6 తైలయోగములు అగుచున్నవి. 'తైలం తత్పీడితమ్' అనగా శంఖినీ చూ॥, తిల చూ॥ను హరీతకీ కషాయముతో కలిపి తీయబడిన (గానుగబట్టిన) ఆ తైలమును త్రాగవలెనని. 'అతస్యాదిష్వేష సంవిధి' అను గ్రంథభాగమువే తిలమునకు బదులు అతసీ మొ॥ వాని ప్రయోగము విధింపబడినది.

## ఎనిమిది ఘృత యోగములు - మూడు లేహయోగములు

### కంపిల్లక యోగము

12. శజ్ఖినీస ప్తలాసిద్ధాత్ క్షీరాద్యదుదిసూద్ఘృతమ్
కల్కభాగే తయోరేవ త్రివృచ్ఛ్యామార్ధసంయుతే

13. క్షీరేణాలోడ్య సంపక్వం పిబేత్తచ్చ విరేచనమ్
దన్తీద్రవన్త్యోః కల్కేఽయమజశృఙ్గ్యజగన్ధయోః

14. క్షీరిణ్యా నీలికాయాశ్చ తథైవ చ కరఞ్జయోః
మసూరవిదలాయాశ్చ ప్రత్యక్పర్ణ్యాస్తథైవ చ

15. ద్వివర్గార్ధాంశకల్కేన తద్వత్ సాధ్యం ఘృతం పునః
శజ్ఖినీస ప్తలాధాత్రీకషాయే సాధయేద్ఘృతమ్

16. త్రివృత్కల్పేన సర్పిశ్చ త్రయో లేహాశ్చ లోధ్రవత్
సురాకమ్పిల్లయోర్యోగః కార్యో లోధ్రవదేవ చ

**తాత్పర్యము :** దింటెనను, సంబరేణును పాలతో కలిపి క్షీర పాకవిధి ప్రకారము పక్వము చేసి, ఆ క్షీరము నందు పైతిని తీసుకుని ఆఘృతం నందు శంఖినీ-స ప్తలా కల్కము 2 భాగములు, ఆ కల్కమునకు అర్ధభాగము త్రివృత్-శ్యామా కల్కమును కలిపి ఘృతమునకు నాలుగింతలు ఆవుపాలను చేర్చి ఘృతపాక విధి ప్రకారము చేయవలెను. ఈ ఘృతమును విరేచనమునకై ఉపయోగించవలెను ఇది ఒక ఘృతయోగము. నేపాళము, పెద్దనేపాళము, వాయింట, దుష్టపువేరు, పాల గుమ్మడి, నీలి, కానుగ, కలుకానుగ, నల్లతెగడ, ఉత్తరేణి- ఈ చెప్పిన ద్రవ్యముల వరుసలో రెండేసి ద్రవ్యములను కల్కముచేసి ఈ కల్కమునకు రెట్టింపు శంఖినీ సప్తలా కల్కమును కల్పించి పై యోగమున చెప్పిన రీతిగా శంఖినీ-సప్తలా సిద్ధమైన క్షీరమునుండి తీయబడిన ఘృతమున కలిపి ఆవుపాలను చేర్చి పై చెప్పిన విధంగానే ఘృత పాక విధి ప్రకారము 5 ఘృతములను సిద్ధము చేయవలెను. మరియు దింటెన, సంబరేణు, ఉసిరికాయలు ఈ మూడిటిని కషాయము చేసి నాల్గవ వంతు ఘృతమును, ఘృతమునకు నాల్గవ వంతు శంఖినీ సప్తలా కల్కమును కలిపి ఘృత పాక విధి ప్రకారము ఘృతమును సిద్ధము చేయవలెను. మరియు త్రివృత్కల్పమును

చెప్పిన ప్రకారము తెగడకు బదులు దింతెన-సంబరేణువును చేర్చి ఘృతమును చేయునది. తిల్వక కల్పమునందు చెప్పబడిన కల్పము ననుసరించి లొద్దుగ బదులు దింతెనను, సంబరేణువును చేర్చుకొనుచు లేహయోగములు మూడింటిని సిద్ధము చేసుకొనవలెను. మరియు లోధ్రకల్పమున చెప్పబడిన సురాకల్పమును అనుసరించి లొద్దుగను బదులు దింతెన-సంబరేణును చేర్చుచు సురాయోగమును సిద్ధము చేయవలెను. ఆ విధముగానే కమ్పిల్లకమను గంధద్రవ్యమును విధ్యుక్త ప్రకారము క్వాథము చేసి, అందు సంబరేణు, దింతెనల చూ॥ను పదిమార్లు భావన చేసి, ఆ చూర్ణమును కంపిల్లక కషాయానుపానముననే త్రాగవలయును.

**ఆయుర్వేదదీపిక :** 'శఙ్ఖినీసప్తలా' అని మొ॥ వానిచే మొదటి ఘృతము, 'దన్తీద్రవన్త్యో' అనువానిచే రెండు, రెండు ద్రవ్యకల్కములచే సప్తలా శంఖినీ కల్కమున అర్థభాగముచే పూర్వము చెప్పబడిన విధముగా ఘృతపాకము చేయవలెను. మరియొకదానితో 5 ఘృతయోగములు. అజశృఙ్గీ అనగా విషాణికా. క్షీరిణీ అనగా దుగ్ధికా. మసూరవిదలా అనగా శ్యామలతా. ప్రత్యక్పర్ణీ అనగా మూషికపర్ణీ 'ద్వివర్గార్ధాంశకల్కేన' అనగా దన్తీ మొ॥ రెండువర్గముల (చెందిన) శంఖినీసప్తలా యొక్క అర్థభాగ కల్కముచే. 'శఙ్ఖినీ' అను మొ॥ వానిచే 7వ ఘృతము, 'త్రివృత్కల్కేన' అను మొదలగువానిచే 8వ ఘృతము. ఇచ్చట సప్తలా-శఙ్ఖినీల రెండురెట్లు కషాయము చెప్పబడుచున్నది. 'లోధ్రవత్' అనగా లోధ్ర కల్పమువలె, లోధ్రకల్పమునందు 3 లేహములు, 'చతురఙ్గుల కల్పేన' అను మొ॥ వానిచే చెప్పబడినది దానిచే లోధ్రకు బదులు సప్తలా, శఙ్ఖినీ యోగము చేయవలెను. అదే విధముగా సురాయోగము, కమ్పిల్ల యోగమును లోధ్రము వలె ఇక్కడకూడా లోధ్రకు బదులు సప్తలా శఙ్ఖినీలను వేయుట చేయవలెను.

## అయిదు సంధానయోగములు

17. దన్తీ ద్రవన్త్యోః కల్పేన సౌవీరకతుషోదకే
అజగన్ధాజశృఙ్గ్యోశ్చ తద్వత్ స్యాతాం విరేచనే

**తాత్పర్యము :** దన్తీద్రవంతీ కల్పమున "అజగంధాకషాయేణసౌవీరకే తుషోదకే" అని చెప్పబడిన ప్రకారము సంబరేణు దింతెనల కషాయమును దంతీ ద్రవంతీ కషాయమునకు బదులుగా చేర్చి సౌవీరకము, తుషోదకమును కల్పింపసగును.

మరియు 'తథాదంతీద్రవన్త్యోశ్చ ·· ··· ' అని చెప్పబడిన అరిష్ట కల్పముననుసరించి అరిష్ట యోగములు సిద్ధము చేయవలెను సంబరేణు దింటెనలను, వాయింటను చేర్చి కషాయము కాచి, ఒక కుండకు లోభాగమున పిప్పలి మున్నగువాని కల్కమును లేపనము చేసి, పై కషాయమును బోసి బెల్లమును చేర్చి మూతమూసి చీలమన్ను పూసి సంధాన విధి ప్రకారముంచవలెను. ఇది ఒక అరిష్టము. మరియు సంబరేణు దింటెనలతో దుష్టపు వేరును చేర్చి కషాయము కాచి సంధాన విధి ప్రకారముంచ వలెను. ఇది రెండవ అరిష్టము.

**ఆయుర్వేదదీపిక:** 'దన్తీద్రవన్త్యో' అను మొ॥ వానిచే సంధాన చతుష్టయము చెప్పెను. ఈ సంధాన చతుష్టయము, ముందు చెప్పిన సురాయోగముతో కలిపి 'పఞ్చమద్యే' అను వచనముచే సంగ్రహమునందు గ్రహించబడినది. 'సౌవీరకము' మొ॥ వానిని కూడ సూతత్వ లక్షణము వలన మద్య శబ్దము చేత తెలియబడునని తెలిసికొనదగినది. 'దన్తీద్రవన్త్యోకల్పేన' అనగా చెప్పబోవు దన్తీ ద్రవన్తీకల్పము నందు, సౌవీరక తుషోదకములందు ఏ విధానము చెప్పబడునో ఆ విధానము ఇచ్చట కూడా వర్తింపును. అక్కడ 'అజగన్ధాకషాయేఽ సౌవీరకతుషోదకే' (క స్థా. అ.12) అని చెప్పదగియున్నది. దానిచేత ఇక్కడ కూడా అజాగన్ధకయుక్త సప్తలా శజ్ఖి నేలతో సౌవీరక తుషోదకములందు చేయవలెను. ఇచ్చట "తథా దన్తీద్రవన్త్యోశ్చ కషాయే సాజగన్ధయోః, గౌడః కార్యోఽజశ్ళఙ్గ్యాచ సప్తైః సుఖవిరేచనః" (క.అ.12) అను ఈ విధముగా గౌడారిష్టకు చెప్పబడిన దన్తీ ద్రవన్త్యో కల్పము యొక్క విధానము వర్తించును.

## అధ్యాయ విషయసంగ్రహము

తత్ర శ్లోకా—

18. కషాయా దశ షట్ చైవ షట్ తైలేఽష్టౌ చ సర్పిషి
పఞ్చ మద్యే త్రయో లేహ యోగః కమ్పిల్లకే తథా

19. సప్తలాశజ్ఖినీభ్యాం తే త్రింశదుక్తా నవాధికాః
యోగాః సిద్ధాః సమస్తాభ్యామేకశోఽపి చ తే హితాః

**తాత్పర్యము :** ఈ విధముగా 16 కషాయ యోగములు, 6 తైల యోగములు, 8 ఘృతయోగములు, 5 మద్యయోగములు, 3 లేహ యోగములు, కంపిల్లకంతో ఒక యోగము చేరి 39 విరేచనౌషధములు సంబరేణు, దింటెనలను ఉద్దేశించి

ఈ అధ్యాయమున చెప్పబడినవి. ఈ యోగములను ఈ రెంటిని కూర్చియైనను, ఒక్కొక్క దానిని కూర్చియైనను సిద్ధము చేసి ఉపయోగించినచో మిక్కిలి హిత కరములుగా నుండును.

ఆయుర్వేదదీపిక : 'కషాయ' అను మొదలగు సంగ్రహము వ్యాఖ్యా నించబడినది.

సప్తలా శఙ్ఖిని కల్ప అధ్యాయమున—

| | |
|---|---|
| కషాయయోగములు | 16 |
| తైల యోగములు | 6 |
| ఘృత యోగములు | 8 |
| మద్యయోగములు | 5 |
| లేహ యోగములు | 3 |
| కంపిల్లకముతో యోగము | 1 |
| | 39 |

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతేఽప్రాప్తే దృఢబలసంపూరితే కల్పస్థానే సప్తలాశఙ్ఖినీకల్పో నామ ఏకాదశాధ్యాయః.

ఈ విధముగా లభ్యముగాక పోవుటచే అగ్నివేశకృతంబును, చరక ప్రతి సంస్కృతము అగు చరక సంహిత యందలి దృఢబల సంపూరిత కల్పస్థానమున సప్తలాశఙ్ఖినే కల్పమనునది ఏకాదశాధ్యాయము సమాప్తము.

శ్రీ చక్రపాణిదత్తవిరచితాయామాయుర్వేదదీపికాయాం చరకతాత్పర్యటీకా- యాం కల్పస్థానే, సప్తలాశఙ్ఖినీకల్పో నామైకాదశోఽధ్యాయః

శ్రీ చక్రపాణి దత్తునిచే రచింపబడిన 'ఆయుర్వేదదీపిక' అనెడు చరక తాత్పర్య టీకయందు కల్పస్థానములో "సప్తలాశఙ్ఖినీకలము" అనుపేరు గల పదకొండవ అధ్యాయము.

—0—

# ద్వాదశాధ్యాయము

root - resemble

1. అథాతో దన్తీద్రవన్తీకల్పం వ్యాఖ్యాస్యామః

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః

అటు తరువాత దన్తీద్రవన్తీ కల్పమును వ్యాఖ్యానము చేయగలము. ఆత్రేయ భగవానుడు ఈ విధముగా చెప్పెను.

## దన్తీ-ద్రవన్తీల పర్యాయ నామములు

3. దన్త్యుదుమ్బరపర్ణీ స్యాన్నికుమ్భో౽థ ముకూలకః
ద్రవన్తీనామతశ్చిత్రా న్యగ్రోధీ మూషికాహ్వయా
(తథా మూషికపర్ణీ చోప్యుపచిత్రా చ శమ్బరీ
ప్రత్యక్శ్రేణీ సుతశ్రేణీ దన్తీ ర(చ)ణ్డా చ కీర్తితా)

**తాత్పర్యము :** దంతి* ఉదుంబరపర్ణీ, నికుంభము, ముకూలకము అను పర్యాయ నామములచే చెప్పబడును. చిత్రా, న్యగ్రోధీ, మూషికపర్ణీ (ఎలుకకు కల పేర్లన్నియు దీనికి వర్తించును), ఉపచిత్ర, శాంబరి, ప్రత్యక్శ్రేణి, సుతశ్రేణి, దంతీ, రండ, చండ అను పర్యాయనామములచే ద్రవన్తీ చెప్పబడును.

**ఆయుర్వేదదీపిక :** దన్త్యాది శ్లోకములతో ఆ రెంటి పర్యాయ నామములు చెప్పెను.

## గ్రాహ్య అంగములు

4. తయోర్మూలాని సంగృహ్య స్థిరాణి బహూలాని చ
హస్తిదన్తప్రకారాణి శ్యావతామ్రాణి బుద్ధిమాన్

**తాత్పర్యము :** పై చెప్పిన రెండింటిలో చిట్టి ఆముదము (వేరు) అనగా దన్తీ శ్యామవర్ణముగను, పెద్ద నేపాళము (వేరు) అనగా ద్రవన్తీ తామ్ర వర్ణముగను వుండును. బుద్ధిమంతుడగు వైద్యుడు దన్తీ, ద్రవంతులయొక్క స్థిరములైన, ఏనుగు

---

* దన్తీని చిట్టి ఆముదమని, ద్రవన్తీని నేపాళముగాను కొందరు పిలుస్తారు. వివరములకు పరిశిష్టము చూడవలెను.

దంతములతో సమానమైన ప్రమాణము కలవానియొక్క మూలములను సంగ్రహించు కొనవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'స్థిరాణి' అనగా సారవంతములైనవి అని అర్థము. 'బహలాని' అనగా దృఢమైన త్వక్ (బెరడు) కలవి. 'హస్తిదన్త ప్రకారిణి' అనగా ఏనుగు దంతమువలె మూల భాగమున లావుగా ఉన్నదియు, లో భాగము కూడా గట్టిగా వున్నటువంటి అని అర్థము. 'శ్యావతామ్రాణి' అనగా యథా క్రమముగ దన్తి వేర్లు శ్యామవర్ణముగలవి, ద్రవన్తి వేర్లు తామ్రవర్ణము గలవి అని అర్థము.

## ప్రయోగవిధి

5. పిప్పలీమధులిప్తాని స్వేదయేన్మృత్కుశాన్తరే
శోషయేదాతపేఽగ్నిర్కో హతో హ్యేషాం వికాశితామ్

**తాత్పర్యము :** సంగ్రహించిన మూలములపై పిప్పళ్ళను, అతి మధుర మును (లేదా తేనె) నూరి కల్కముచేసి పూసి, పైన దర్భలను చుట్టి దానిపై మట్టిని లేపము చేయవలెను పిదప దానిని అగ్నియందు స్వేదనము చేసి, ఎండన ఎండించ వలెను. అట్టి అగ్నిసంబంధము వలన, ఎండనెండించుట ద్వారా దన్తి, ద్రవన్తి మూలములయొక్క 'వికాశి' గుణము నశించును.

**వికాశి పరిభాషా :** ఏ ద్రవ్యమైతే ధాతువులనుండి ఓజస్సును విభజించి సంధి బంధములను శిథిలము చేయునో దానిని వికాశి అందురు. ఉదా : క్రముకము, కోద్రవము.

డల్లణాచార్యుడు వికాశి, వ్యవాయి గుణముల భేదములను తెలుపుచూ వికాశి ద్రవ్యము పాకము చెందకుండగనే శరీరమును వ్యాపించి ధాతుశైథిల్యము కావించు నని వివరించెను. చరకుడు మద్య గుణములను వివరిస్తూ, మద్యము యొక్క వ్యవాయి, వికాశి గుణములు వరసగా ఓజస్సు యొక్క స్థిర, శ్లక్ష గుణములను నశింపజేయునని పేర్కొనుటచే ప్రాయశః వ్యవాయి, వికాశి ద్రవ్యముల రెండింటినీ ఓజోనాశకములుగా పరిగణించవచ్చును.

**ఆయుర్వేదదీపిక :** 'స్వేదయేన్మృత్కుశాన్తరే' అనగా పిప్పలీ, మధుక కల్కముచే లేపము చేసి, కుశము (దర్భ)లచే చుట్టి తరువాత మన్ను పూసి వాటిని

స్వేదనముచేయవలెను."అగ్న్యర్కా హతో హ్యేషాం వికాశితామ్"అనువానిచే అగ్ని, స్వేద, ఆతపశోషణ ఫలములు చెప్పెను. ఈ దన్తీ ద్రవన్తీ మూలములయొక్క వికాశిత లక్షణము, గుణము అగ్ని, అర్కము(ఎండ)ల యొక్క స్వేద, శోషముల ద్వారా నశించును. దానివలన దన్తీ ద్రవన్తీ మూలములు ఎక్కువ దోష యుక్తము గాకుండా ఉండునని భావము.

## దన్తీ-ద్రవన్తీల గుణములు

6. తీక్ష్ణోష్ణాన్యాశుకారీణి వికాశీని గురూణి చ
విలాయయన్తి దోషౌ ద్వౌ మారుతం కోపయన్తి చ

**తాత్పర్యము :** దన్తీ, ద్రవన్తులు రెండునూ తీక్ష, ఉష్ణ, గురు గుణములను, ఆశుకారిత్వమును, వికాశిత్వమును కలిగియుండును. పిత్త-కఫములను విలీన పరచును. వాతమును ప్రకోపింపచేయును.

**ఆయుర్వేదదీపిక :** 'తీక్ష్ణోష్ణాని' అను మొదలగువానిచే వాని గుణములు చెప్పుట. 'దోషాద్వౌ' అనగా పిత్త, శ్లేష్మలు.

## దన్తీ-ద్రవన్తీలతో ఏడు కల్కయోగములు-మూడు మాంసరస యోగములు-మూడు స్నేహయోగములు-మూడు లేహ యోగములు

7. దధితక్రసురామణ్డైః పిండమక్షసమం తయోః
ప్రియాలకోలబదరపీలుశీధుభిరేవ చ

8. పిబేద్గుల్మోదరీ దోషైరభిభిన్నశ్చ యో నరః
గోమృగాజరసైః పాణ్డుః కృమికోష్ఠీ భగన్దరీ

9. తయోః కల్కే కషాయే చ దశమూలరసాయుతే
కణ్ఠ్యాలజీవిసర్పేషు దాహే చ విపచేద్ఘృతమ్

10. తైలం మేహే చ గుల్మే చ సోదావర్తా కఫానిలే
చతుఃస్నేహం శకృచ్ఛుక్రవాతసఙ్గానిలార్తిషు

11. రసే దన్త్యజశృఙ్గ్యోశ్చ గుడక్షౌద్రఘృతాన్వితః
లేహః సిద్ధో విరేకార్థే దాహసంతాపమేహనుత్

12. వాతతష్టే జ్వరే పైత్తే స్యాత్ స ఏవాజగన్ధయా
దన్తీద్రవన్త్యోర్మూలాని పచేదామలకీరసే

13. త్రింస్తు తస్య కషాయస్య భాగౌ ద్వౌ ఫాణితస్య చ
తప్తే సర్పిషి తైలే వా భర్జయేత్తత్ర చావపేత్

14. కల్కం దన్తీద్రవన్త్యోశ్చ శ్యామాదీనాం చ భాగశః
తత్సిద్ధం ప్రాశయేల్లేహం సుఖం తేన విరిచ్యతే

**తాత్పర్యము :** పై చెప్పిన విధముగా స్వేదనము చేసి, ఎండింపబడిన దన్తీ ద్రవన్తీ మూలములను నూరి ముద్దచేసి, అందొక కర్ష మాత్రము గ్రహించి పెరుగుతోనైనను, మజ్జిగ తేటతోనైనను, సురామద్యము యొక్క తేటతోనైననూ కలిపి త్రాగవలెను. మరియు ప్రియాల (మొరళి) బదర (రేగు) కోల (పెద్దరేగు) పీలు (వరగోగు) శీధు మద్యము వీనిలో దేనితోనైననూ ఇచ్చిన యెడల గుల్మము, ఉదర రోగములు శమించును. మరియు మిక్కిలి దోషప్రకోపము కలిగినపుడు యుక్తముగ నుండును. మరియు దన్తీ ద్రవన్తీ కల్కమును గోమాంస రసముతో నైననూ, జింక మాంసరసముతోనైననూ, మేకమాంస రసముతోనైననూ కలిపి పాండురోగము కలవారు, కోష్ఠమును క్రిములు చేరియున్నవారు, భగంధర పీడితులు త్రాగవలెను.

దన్తీ ద్రవన్తుల కల్కమును వాని కషాయమును దశమూలముల రసమున ఘృతమును చేర్చి స్నేహపాక విధి ప్రకారము పక్వము చేసి కక్ష, అలజి, విసర్పము అను రోగముల యందు విరేచనమునకై ఉపయోగింపవలెను. మరియు తైలము నందును దశమూల రసమును, దంతీ ద్రవంతీ కల్కమును వాని కషాయమును కూర్చి పక్వము చేసి ప్రమేహము నందును, గుల్మము నందును, ఉదావర్తము నందును, కఫవాత రోగములందును విరేచనమునకై ఉపయోగింపవలెను. ఈ విధముగనే స్నేహ చతుష్కమును దంతీ ద్రవంతులతో సిద్ధము చేసి, మల, శుక్ర-వాత బంధము నందును. వాత రోగముల యందును విరేచనమునకు ఉపయోగింపవలెను. దంతీ వేళ్ళను, దుష్టపు తీగె వేళ్ళను స్వరసము చేసి అందు తేనెను, బెల్లమును, ఆవు నేతిని చేర్చి సిద్ధము చేయబడిన లేహమును దాహము, సంతాపము, ప్రమేహము అను ఈ రోగములందు విరేచనమునకై ఉపయోగించిన శమించును. మరియు దన్తీ వేళ్ళను, వాయింట వేళ్ళను చేర్చి స్వరసం చేసి బెల్లమును, తేనెను, నేతిని కలిపి సిద్ధము చేయబడిన లేహమును వాతముచే కలిగిన దప్పి యందును, పిత్త

జ్వరము నందును, విరేచనమునకై ఉపయోగింపవలెను. దన్తీ యొక్క, ద్రవన్తీ యొక్క వేళ్ళను ఉసిరికాయ రసమున ఉంచి కాచవలెను ఆ కషాయము 3 భాగములును, ఫాణితము 2 భాగములును చేర్చి కాగుచున్న నేతియందైనను, నూనెయందైననూ పోసి పక్వము చేయుచు అందు దంతీ, ద్రవంతుల కల్కమును, నల్లతెగడ మున్నగు ద్రవ్యములను ప్రత్యేకం ఒక్కొక్క భాగము వంతున కూర్చి కల్కము చేసి లేహపాక విధి ప్రకారము సిద్ధము చేయవలెను. ఈ లేహమును సేవించినచో సుఖముగ విరేచనమగును.

**ఆయుర్వేదదీపిక :** 'దధి' అను మొదలగు వానిచేత ఏడు ద్రవ్యములతో ఏడు ప్రయోగములను చెప్పెను. శీధు శబ్దము ప్రియాల మొదలగు నాలుగు ద్రవ్యములతో వేరుగా సంబంధించి యుండును. 'అభిజీన్న' అనగా ఆక్రాన్తము చెందిన అని అర్థము. 'గోమృగాజరసై' అను ఈ చోట కూడా 'పిణ్డమక్షసమం తయో' అనునది వర్తించును. ఇచ్చటను ఆవు మొదలగు ఈ మూడు రసములచే మూడు యోగములు అగుచున్నవి. 'తయో' అను మొదలగు వానిచేత 3 స్నేహ యోగములు చెప్పెను. ఈ కల్క కషాయముచే దశమూల రసమునకు ఘృతమును సమభాగములుగా వేసి విసర్పాది వ్యాధులందు పానము చేయవలెను. తైలమును పూర్వము వలెచేసి మేహాదులందు. చతుః స్నేహములు (ఘృతము, తైలము, మజ్జా, వసా) పురీష-శుక్ర-వాత అవరోధములందు ఉపయుక్తము. 'రసే' అను మొదలగువానిచే ఒక లేహము. 'వాతతర్షే' అను మొదలగువానిచే రెండవది. 'స ఏవాజగన్ధయో' అనుదాని చేత పూర్వోక్తలేహమువలె 'అజశృఙ్గీ'కి బదులు అజగన్ధము చేర్చుటను విశిష్టముగా చెప్పుచున్నాడు. "దన్తీ" అను మొదలగువానిచే మూడవ లేహము. "భాగశః" అనగా ప్రత్యేకముగా భాగమును గ్రహించుట. ఇట్లే చివరి ప్రయోగములతో మొదటి 16 యోగములు అగును.

### మూడు లేహయోగములు-చూర్ణయోగము-ఇక్షుయోగము-
### మూడురసయోగములు - మూడు యవాగ్వాదియోగములు

15. రసే చ దశమూలస్య తథా బైభీతకే రసే
హారితకీరసే చైవ లేహానేవం పచేత్ పృథక్

16. తయోర్బిల్వసమం చూర్ణం తద్రసేనేవ భావితమ్
అస్పృష్టే విశి వాతోర్తే గుల్మే చామ్లయుతం శుభమ్

17. పాటయిత్వేక్షుకాండం వా కల్కేనాలిప్య చాన్తరా
స్వేదయిత్వా తతః ఖాదేత్ సుఖం తేన విరిచ్యతే

18. మూలం దన్తీద్రవన్త్యోశ్చ సహ ముద్గైర్విపాచయేత్
లావవర్తీరకాద్యైశ్చ తే రసాః స్యుర్విరేచనే

19. తయోర్వాఽపి కషాయేణ యవాగూం జాఙ్గలం రసమ్
మాషయూషం చ సంస్కృత్య దద్యాత్తైశ్చ విరిచ్యతే

**తాత్పరము :** దంతీ, ద్రవన్తీ మూలములను కషాయము నందైననూ, తానికాయల కషాయమునందైనను, కరకకాయల కషాయము నందైనను పక్వము చేసి, ఆ కషాయమును 3 భాగములను, చక్కెర పాకమును 3 భాగములు చేర్చి కాగిన నేతియందైనను, నూనెయందైనను చేర్చి దన్తీ ద్రవన్తీ మూలములను, నల్ల తెగడ మున్నగువానిని ఒక్కొక్క భాగమున కల్కము చేసి కలిపి లేహవిధి ప్రకారము లేహములు మూడింటిని సిద్ధము చేయవలెను. పైన చెప్పిన లేహ యోగములు మూడును చేరి ఆరు యోగములగును. దన్తీ ద్రవన్తీ మూలములను చూర్ణమును చేసి, ఆ చూర్ణమును ఒక పలప్రమాణమున గ్రహించి, దన్తీ ద్రవన్తీ మూల కషాయముననే విద్యుక్త ప్రకారము భావనచేసి ఆ చూర్ణమును దానిమ్మరసము మున్నగు పుల్లని రసములలోకలిపి మలబంధము నందు, వాతముచే కల్గిన గుల్మము నందు విరేచనమునకై త్రాగవలెను.

దన్తీ, ద్రవన్తీ మూలములను కల్కము చేసి, ఆ కల్కమును ఒక చెరుకు తుంటను చీల్చి, దానిలో భాగమున దట్టముగ పూసి, నిప్పుసెగన ఉడికించి, ఆ చెర కును నమిలి, రసమును మ్రింగినచో సుఖముగ విరేచనమగును. దన్తీ ద్రవన్తీ మూల ములను పెసరపప్పుతో చేర్చి యూషపాక విధిప్రకారము కాచి, ఆ రసమున లావుక పిట్ట, వార్తీరకము మున్నగు విష్కిరజాతిలో చేరిన ఎనిమిది పక్షులలో ఒక్కొక్క దాని మాంసరసమున కలిపి, పక్వము చేసి త్రాగినచో సుఖముగ విరేచనమగును. దన్తీ ద్రవన్తీ ద్రేళ్ళమ విద్యుక్త ప్రకారముకాచి. ఆ కషాయముచేత యవాగును, జాంగల మాంస రసమును మాష (మినప)చే చేయబడిన యూషను సిద్ధముచేసి విధిప్రకారము సంస్కరించి త్రాగినచో సుఖముగా విరేచనమగును.

**ఆయుర్వేద దీపిక :** 'రసేచ' అనుదాని యందు 'ఏవం' అనుదాని వలన పూర్వము చెప్పబడిన మూడు లేహములు యిచ్చట వర్తించును. 'తయో' అను

మొదలగునది నాల్గవది. 'తయో' అనగా దన్తీ ద్రవన్తీ మూలములకు. 'అస్పృష్టే' అనగా విబద్ధమునందు అని అర్థము. 'పాటయిత్వా' అను మొదలగు వానిచే అయిదవది. 'కల్కే నాలిప్య చాన్తరా' అనగా దన్తీ ద్రవన్తీ కల్కమును చీల్చబడిన చెరకుగడ మధ్యభాగమును పూసి అని అర్థము. 'మూలందన్తీ' అను ఎనిమిది కృత, అకృత రసములను చెప్పెను. ఇచ్చట "లావవర్తీరకాదయః' —

లావో వర్తిరికశ్చైవ వర్తీకః సకపిఞ్జలః
చకోరశ్చోపచక్రశ్చ కకుభో రక్తచర్మకః (సూ. స్థా. 27)

లావుకపక్షి, వతీరక అనెడి పక్షి, వార్తీకపక్షి, కపింజలపక్షి, చకోరపక్షి, ఉపచక్రపక్షి, ఎర్రనిగువ్వ, లావుకపక్షి అనునది విష్కిరము లనబడును. ఈ శ్లోకముచే ఎనిమిది చెప్పబడినవి. వానిచే ప్రతియోగము వలన ఎనిమిది రసములు అగుచున్నవి. 'తయోర్వాపి' అను మొదలగువానిచేత యవాగు, జాంగల రసయోగము, మాషయూష యోగమును చెప్పెను. ఈ విధముగా ఈ ద్రవములచే పూర్వ యోగములను కలుపుకొని రెండవ పదునారు యోగములు అగును.

## ఉత్కారికా యోగము - మోదకయోగము - మద్యయోగము - భక్ష్యయోగము-చూర్ణయోగము - మోదకయోగము-కషాయయోగము- కల్కయోగము ఐదు ఆసవయోగములు - ఒక్కొక్క సౌవీరక, తుషోదక, సురా, కంపిల్లక యోగములు

20. తత్కషాయాత్త్రయో భాగా ద్వౌ సితాయా స్తథైవ చ
ఏకో గోధూమచూర్ణానాం కార్యా చోత్కారికా శుభా

21. మోదకో వాఽస్య కల్కేన కార్య స్తచ్చ విరేచనమ్
తయోశ్చాపి కషాయేణ మద్యాన్యప్యుపకల్పయేత్

22. దన్తీక్వాథేన చాలోడ్య దన్తితైలేన సాధితాన్
గుడలావణికాన్ భక్ష్యాన్ వివిధాన్ భక్షయేన్నరః

23. దన్తీం ద్రవన్తీం మరిచం యవానీముపకుంచికామ్
నాగరం హేమదుగ్ధాం చ చిత్రకం చేతి చూర్ణితమ్

24. సప్తాహం భావయేన్మూత్రే గవాం పాణితలం తతః
పిబేద్ఘృతేన జీర్ణే తు విరిక్తశ్చాపి తర్పణమ్
25. సర్వరోగహరం ముఖ్యం సర్వేష్వృతుషు యౌగికమ్
చూర్ణం తదనపాయిత్వాద్బాలవృద్ధేషు పూజితమ్
26. దుర్బలక్తాజీర్ణపార్శ్వార్తిగుల్మప్లీహోదరేషు చ
గణ్డమాలాసు వాతే చ పాణ్డురోగే చ శస్యతే
27. పలం చిత్రకదన్త్యోశ్చ హరీతక్యాశ్చ వింశతిః
త్రివృత్పిప్పలికర్షే ద్వే గుడస్యాష్టపలేన తత్
28. వినీయ మోదకాన్ కుర్యాద్దశైకం భక్షయేత్తతః
ఉష్ణామ్బు చ పిబేచ్చాను దశమే దశమేహ్ని చ
29. ఏతే నిష్పరిహారాః స్యుః సర్వరోగనిబర్హణాః
గ్రహణీపాణ్డురోగార్శఃకణ్డూ కోఠానిలాపహాః
30. దన్తీద్వీపలనిర్యూహో ద్రాక్షార్ధప్రస్థసాధితః
విరేచనం పిత్తకాసే పాణ్డురోగే చ శస్యతే
31. దన్తీకల్కం సమగుడం శీతవారియుతం పిబేత్
విరేచనం ముఖ్యతమం కామలాహరముత్తమమ్
32 శ్యామాదన్తీరసే గౌడః పిప్పలీఫలచిత్రకైః
లిప్తేఽరిష్టోఽనిల శ్లేష్మప్లీహ పాణ్డూదరాపహః
33. తథా దన్తీ ద్రవన్త్యోశ్చ కషాయే సాజగన్ధయోః
గౌడః కార్యోఽఽజశృఙ్గ్యా వా స వై సుఖవిరేచనః
34. తచ్చూర్ణక్వాథమాషామ్బుకిణ్వతోయసముద్భవా
మదిరాకఫగుల్మాల్పవహ్నిపార్శ్వకటిగ్రహే
35. ~~అజగన్ధాకషాయేణ సౌవీరకతుషోదకే~~
సురాకమ్పిల్లకే యోగా లోధ్రవచ్చ తయో స్మృతా



**తాత్పర్యము :** దన్తీ ద్రవన్తీ మూలములను క్వాథము చేసి, ఆ కషాయము 3 భాగములును, చక్కెర 2 భాగములును, గోధుమపిండి 1 భాగమును చేర్చి, మర్దన చేసి, ఉత్కారికా అను ఒక అపూప విశేషమును చేయవలెను. మరియు పైరీతిగా గోధుమపిండి మున్నగువానిని మోదకముగానైననూ చేయదగును. ఈ

దన్తీ ద్రవన్తీ మూల కషాయమును సంధానవిధి ప్రకారము మద్యముల సిద్ధము చేసి విరేచనమునకై ఉపయోగింపవలెను.

దన్తీ ద్రవన్తీ కషాయమున గోధుమపిండి మున్నగువానిని కలిపి అందు బెల్లమునైనను, లవణమునైనను కలిపి దంతీ, ద్రవంతుల తైలమున భక్ష్య విశేషములుగ సిద్ధము చేసి భక్షించిన యెడల సుఖముగ విరేచనములగును. దంతీ-ద్రవంతీ మూలములు, మిరియములు, ఓమము, నల్లజీలకర్ర, శుంఠి, స్వర్ణక్షీరి, చిత్రమూలము, వీటినన్నింటిని సమభాగములుగ చేర్చి చూర్ణము చేసి గోమూత్రమున 7 దినములు భావన చేయవలెను. ఆ చూర్ణము కర్ష ప్రమాణమున ఆవునేతితో కలిపి త్రాగవలెను. అది జీర్ణమై విరేచనములైన పిదప సత్తుపిండి మొదలగు సంతర్పణ ఆహారమును సేవింపవలయును. ఈ చూర్ణ యోగము రోగముల నన్నింటిని హరించి, ఏ విధమైన అపాయము లేక విరేచనములు చేయును గాన బాలురకును, వృద్ధులకును సేవించుటకు యుక్తమైనది. మరియు ఆహారపదార్థ వ్యత్యాసముచే కల్గిన రోగములందును, అజీర్ణము నందును, పార్శ్వశూల యందును, గుల్మము, ప్లీహము, ఉదరము, గండమాల, వాతరోగము, వాతరక్తము పాండురోగము అను ఈ రోగములందు విరేచనమునకై ఉపయోగించుట మిక్కిలి శ్రేష్టమై యుండును. చిత్రమూలము దన్తీమూలము చేరి ఒక పలము, 20 కరక్కాయలు, తెగడ మరియు పిప్పళ్ళు, రెండు రెండు కర్షములు వీనినన్నింటిని చూర్ణము చేసి 8 పలముల బెల్లమును కలిపి పక్వము చేసి 11 ఉండలుగ చేయవలెను. వానిలో ఒక్కొక్క ఉండను వేడినీళ్ళ అనుపానముతో సేవించవలెను. పిమ్మట మిగిలిన 10 ఉండలు పదేసి దినములు ఒక్కొక్కటి వంతున పైరీతిగ సేవించవలెను. ఈ మోదకమును సేవించునపుడు వర్జ్యములు లేవు. (అనగా ఇచ్ఛా పథ్యముగా సేవించవచ్చును.) మరియు గ్రహణీ, పాండురోగము, అర్శోరోగము, కణ్డు, మండలకుష్ఠము అను ఈ రోగములను హరించును. రెండు పలముల దంతి మూలములను చేర్చి కషాయము చేసి అందు అర్ధ ప్రస్థము ద్రాక్ష పండ్లను చేర్చి ఆసవకల్పనావిధి ప్రకారము ఆసవమును సిద్ధము చేసి త్రాగించినచో సుఖముగ విరేచనము అగును. ఇది పిత్తకాసము నందును, పాండు రోగమునందును ప్రశస్తముగ నుండును. దన్తీమూల కల్కమునకు సమభాగము బెల్లమును చేర్చి చల్లని నీళ్ళలో కలిపి ఆసవసంధాన విధి ప్రకారము భూస్థాపితం చేసి సిద్ధము చేయవలెను. ఇది మిక్కిలి ముఖ్యమైన విరేచనౌషధము. కామలా రోగమును హరించుటకు ఉత్తమమైనది నల్లతెగడ, దన్తీమూలములు

సమభాగములుగ చేర్చి క్వాథము చేసి, బెల్లముతో కలిపి ఉంచుకొని, పిప్పళ్ళను, చిత్రమూలమును మెత్తగా నూరి అరిష్ట సంధాన విధి ప్రకారము సిద్ధము చేయవలెను. ఈ అరిష్టమును సేవించినచో వాతకఫమును, ప్లీహ, పాండు రోగములను, ఉదరమును హరించును. దన్తీ, ద్రవన్తీ మూలములు, వాయింట వేరును చేర్చి క్వాథము చేసి, పిప్పళ్ళను చిత్రమూలమును నూరి అరిష్ట సంధాన విధి ప్రకారము లోభాగము పూయ బడిన కుండలో పోసి అరిష్టమును సిద్ధము చేసుకొనవలెను. మరియు దన్తీ ద్రవన్తీ మూలమును చూర్ణము చేసి అందు దన్తీ ద్రవన్తీ క్వాథమును, మినుముల కషాయ మును చేర్చి సురాబీజముగ చేసుకొని జలముచే మదిరా కల్పము ప్రకారము మద్యమును సిద్ధము చేయవలెను. ఇది కఫరోగము, గుల్మ, మందాగ్ని, ప్రక్కశూల, నడుము నొప్పి అను ఈ వ్యాధులను హరించును. దంతీ, ద్రవంతీ మూలములను వాయింట వేరు కషాయమును కూర్చి సంధాన విధి ప్రకారము సౌవీరకము, తుషోదకమును కల్పింపవలెను. మరియు లోధ్ర కషాయమునకు బదులు దంతీ, ద్రవంతీ కషాయ మును చేర్చి సురా యోగమును చేయవలెను. ఇచ్చట సౌవీరక యోగమున లోధ్ర కషాయమునకు బదులు దంతీ, ద్రవంతీ కషాయమును చేర్చి కంపిల్లక యోగమున రొద్దుగ చూర్ణమునకు బదులు దంతీ, ద్రవంతీ చూర్ణమును కంపిల్లక కషాయమున చేర్చి సేవింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** "తత్కషాయా" అను మొదలగువానిచే ఉత్కారికా యోగము, మోదక యోగమును చెప్పెను. "తత్కషాయాత్" అనగా దన్తీ ద్రవన్తీ కషాయము వలన. మోదకము చేయునపుడు ఆ కషాయము యొక్క మూడు భాగములు అను మొదలగు విధానము వర్తించును.

"తయోశ్చాపి కషాయేణ మద్యాన్" అనునది మూడవది.
"దన్తీ" అను మొదలగువానిచేత నాల్గవ భక్ష్యయోగము.

"దన్తీ ద్రవన్తీ మరిచం" అను మొదలగునవి అయిదవది. హేమదుగ్ధా అనగా స్వర్ణక్షీరి. 'చూర్ణితమ్' అను చివరి పదమునకు 'పిబేత్' అనునది సంబం ధించినది. "ఫలం" అను మొదలగునది ఆరవది. "హరీతక్యాశ్చ విశంతి" అనగా ఆకృతి ప్రమాణములో (గ్రహించవలెను). ఈ యోగము ఇతర తన్త్రము నందు "అగస్త్యమోదక" అని చెప్పబడినది.

"దన్తీద్విపల" అనునవి ఏడవది. ఇచ్చట దన్తీ రెండు పలములు ద్రాక్షకు

అర్ధప్రస్థ ప్రమాణములో కషాయము చేయవలెను. "దన్తీకల్క" అను మొదలగునవి ఎనిమిదవది. "శ్యావల" అను మొదలగునవి తొమ్మిదవది. "గౌడ" అనగా బెల్లమునకు సంబంధించిన (అని అర్థము). "లిప్తే" అను ఇచ్చట "ఘటే" అని శేషము. "తథాద న్తీద్రవన్త్యోశ్చ" అను మొదలగునవి పదవది. "తథా" అను వానిచేత పూర్వము చెప్పబడిన పిప్పలీ మొదలగువానిచే కుండకు లేపము చేయుట వర్తించును. "అజశృఙ్గ్యావా" అను మొదలగునవి పదకొండవది. అట్లే అజశృంగిచే దన్తీ ద్రవన్తీ కషాయములందు గౌడోఽరిష్ట చేయవలెనని సంబంధము. "తచ్చూర్ణ" అను మొదలగునవి పన్నెండవది. ఇచ్చట ఆ దన్తీద్రవన్తీ చూర్ణ కషాయములచే అట్లే మాషాంబు, కిణ్వములచే యే సురా చేయబడునో ఆ సురనుంచి పుట్టిన (తయారయిన) మదిరా చేయవలెనని వాక్యార్థము. అజగన్ధా అను మొదలగువానిచే రెండు యోగములను చెప్పెను. అచ్చట అజగన్ధాకషాయములచే దన్తీ ద్రవన్తీలకు సౌవీరక, తుషోదకములందు చేయవలెను.

'సుర' అను మొదలగువానిచే మరియొక రెండు యోగములను చెప్పెను. "లోధ్రవచ్చతయోః" అనగా ఏ విధముగా లోధ్రకల్పమునందు "సురాలోధ్రకషాయేణ" అను మొదలగువానిచే సుర చెప్పబడినదో అదే విధముగా "కమ్పిల్లక కషాయేణ" (క.అ.9) అను మొదలగువానిచేత కమ్పిల్లక యోగము చెప్పబడినది. ఆ విధముగా ఆ దన్తీద్రవన్తీలను కూడా లోధ్రకు బదులు ప్రక్షేపించుటచేత సౌవీరక, తుషోదక విధానము వలెనే సురాయోగము చేయవలెను అని మూడవదియైన పదునారు యోగములు.

## అధ్యాయ విషయ సంగ్రహము

తత్ర శ్లోకాః

36. దద్యాదిషు త్రయః పఞ్చ ప్రియాలాద్యైస్త్రయో రసే
స్నేహేషు వై త్రయో లేహ్యాః షట్ చూర్ణే త్వేక ఏవ చ

37. ఇక్షౌ పేక స్తథా ముద్గమాంసానాం చ రసాస్త్రయః
యవాగ్వాదౌ త్రయశ్చైవ ఉక్త ఉత్కారికావిధౌ

38. ఏకశ్చ మోదకే మద్యే చైక శ్చాక్వాథతైలకే
చూర్ణమేకం పునశ్చైకో మోదకః పఞ్చ చాసవే

39. ఏకః సౌవీరకేఽప్యేకో యోగః స్యాత్తు తుషోదకే
ఏకాసురైకః కమ్పిల్లే తథా పఞ్చ ఘృతే స్మృతా

40. దన్తీద్రవన్తీకల్పేఽస్మిన్ ప్రోక్తాః షోడశకాస్త్రయః
నానావిధానాం యోగానాం భక్తిదోషామయాన్ప్రతి

**తాత్పర్యము :** దన్తీ ద్రవన్తీ కల్పాధ్యాయమున,

| | |
|---|---|
| దధి, తక్ర, సురాదులతో యోగములు | 3 |
| ప్రియాలాది యోగములు | 5 |
| మాంసరస యోగములు | 3 |
| స్నేహముతో యోగములు | 3 |
| లేహ యోగములు | 6 |
| చూర్ణ యోగము | 1 |
| ఇక్షు యోగము | 1 |
| ముద్గ మాంసరస యోగములు | 3 |
| యవాగు మన్నగువానితో యోగములు | 3 |
| ఉత్కారికా మోదక యోగములు | 2 |
| మద్య యోగము | 1 |
| దన్తీ క్వాథతైల యోగము | 1 |
| చూర్ణ మోదక యోగములు | 2 |
| ఆసవ యోగములు | 5 |
| సౌవీర, తుషోదక,సురా, కంపిల్ల యోగములు | 4 |
| ఘృత యోగములు | 5 |
| | 48 |

అను 48 విరేచన యోగములు చెప్పబడెను. దన్తీ, ద్రవన్తీలచే సిద్ధమైన ఈ యోగములను రోగియొక్క అభిరుచిని, వాతాది దోషములను ఆయా రోగములను బట్టి చెప్పబడినవి. తదనుసారము వీనిని ఉపయోగింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** 'దన్తీ' అను మొదలగు అధ్యాయ విషయ సంగ్రహము తేటతెల్లముగనే యున్నది. దోషములు, రోగములకును, అభిరుచిని అనుసరించి ఉపయోగించుటకు చెప్పబడిన నానావిధములైన యోగములయొక్క సంఖ్య 48గా చెప్పబడినవనుట ఇచ్చటి సందర్భము. భక్తి అనగా ఇచ్ఛ

## వమన - విరేచనౌషధయోగసంఖ్యా వివరణము

41. త్రిశతం పఞ్చపఞ్చాశద్యోగానాం వమనే స్మృతమ్
ద్వే శతే నవకాః పఞ్చ యోగానాం తు విరేచనే

42. ఊర్ధ్వానులోమభాగానామిత్యుక్తాని శతాని షట్
ప్రాధాన్యతః సమాశ్రిత్య ద్రవ్యాణి దశ పఞ్చ చ

**తాత్పర్యము :** శరీరమునందు ఊర్ధ్వ భాగమునందలి దోషములను వెడలింపజేయుటకై 355 వమన యోగములు, అధో భాగమునందు దోషములు అధో మార్గమున వెడలింపజేయుటకై 245 విరేచన ఔషధములు, ఈ రెండును చేరి 600 ఔషధ యోగములు ఈ కల్పస్థానమున చెప్పబడినవి.

**ఆయుర్వేదదీపిక :** 'త్రిశతం' అను మొదలగువానిచేత ప్రస్తుతము కల్పస్థానమందలి విషయముల సంగ్రహమును చెప్పెను. 'త్రిశతం పఞ్చపఞ్చాశత్' అనగా మూడు వందలకు ఏబదిఐదు యోగములు అధికముగా గలది (అనగా మూడు వందల ఏబది ఐదు). "ప్రాధాన్యతః సమాశ్రిత్య" అనగా ముఖ్యంగా మదనఫలము మొదలుకొని ద్రవన్తి వరకు పదిహేను ద్రవ్యములను యోగములందు నిర్దేశించుటచే ఆశ్రయించి అని అర్థము.

కల్పస్థానమందలి వమన, విరేచనౌషధయోగముల పట్టిక

| అధ్యాయము | కల్పనామములు | యోగసంఖ్య |
|---|---|---|
| 1. | మదనఫల కల్పము | 133 |
| 2. | జీమూతకల్పము | 39 |
| 3. | ఇక్ష్వాకుకల్పము | 45 |
| 4. | ధామార్గవ కల్పము | 60 |
| 5 | వత్సకకల్పము | 18 |
| 6. | కృతవేదనకల్పము | 60 |
| | వమనౌషధ యోగముల మొత్తము | ~~354~~ 355 |

| అధ్యాయము | కల్పనామములు | యోగసంఖ్య | |
|---|---|---|---|
| 7. | శ్యామా త్రివృత్కల్పము | 110 | |
| 8. | చతురఙ్గులకల్పము | 12 | |
| 9. | తిల్వకకల్పము | 16 | |
| 10. | సుధాకల్పము | 20 | |
| 11. | సప్తలా-శఙ్ఖినీకల్పము | 39 | |
| 12. | దన్తీ-ద్రవన్తీకల్పము | 48 | |
| | విరేచనౌషధ యోగముల మొత్తము | | 245 |
| | మొత్తము యోగముల సంఖ్య = | | 600 |

## ప్రధాన ద్రవ్యముననుసరించి యోగసంజ్ఞ - గుణములు

భవన్తి చాత్ర—

43. యద్ధి యేన ప్రధానేన ద్రవ్యం సముపసృజ్యతే
తత్సంజ్ఞకః స యోగో వై భవతీతి వినిశ్చయః

44. ఫలాదీనాం ప్రధానానాం గుణభూతాః సురాదయః
తే హి తాన్యనువర్తన్తే మనుజేన్ద్రమివేతరే

**తాత్పర్యము :** ఏ ఔషధ యోగములందు ఏ ద్రవ్యము ప్రధానముగా చేర్పబడునో, అట్టి ప్రధాన ద్రవ్యము పేరు చేతనే ఆ ఔషధ యోగము వ్యవహరింపబడును. మరియు పై ఔషధయోగములందు ఫల జీమూతాది యోగములందు ప్రధానములుగా నున్నను, సురా సౌవీర ములను ప్రధానములైన ఇతర ద్రవ్యములు చేర్చబడినను, అవి "ఒక ప్రభువును తక్కిన జనులందరును ఆశ్రయించి ప్రధానభూతుడైన రాజుకు ప్రతికూలము లేక తదనుకూల కృత్యములు చేయువిధముగా" ప్రధాన భూతములైన విరేచనాది ద్రవ్యములకు అనుకూలముగానే విరేచనాది కృత్యములను నెరవేర్చుచుండును.

**ఆయుర్వేదదీపిక :** "యద్ధి" అను మొదలగు వానియందు ఇచ్చట వమనాది యోగములందు సురా మొదలైన ఇతర ద్రవ్యములు చేర్చినప్పటికీ మదనఫలము

మొదలగు వాని నాధారము చేసికొని ఈ యోగములు ఎందుకు నిర్దేశింపబడుచున్నవో చెప్పెను. మదనఫలము మొదలగువానిచేత సురా మొదలైనవియును కలిపి ఈ యోగములు చేయబడుచున్నను ఫలములు మున్నగువాని యొక్క ప్రాముఖ్యతచేత ఇవి ఫలాదియోగములని నిర్దేశింపబడినవి. కానీ సురాది యోగములని చెప్పబడలేదు. "గుణభూతా" అనగా అప్రధానమైనవి. "తే హి తాన్యనువర్తన్తే" అనుదానిచేత సురా మున్నగువాని అప్రాధాన్యత్వమునకు కారణము చెప్పెను. సురా మొదలగునవి యే మదనఫలము మొదలగువానికి గల వమన విరేచన ప్రకార క్రియలకు అనుగుణముగా విరోధము లేకుండా అనుసరించును.

## విరుద్ధవీర్యత్వము

48. విరుద్ధవీర్యమప్యేషాం ప్రధానానామబాధకమ్
అధికం తుల్యవీర్యే హి క్రియాసామర్థ్యమిష్యతే

**తాత్పర్యము :** వమనాది ఔషధములందు ప్రధానముగా నుండు ద్రవ్యములు విరుద్ధ వీర్యములైన మాంసరసాది అప్రధాన ద్రవ్యములు చేరియున్నను ప్రధాన ద్రవ్యగుణాదులను బాధించి తత్కార్యమునకు భంగము కల్పింపవు మరియు ప్రధాన, అప్రధాన ద్రవ్యములు సమాన వీర్యము కలిగియున్న యెడల విరేచనాది క్రియాసామర్థ్యము మిక్కిలి అధికముగా ఆ ఔషధమునకు కల్గియుండును. ఇదియే విశేషము.

**ఆయుర్వేదదీపిక :** మదనఫలము మొదలైన వాటియొక్క గుణములను కల్గిన ద్రవ్యముల సంయోగము ఆ (ప్రధాన) ద్రవ్యముల యొక్క గుణభూతముగా (గుణోత్కర్షకు) అవ్వగలదు. దన్త్యాదుల తీక్ష్ణత్వమునకు విపరీత గుణములు గల ద్రవ్యములు మాంసరసాదులు. అదేవిధముగా ఏలకులు మొదలైనవి హృద్యములగుటచే వమనమునకు ప్రతికూలముగా పనిచేయుటకు బదులు మదన ఫలాదులకు అవి ఏ విధముగా గుణకరములని "విరుద్ధ వీర్యము కలిగినప్పటికీ ప్రధాన ద్రవ్యముల యొక్క గుణములు చెడగొట్టవని ఈ విధముగా చెప్పెను "విరుద్ధ వీర్యమపి" అనగా విరేచన రూపక కార్యమునకు అడ్డుపడకుండా గుణభూతమగునని అర్థము. ఒకవేళ విరుద్ధ వీర్యము గుణభూతముగాని యెడల మదన ఫలాదుల కార్యము నిరోధించవలెను విరుద్ధమైనప్పటికీ కార్యమునకు అవరోధము కలుగకుండుటచే అవశ్యముగా కార్యము చెడగొట్టబడుట లేదు అని భావము "అధికం" అనువానిచే విరుద్ధ

వీర్యముయొక్క కార్యాబాధన రూపమైన సహాయమును తెల్పి, తుల్య వీర్యము యొక్క కార్యమును చెప్పెను. తులవీర్య ద్రవ్య సంయోగముతో క్రియాసామర్థ్యము అధికమగునని అర్థము.

## విరుద్ధవీర్య ప్రయోగ కారణము

46. ఇష్టవర్ణరసస్పర్శగన్ధార్థం ప్రతి చామయమ్
అతో విరుద్ధవీర్యాణాం ప్రయోగ ఇతి నిశ్చితమ్

**తాత్పర్యము :** సమాన వీర్యగుణాదులు కల ఔషధములు కల్పించినచో అవి అధికముగ క్రియా సామర్థ్యములై యుండునని పైన వివరించియుందెను. అయినను రోగికి, మనస్సుకు ఇంపైన రసమును, స్పర్శమును, గంధమును ఔషధము కల్గియుండుటకును, రోగములయొక్క బలానుసారముగ ఔషధము తీవ్రతను అడిగి వాని పనులను మిక్కిలి తీవ్రములుగాక సామాన్యములుగ పుండుటకు విరుద్ధ వీర్య ద్రవ్యములను సంయోగ రూపములుగా చేర్చి ఇవ్వవలెను.

**ఆయుర్వేదదీపిక :** తరువాత తుల్య వీర్యము క్రియా సామర్థ్యమును పెంపొందింపచేయునుగాన దానితో ఆ సంయోగము (కలపడం) యుండవచ్చును. విరుద్ధ వీర్య సంయోగములు దేనికొరకు చేయబడుచున్నదో "ఇష్ట" అను మొదలగు వానిచే చెప్పెను- ఇష్టమైన వర్ణము మొదలగువానిని కల్గించుటకు. అందువలన మదన ఫలము మొదలగువాని విరుద్ధ వీర్య ద్రవ్యముల ప్రయోగము, విరుద్ధ వ్యాధులకు విరుద్ధ వీర్యద్రవ్య ప్రయోగము వమన విరేచనములచే హరింపదగిన వ్యాధి విశేషము నందు యుక్తమని అర్థము.

## ద్రవ్యముల వీర్యాధిక్య కల్పనమునకు విధి

47. భూయశ్చైషాం బలాధానం కార్యం స్వరసభావనైః
సుభావితం హ్యల్పమపి ద్రవ్యం స్యాద్బహుకర్మకృత్
48. స్వరసైస్తుల్యవీర్యైర్వా తస్మాద్ద్రవ్యాణి భావయేత్

**తాత్పర్యము :** స్వల్పమైన బలమును కల ఔషధమును క్రియాసామర్థ్యము కాకుండును. కాని అట్టి ద్రవ్యము స్వరసము మున్నగువానియందు భావన చేసి ఉపయోగించినచో అది బలవత్తర వీర్యము కలిగి అనేక క్రియల చేయు సమర్థ మగును. ద్రవ్యములను స్వరసము చేతను లేదా సమాన వీర్యము గల ద్రవ్యము చేతను భావన చేయవలెను.

**ఆయుర్వేదదీపిక** మదన ఫలాదులకు 'వీర్యోత్కర్ష' విధానమును చెప్పెను. 'భూయ శ్చైషాం' అను మొదలగునవి. 'తుల్యవీర్యైర్వా' అనగా తుల్య వీర్య ద్రవ్యముల స్వరసముచే (లేదా) క్వాదములచే అని అర్థము.

అల్పస్యాపి మహార్థత్వం ప్రభూతస్యాల్పకర్మతామ్
49. కుర్యాత్ సంయోగవిశ్లేషకాలసంస్కారయుక్తిభిః

**తాత్పర్యము** కొన్ని ఔషధ ద్రవ్యములు స్వరసముల చేతను, వానికి సమాన గుణములైన ఇతర ద్రవ్యముల చేతను పలుమారు భావన చేసి ఔషధమును కల్పింపవలెను. స్వల్పమైన వీర్యము గలవారికి అధిక వీర్యము కలుగునట్లు సమాన గుణవీర్యముకల వస్త్వంతర సంయోగము చేతను, భావన మున్నగు సంస్కార విశేషముల చేతను కల్పింపనగును. అధిక వీర్యము గల ఔషధమునకు సమాన గుణవీర్యములైన ఇతర వస్తువులను చేర్చకుండుటచేతను, కాల విశేషమును బట్టియు, భావన, స్వేదన మొదలగు సంస్కార విశేషములచేతను వానికి స్వభావమైన వీర్యమును తగ్గించవలయును.

**ఆయుర్వేదదీపిక** . 'అల్పస్యాపి' అను మొదలగువానిచేత సమాన, అసమానవీర్యముల సంయోగాదులచే జరుగు కార్యము చెప్పుచున్నాడు. అందు అల్ప ప్రమాణములోనున్న ద్రవ్యమునకు తత్సమాన వీర్య సంయోగముచే దానియొక్క శక్తి పెరుగుట జరుగును. మరియు విరుద్ధ వీర్య సంయోగముచేత ఎక్కువ ప్రమాణములోయున్న ద్రవ్యమునకు తక్కువ కర్మలను చేయునట్లు చేయవచ్చును ఈ అల్ప కార్ముకత్వము అనునది ఎక్కువగానున్న ఔషధము అగ్నిదీప్తిని కల్గించి దోషములను కోష్ఠమున వ్యాపించునట్లు చేయుటచేత నిష్ప్రయోజనముకాదు. విశ్లేషము వలనను అల్పప్రమాణములోనున్న ద్రవ్యమునకు ఎక్కువ కార్యమును చేయుశక్తి అనునది అందలి విరుద్ధవీర్యమును విశ్లేషించుటచేత (తీసివేయుటచేత జరుగుచున్నదని తెలియవలెను.) విశ్లేషముచే కూడ అల్ప ప్రమాణములో ద్రవ్యముయొక్క ఎక్కువ కర్మను విరుద్ధవీర్యము గల ద్రవ్యమును సంయోగపరచకపోవుటచే తెలిసికొనదగినది. ఎక్కువ ప్రమాణము గల ద్రవ్యము యొక్క అల్పకార్ముకతను తెలిసికొనదగినది. ఇట్లే సంస్కారముచేత కూడా సమాన, విరుద్ధ గుణము వలన ఎక్కువ (లేదా) తక్కువ కర్మను చేయుట సంబంధించియుండును. 'అల్పస్యాపి మహార్థత్వం' స్నిగ్ధ శరీరమునందు అల్పమాత్రలో ఇచ్చినను శోధనము ఎక్కువ దోషములను హరించుటకు తగును. దానికి విరుద్ధముగా ఎక్కువ ప్రమాణము గల ద్రవ్యము అల్ప కర్మను చేయుట ఉదహరించబడినది.



## అనుక్తమవనౌద్వౌషధ కల్పనా విధి

"ప్రదేశమాత్రమేతావద్ద్రిష్టవ్యమిహ షట్ శతమ్
50. స్వబుద్ధ్యైవం సహస్రాణి కోటిర్వాఽపి ప్రకల్పయేత్
బహుద్రవ్యవికల్పత్వాద్యోగసంఖ్యా న విద్యతే"

**తాత్పర్యము** అధిక వీర్యము గల ఔషధమునకు సమాన గుణ వీర్యములైన ఇతర వస్తువులను చేర్చుకుండుట చేతను, కాల విశేషమును బట్టియు భావన, స్వేదన మున్నగు సంస్కార విశేషములచేత వానికి స్వభావమైన వీర్యమును తగ్గించవలెను. వమన విరేచన విషయమై కల్పస్థానమున చెప్పబడిన 600 యోగములను దిఙ్మాత్రముగా నిర్దేశింపబడినవి. అట్టి విరేచన ద్రవ్యములు వికల్ప కల్పనా భేదములును సంఖ్యాతీతములై సంస్కారము మున్నగువానిచేత ఔషధయోగములు కల్పించినచో వేలు, కోట్ల సంఖ్యకన్న అధికములు అగును. కావున రోగియొక్క బలము అగ్నిదీప్తి, కోష్ఠము మున్నగువానిని గమనించి తదనుగుణముగ ఔషధ యోగములను స్వబుద్ధిచే కల్పించి ఉపయోగించవలెను.

**ఆయుర్వేదదీపిక :** ప్రస్తుతము చెప్పబడిన 600 బీజరూపములో యుండెడి ప్రయోగముచే చెప్పబడని ప్రయోగ కల్పనమును చూపించుట చెప్పెను. 'ప్రదేశ' అనగా ఏకదేశము. ఇక ఎందువలన యోగములను సంపూర్ణముగా చెప్పుట లేదో వివరించెను. "బహుద్రివం' అసంఖ్యాకములగుట వలన యోగములు నిశ్శేషము అని భావము.

## తీక్ష్ణవిరేచన లక్షణములు

51. "తీక్ష్ణమధ్యమృదూనాం తు తేషాం శృణుత లక్షణమ్
సుఖం క్షిప్రం మహావేగమసక్తం యత్ ప్రవర్తతే
52. నాతిగ్లానికరం పాయౌ హృదయే న చ రుక్కరమ్
అన్తరాశయమక్షిణ్వన్ కృత్స్నం దోషం నిరస్యతి
53. విరేచనం నిరూహో వా తత్తీక్ష్ణమితి నిర్దిశేత్

**తాత్పర్యము :** శరీరమునకు శ్రమ కల్గించక, గుదస్థానమున విశేషముగ బాధ కల్గించకయు, హృదయమునందు తీవ్రమైన నొప్పిని కల్గించకుండుటయు, ఆమాశయము పక్వాశయము మున్నగు అంతర వేగములను బాధించకయు, శరీరము

నందు దోషము నిశ్శేషముగ బద్ధము లేక అతివేగముతో బయటకు వెడలింపచేయు వమన విరేచన నిరూహ వస్త్యౌషధములు తీవ్రమైనవని తెలియవలెను.

**ఆయుర్వేదదీపిక :** ఇక వమన విరేచనములకు దాని తరువాత యివ్వ బడు నిరూహవస్తికి తీక్ష్ణ-మధ్యమ-మృదు (శోధన) లక్షణము, కారణమును చెప్పెను. 'తీక్ష్ణ' అను మొదలగునవి 'సుఖం' అనగా దుఃఖం చేయనిది. అసక్తమనగా బంధింపబడకుండా. "నాతిగ్లానికరం పాయౌ" అనగా విరేచనమునకు, నిరూహము నకుకూడా (వర్తించును). "హృదయే న, చ రుక్కరమ్" అనునది వమనముయొక్క లక్షణముగా తెలిసికొనదగినది. "అక్షిణ్వన్" అనగా పీడ (బాధ) లేకుండగ (అని అర్థము). విరేచనం అనగా వమనము విరేచనము (అని అర్థము). "ఉభయం హి శరీరదోష మల విరేచనాద్విరేచన శబ్దం లభతే" (క.స్థా-1) అని చెప్పబడినదియే.

## భేషజము తీక్ష్ణత్వము-మధ్యత్వము-మృదుత్వము పొందు విధము

జలాగ్నికీటైరస్పృష్టం దేశకాలగుణాన్వితమ్
54. ఈషన్మాత్రాధికైర్యుక్తం తుల్యవీర్యైః సుభావితమ్
స్నేహస్వేదోపపన్నస్య తీక్ష్ణత్వం యాతి భేషజమ్
55. కించిదేభిర్గుణైర్హీనం పూర్వోక్తైర్మాత్రాయా తథా
స్నిగ్ధస్విన్నస్య వా సమ్యఙ్మధ్యం భవతి భేషజమ్
56. మన్దవీర్యం విరూక్షస్య హీనమాత్రం తు భేషజమ్
అతుల్యవీర్యైః సంయుక్తం మృదు స్యాన్మన్దవేగవత్

**తాత్పర్యము :** జలము చేతను, నిప్పుచేతను, పురుగుచేతను, స్పృశింప బడక దేశమునకు, కాలమునకు చెప్పబడిన గుణములతో కూడిన ఔషధంబును యదోక్త ప్రమాణము కన్న కొంచెము అధికమైన ప్రమాణము కల ద్రవ్యములతో కూడిన ఔషధమును సమాన వీర్యములైన ద్రవ్యాంతరములచే చక్కగ భావన చేయ బడిన ఔషధములును మిక్కిలి తీక్ష్ణమై తీవ్రముగ పనిచేయును. మరియు స్నేహ స్వేదములచే శోధన పూర్వాంగముగ దోషములు శిథిలమై యున్నపుడు పై ఔషధ ములు తీక్ష్ణములై చక్కగ పనిచేయును. పై చెప్పిన గుణములలో కొన్ని గుణములు మాత్రము కల్గి, కొద్దిగ పరిమాణము గల ఔషధము మధ్యవీర్యముగ నుండును. అది చక్కగ స్నేహస్వేద విధుల నాచరించినవారికి మధ్య వీర్యముగనే యుండును. మిక్కిలి వీర్యము మందమై, స్వల్ప పరిమాణము కల్గి సమాన గుణములుకాక విరుద్ధ

వీర్యములైన ఔషధములతో సంయోగము కల్గిన వమన విరేచన ఔషధములు మృదువుగ నుండును. మరియు స్నేహస్వేదములను ఆచరింపక రూక్షశరీరము గల వారికి ఉపయోగింపబడిన ఔషధమును మృదువుగ నుండును. అట్టి మృదువైన ఔషధము వమన విరేచనముల వేగములను స్వల్పముగనే చేయును.

**ఆయుర్వేదదీపిక :** "జలాగ్ని" అను మొదలగు వానిచేత తీక్ష్ణత్వమునకు కారణము చెప్పెను. 'దేశకాలగుణాన్వితమ్' అనగా అనుకూలమైన దేశకాలములందు లభించెడు ద్రవ్యము ఉత్కృష్టమైన గుణము కల్గియుండును. 'స్నేహస్వేదోపపన్నస్య' అనగా బాగుగా స్నేహస్వేద కర్మ చేయబడినవానికి అని అర్థము. 'కించిత్' అను మొదలగువానిచే మధ్యమ కార్యము గల వమనాదుల కారణము లక్షణములను చెప్పెను. "ఏభిర్గుణైః" అనుట వలన క్షిప్రత్వము మొదలైన, జలాగ్ని కీట స్పృష్టత్వము అను గుణములు బోధపడగలవు. 'మన్దవీర్యం" అను మొదలగు వానిచే మృదుకార్యము యొక్క లక్షణము, కారణమును చెప్పెను. 'మన్దవేగవత్' అనునది లక్షణమును, మిగిలినవి కారణములను సూచింపబడుచున్నవి.

## తీక్ష్ణాది ఔషధముల ఉపయోగింపదగిన విషయములు

57. అకృత్స్నదోషహరణాదశుద్ధి తే బలీయసామ్
మధ్యావరబలానాం తు ప్రయోజ్యే సిద్ధిమిచ్ఛతా

**తాత్పర్యము :** పైన చెప్పబడిన మృదు-మధ్య విరేచనములు రెండును మిక్కిలి బలశాలురైన రోగులకును, ప్రబలమైన దోషములు కలవారికినీ, ఉపయోగించిన యెడ దోషములను పూర్తిగా వెడలింప సమర్థములు కానేరవు. కావున మధ్యమమైన బలము గల రోగులకు మధ్య వీర్యమైన ఔషధమును, హీన బలురైన వారికినీ, స్వల్పదోషము కలవారికిని మృదు విరేచన ఔషధము ఉపయోగించవలెను.

**ఆయుర్వేదదీపిక :** తీక్ష్ణ మొదలగు శోధన విషయమును గూర్చి చెప్పెను. ఆ మధ్యమ, అల్ప శోధనలు బలవంతులైన పురుషుల యొక్క దోషము మొత్తమునంతయు హరించకపోవుటచే దానిని అశుద్ధిగానే పరిగణించవలెను. "అకృత్స్న దోషహరాణాత్" అను హేతువర్ణనచే బలవంతులైనవారిలో అల్ప దోషములున్నచో దోషమును సంపూర్ణముగా హరించుటకు మధ్యమ అల్ప శోధన ఎపుడు జరుగునో అపుడు అవి సమ్యక్ శోధనమునే సూచించును. "మధ్యే"

అనునవి మధ్యమ బలము గలవారికి మధ్యమ, అల్పబలము గలవారికి మృదువైన శోధనము ప్రయోగించవలెనని వాక్యార్థము. అచ్చట ప్రయోగించిన భాషచే అసమ్యక్ శుద్ధిని గూడా బలమును దృష్టిలో వుంచుకుని చేయవలెనన్నచో మధ్యమ్య అల్ప బలము గలవారికి అది సమ్యక్ శోధనమగునని చూపించుచున్నాడు.

58. తీక్ష్ణో మధ్యో మృదుర్వ్యాధిః సర్వమధ్యాల్పలక్షణః
తీక్ష్ణాదీని బలాపేక్షే భేషజాన్యేషు యోజయేత్

**తాత్పర్యము :** తీక్ష్ణ-మధ్య-మృదు భేదములచే జ్వరాది రోగములును, మూడు విధములగును. అందు ఆ యా వ్యాధికి చెప్పిన లక్షణములన్నియు పూర్ణముగ నున్నచో అది తీక్ష్ణము. వ్యాధికి చెప్పబడిన లక్షణములు మధ్యమముగ నున్నచో మధ్యమ వ్యాధియనియు, లక్షణములు స్వల్పముగ నున్నచో మృదువనియు తెలుసు కొనవలెను. అట్టి వ్యాధి భేదములు గమనించి రోగియొక్క బలము ననుసరించి మృదు-మధ్య- తీక్ష్ణ రూపములైన ఔషధములను యథాసంఖ్యగా ప్రయోగింప వలెను.

**ఆయుర్వేదదీపిక :** వ్యాధి తీక్ష్ణత్వము మొదలగు విభాగముచే శోధనము నందు తీక్ష్ణత్వము మొదలగువిధానము చెప్పెను. "తీక్ష్ణో మధ్య" అను మొదలగునవి "సర్వమధ్యాల్పలక్షణ" అనగా యథాక్రమముగా తీక్ష్ణ మొదలగు వ్యాధి లక్షణము (అని అర్థము). సర్వలక్షణ మనగా తీక్ష్ణమైన వ్యాధి, మధ్య లక్షణమనగా మధ్యమమైన వ్యాధి, అల్పలక్షణమనగా మృదువ్యాధి అని అర్థము. "బలాపేక్షీ" అనుదానిచేత బలము ఎక్కువగాయుండి వ్యాధి తీక్ష్ణత్వము గల్గియున్నచో తీక్ష్ణ శోధనము చేయవలె నని చూపించుచున్నాడు.

59. దేయం త్వనిర్హృతే పూర్వం పీతే పశ్చాత్ పునః పునః
భేషజం వమనార్థీయం ప్రాయ ఆపిత్తదర్శనాత్

**తాత్పర్యము :** వమనౌషధమును త్రాగినపుడు దోషము చక్కగ వెడల కున్నచో వమనమునకై తొలుత నుపయోగింపబడిన ఔషధమునే మరల పలుమారు ఉపయోగింపవలెను. ఈ విధమున ఆమాశయమునుండి పిత్తము వెడలు వరకు వమనౌషధము నుపయోగింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** వమన క్రియ జరుపునపుడు అవస్థా విశేషమునందు చేయదగినది చెప్పెను. 'దేయం' అను మొదలగునవి. ఈ విధముగా త్రాగిన వమన

కర్మలో దోషము పూర్తిగా హరించనపుడు పలుమార్లు వమనము కొరకు భేషజమును ఇవ్వవలెను. 'అపిత్తదర్శనాత్' అనగా ఎంతవరకు పిత్తము కనబడదో అంతవరకు మాటిమాటికి వమనమునకు ఇవ్వవలెను. వమనకర్మ పిత్తాన్తముగా (పిత్తము చివరకు కనబడుట) యున్నచో సంపూర్ణ కర్మ అగును.

'పిత్తాన్తమిష్టం వమనం విరేకార్థం (సి. స్థా. అ. 1) అని చెప్పబడినదిగదా!

## త్రివిధ బలానుసారము ఔషధ ప్రయోగవిధి

60. బలత్రైవిధ్యమాలక్ష్య దోషాణామాతురస్య చ
పునః ప్రదద్యాద్భైషజ్యం సర్వశో వా వివర్జయేత్

**తాత్పర్యము :** దోషముయొక్కయు, రోగియొక్కయు ప్రవర-మధ్యమ-అవర బలభేదములను గమనించి, అందు దోషమును, రోగియు, బలవత్తరమైనప్పుడే పై జెప్పిన రీతిగ వమనౌషధమును మాటిమాటికి ఉపయోగించవలెను. అట్లు గాక రోగికిని దోషమునకు సంబంధించిన బలము మధ్యమముగ నున్నచో ఒకసారి మాత్రము వమనౌషధము త్రాగింపవలెను అట్టి బలము మిక్కిలి హీనస్థితినున్నపుడు దోష శోధనమునకై వమనౌషధమునుపయోగింపరాదు.

**ఆయుర్వేదదీపిక :** మాటిమాటికి భైషజ్య ప్రయోగమునకు గల ఔచిత్యము, అనౌచిత్యమును చూపించుచు చెప్పెను. 'బల' అను మొదలగునవి. బలవంతమైన దోవమున బలము గల పురుషుని యందును పలుమార్లు ఔషధమును ప్రయోగించవలెను. దోషము మరియు పురుషుడు అల్ప బలము గల్గినచో శోధన కొరకు ఔషధమును పూర్తిగా త్యజించవలెను. అనగా శోధనము చేయరాదని అర్థము. 'వా' శబ్దముచేత దోషము మరియు పురుషుడు మధ్యమ బలము కల్గి యుండినచో పూర్తిగా త్యజించకుండా ఒకమారు శోధనము చేయవచ్చునని చూపించు చున్నాడు.

## మరియొక ఔషధము ప్రయోగించు కాలము

61. నిర్హృతే వాఽపి జీర్ణే వా దోషనిర్హరణే బుధః
భేషజేఽన్యత్ప్రయుఞ్జీత ప్రార్థయన్సిద్ధిముత్తమామ్

**తాత్పర్యము :** దోషమును బైట వెడలింపజేయుటకైన ఔషధము నుపయోగించినపుడు అది దోషమును వెడలించకయే బైట వెడలినను, అట్టి ఔషధము జీర్ణాభిముఖమైనను, చికిత్సా ఫలమును కోరు విద్వద్వైద్యుడు ఆ దినముననే మరల వమనౌషధమును ప్రయోగింపవలెను. ఇచ్చట 'దోషనిర్హరణే' అను పదమునకు దోషములను వెడలించుటకు సాధనమైనదని అర్థము. అది 'భేషజే' అను పదమునకు విశేషణము

**ఆయుర్వేదదీపిక :** "నిర్హృతే" అను మొదలగువానిలో 'దోష నిర్హరణే' అనగా దోషమును వెడలించుటకు సాధనమైనదని అర్థము. అది 'భేషజే' అను పదమునకు విశేషణము. 'నిర్హృతే' అనగా దోషమును వెడలింపకయే బైటకు వెడలినది అని అర్థము. 'జీర్ణేవా' అని వమనము గూర్చి చెప్పబడుచున్న ఆ వమనౌషధము పక్వము కాకయే వమనము కల్గించును. "అపక్వం వమనం" (వమనౌషధము పాకము చెందకయే దోషములను వెడలించు స్వభావము కల్గియుండునని) అను మొదలగువానిచే చెప్పదగియున్నది. వమనము యొక్క జీర్ణత్వము (వమనారంభమైన) ఉద్రేకము కల్గింపకపోవుటచే పక్వమునొందుట ద్వారాను తెలిసికొనదగినది. "అన్యత్ ప్రయుఞ్జీ.త" అనగా వమనముకొరకు ఔషధమును త్రాగిన అనంతరము మరల అదేరోజున వమనౌషధము ఇవ్వవలెను (అని అర్థము).

## వమనౌషధ ప్రయోగమున ఔషధ జీర్ణకాలమును నిరీక్షింపనవసరము లేదనుట

62. అపక్వం వమనం దోషం పచ్యమానం విరేచనమ్
నిర్హరేద్వమనస్యాతః పాకం న ప్రతిపాలయేత్

**తాత్పర్యము :** వమనౌషధము పాకము నొందకయే దోషములను వెడలించు స్వభావము కల్గియుండును. విరేచనౌషధము పాకమునొందు దోషముల వెడలించును. కావున వమనౌషధమును తొలుత ప్రయోగించినపుడు దోషముల వెడలించు ప్రయత్నము లేకున్నపుడు దాని పాకకాలమును ప్రతీక్షించక వెంటనే మరల వమనౌషధమును ప్రయోగించవలెనని అర్థము.

**ఆయుర్వేదదీపిక :** వమన ప్రయోగములందు అయోగమునకు చికిత్స కొరకు మరియొకసారి వమనౌషధము ప్రయోగము చేయవల్సిందని ఆ సందర్భమున

ఔషధ జీర్ణకాలమును నిరీక్షించు అవసరము లేదనుటను యుక్తితో చెప్పెను. 'అప క్వం' అను మొదలగునవి.

### అవస్థా విశేషముచే విరేచనౌషధమున పునః ప్రయోగవిధి

63. పీతే ప్రస్రంసనే దోషాన్న నిర్హృత్య జరాం గతే
వమితే చౌషధే ధీరః పాయయేదౌషధం పునః

**తాత్పర్యము :** విరేచనౌషధమును ప్రయోగించినపుడు దోషములను వెడలించకయే జీర్ణమైయున్నను, ఔషధమును త్రాగిన వెంటనే అది వమనరూపముగ బైటవెడలినను, ఆ దినముననే మరల విరేచనౌషధమును త్రాగించవలెను

**ఆయుర్వేదదీపిక :** వమనమున అవశ్యకమైన విధానము చెప్పి విరేచనమునకు కూడా చెప్పెను. 'పీతే ప్రస్రంసనే' అను మొదలగునవి. "వమిచౌషధే" అనగా విరేచనౌషధము మాత్రము వమనము కాగా అని అర్థము. 'పునః' అనగా ఆదేరోజున (త్రాగించవలెను).

### అవస్థా విశేషముచే విరేచనౌషధమున పునఃప్రయోగవిధి

64. దీప్తాగ్నిం బహుదోషం తు దృఢస్నేహగుణం నరమ్
దుఃశుద్ధం తదహర్భుక్తం శ్వోభూతే పాయయేత్ పునః

65. దుర్బలో బహుదోషశ్చ దోషపాకేన యో నరః
విరిచ్యతే శనైర్భోజ్యైర్భూయ స్తమనుసారయేత్

**తాత్పర్యము :** విరేచనమునకై ఔషధము నుపయోగించినపుడు విరేచనములు చక్కగరాక దోషము కొద్దిగ వెడలినపుడు, అట్టి రోగికి జఠరాగ్ని దీప్తమై దోషము ప్రబలముగ నుండి శరీరమున స్నేహగుణము దృఢముగ కల్గి స్నిగ్ధమై యుండినచో నాటిదినము యుక్తమైన పథ్యాహారమును వానికిపెట్టి మరునాడు మరల విరేచనౌషధమును వానికి త్రాగించవలెను. విరేచనౌషధమును త్రాగినరోగి బలహీనుడై దోషములు ప్రబలముగ నుండునపుడు దోషములు పరిపక్వములై యుండుటచే మెల్లమెల్లగ విరేచనములగుచున్నచో అట్టి అవస్థయందు వాతము అనులోమముగ జేయు భోజన పదార్థముల నుపయోగించి దాని మూలముగ దోషముల వెడలింప నగును.

**ఆయుర్వేదదీపిక :** విరేచన కర్మయందు కొద్దిగ దోషము వెడలినచో చేయదగు కర్తవ్యమును చెప్పెను— 'దీప్తాగ్నిం' అను మొదలగునవి. 'దృఢస్నేహ గుణం' అనుదానిచేత శరీరము బాగుగా దృఢముగా స్నిగ్ధముగా లేనపుడు విరేచనౌషధమును ఇవ్వరాదు, కాని స్నేహకర్మయే చేయించవలెను. సరిగ్గా స్నిగ్ధముకాని వారిలో తిరిగి చేయు విరేచనము అసమ్యగ్యోగముగా అగును. 'దుశ్శుద్ధం' అనగా అయోగముచే శుద్ధముకానిది అని అర్థము. 'శ్వోభూతే' అనగా ఆ దినము గడచిన పిమ్మట (అనగా మరుసటి దినము) లేదా 'శ్వోభూయః' అని పాఠము (గలదు) 'దోషపాకేన' అనగా పరిపక్వములైన దోషములు ప్రబలముగానుండుటచే బంధము లేకుండా మెల్ల మెల్లగ విరేచనములగును. 'భోజ్యై' అనగా అనులోమన పదార్థములచే అని అర్థము. ఇక్కడను దోషములు గమనోన్ముఖములుగ నున్నపుడు అతియోగ భయముచేత మరల విరేచన ప్రయోగము చేయరాదని తెలిసికొనవలెను.

## దోషశేషశమనోపాయము

66. వమనైశ్చ విరేకైశ్చ విశుద్ధస్యాప్రమాణతః
భోజనాన్తరపానాభ్యాం దోషశేషం శమం నయేత్

**తాత్పర్యము :** వమనములను, విరేచనములను తీవ్రముగనైనను కోష్ఠము చక్కగ శుద్ధము కాక కొంచెము శేషించియున్నచో పానమైన యవాగువు మున్నగు తేలికగనుండు నాహారముతో కూడ కషాయాదుల త్రాగించియైనను, భోజనానంతరము కషాయము త్రాగించియైనను దోష శేషమును శమింపజేయ నగును.

**ఆయుర్వేదదీపిక :** వమన విరేచన కర్మలందు కొంచెము మిగిలియున్న దోషముల శమనోపాయము కొరకు చెప్పెను. "వమనైశ్చ" అను మొదలగునవి. ఇచ్చట వేగముల అధిక్యత తెల్పుటకు బహువచనము ప్రయోగింపబడినది. 'అప్రమాణ' అనగా నిశ్శేషముగా కాని (అనగా కొంచెము మిగిలియున్నది) అని అర్థము. అచ్చట భోజనమనగా యవాగు మున్నగు తేలికగనుండు భోజనము. అన్తరపానం అనగా కషాయపానము. ఎవరైతే "ప్రమాణతః" అని పఠించుచున్నారో వారు సమ్యక్ శోధన జరిగినప్పటికిన్నీ కోష్ఠమున్న అందు [illegible] దోషము శమింప టకై భోజన కషాయము [illegible]

## మృదుశోధకౌషధమును ప్రయోగింపదగినవారు

67. దుర్బలం శోధితం పూర్వమల్పదోషం చ మానవమ్
అపరిజ్ఞాతకోష్ఠం చ పాయయేతౌషధం మృదు

**తాత్పర్యము :** బలహీనుడైనవానికిని, మొదలుత శోధనము చేసిన పిదప దోషశేషము కలవానికిని, దోషము స్వల్పముగ నుండువానికిని, కోష్ఠము మృదు మధ్యాది భేదములచే నిర్ణయించి తెలుసుకొనవలనుపడని స్థితియందు వానికిని మృదు వీర్యమైన ఔషధమును శోధనమునకై ఉపయోగింపనగును.

**ఆయుర్వేదదీపిక :** మృదు శోధనము ప్రయోగింపదగినదానిని చెప్పెను "దుర్బలం" అను మొదలగునవి. "శోధితం పూర్వం" అనగా తొలుత శోధనము చేసినవానికి, బలహీనత్వమునందు మృదువైన ఔషధమును ఇవ్వవలెను. తీక్ష్ణ ఔషధముచే బలభ్రంశము, అతియోగమున్ను కల్గును.

68. శ్రేయో మృద్వసకృత్పీతమల్పబాధం నిరత్యయమ్
న చాతితీక్ష్ణం యత్ క్షిప్రం జనయేత్ప్రాణసంశయమ్

**తాత్పర్యము :** పై చెప్పబడిన దుర్బలాదులకు మృదువైన శోధనౌషధమును పలుమారుపయోగించినను, తీక్ష్ణౌషధమున కన్న స్వల్పముగనే బాధ గల్గించును. అపాయమును గల్గింపనేరదు. కావున మృదుశోధనమునే ఉపయోగించుట మంచిది. అట్టివారికి మిక్కిలి తీక్ష్ణమైన శోధనౌషధము శీఘ్రముగ ప్రాణ సందేహమును కల్గించును. కావున నొకప్పుడును తీక్ష్ణౌషధము నుపయోగింపకూడదు.

**ఆయుర్వేదదీపిక :** మృదు ఔషధ ప్రయోగ యుక్తిని చెప్పెను - శ్రేయ అను మొదలగునవి. "అసకృత్పీతం" అనగా పలుమారు సేవించి స్వల్పమైన బాధను కలుగునని అర్థము. "న చాతి తీక్ష్ణం" అనగా అతి తీక్ష్ణమైన ఔషధము దుర్బలురకు ఇవ్వరాదు అని అర్థము. ఎందుచేతననగా అతి తీక్ష్ణమైన ఔషధము బలహీనులను పొంది శీఘ్రముగ ప్రాణసంకటమును కలిగించును.

69. దుర్బలోఽపి మహాదోషో విరేచ్యో బహుశోఽల్పశః
మృదుభిర్భేషజైర్దోషా హన్యుర్హ్యేనమనిర్హృతాః

**తాత్పర్యము :** ప్రబలమైన దోషము కల్గినవాడు బలహీనుడైయున్నను మృదువీర్యములైన శోధనౌషధములను స్వల్ప పరిమాణముగ పలుమారుపయోగించి

విరేచనము చేయించవలెను. బలహీనావస్థనుండినను దోషము మిక్కిలి బలిష్ఠముగ నున్నపుడు వానిని వెడలింపజేయకున్నచో రోగిని తప్పక చంపును.

**ఆయుర్వేదదీపిక :** దుర్బలులందు ఎక్కువ దోషమున్నపుడు చేయ వల్సినదానిని చెప్పెను. 'దుర్బలోఽపి' అను మొదలగునవి 'బహుశోఽల్పశః' అనగా మాటిమాటికి స్వల్పపరిమాణమునందు అని అర్థము. ఇలా ఉండగా ఎక్కువగా నున్న దోషములను వెడలింపజేయుటకు హేతువును చెప్పెను దోషా హన్యు శ్లేష్మనమని శ్లామృతో అని.

## విరేచనౌషధము ఊర్ధ్వముగ వ్యాపించినపుడు చేయదగిన చికిత్స దోషము వెడలకున్నచో చేయు చికిత్స

70. యస్యోర్ధ్వం కఫసంసృష్టం పీతం యాత్యానులోమికమ్
వమితం కవలైః శుద్ధం లఙ్ఘితం పాయయేత్తు తమ్
71. విబద్ధేఽల్పే చిరాద్దోషే స్రవత్యుష్ణం పిబేజ్జలమ్
తేనాధ్మానం తృషా చ్ఛర్దిర్విబన్ధశ్చైవ శామ్యతి
72. భేషజం దోషరుద్ధం చేన్నోర్ధ్వం నాధః ప్రవర్తతే
సోద్గారం సాఙ్గశూలం చ స్వేదం తత్రావచారయేత్

**తాత్పర్యము :** విరేచనమునకై త్రాగబడిన ఔషధము కఫముతో కూడి ఊర్ధ్వముఖముగ వెడలుచున్నచో, నా ఔషధమును పూర్తిగ వమనము చేయించి, ఆహారము నిడక లంకణము చేయించి, వేడినీళ్ళచే శుభ్రముగ నోరును, కుత్తుకను పుక్కిలించి మరల విరేచనౌషధమును త్రాగింపవలెను. విరేచనౌషధమును త్రాగి నపుడు ఆశయమునందలి దోషము బద్ధగింపబడి దోషము కొంచెము కొంచెముగ చిరకాలమునకు స్రవించుచున్నచో కడుపులో గడబిడ చేయుచు నుబ్బరించి దప్పియు వాంతియు కల్గును. అట్టియెడ మిక్కిలి వేడిగనుండు జలమును త్రాగించినచో బద్ధకము సడలి దోషము చక్కగ వెడలి కడుపుబ్బరము మొదలగు నుపద్రవములు శమించును. ఔషధము దోషములచే బద్ధగింపబడినపుడు ఔషధమూర్ధ్వ మార్గముగ నైనను అధోమార్గముగనైననూ వెడలక కుక్షిలోనే బద్ధకింపబడియుండును. దానిచే ఒకరింతలును, ఒడలు నొప్పులును కలుగును. అపుడు స్వేదవిధిచే చెమట బట్టించ

ఫలేషుః

ఆయుర్వేదదీపిక : 'యస్య' అను మొదలగునవి అనులోమకమైన ఏ విరేచనౌషధము ఊర్ధ్వముగ పోవునో అటువంటివానికి విరేచనౌషధము త్రాగించమని అని శేషము.

'కవలైః 'శుద్ధం' అనగా కవలముచే (పుక్కిలిచే) శోధనము చేయబడిన కంఠము. 'తేన' అనగా ఉష్ణజలముచే త్రాగబడిన అని అర్థము

## దోషము అధికముగా వెడలినచో చేయు చికిత్స

73. సువిరిక్తే తు సోద్గారమాశ్వౌషధముల్లిఖేత్
అతిప్రవర్తనం జీర్ణే సుశీతైః స్తమ్భయేద్భిషక్

తాత్పర్యము : అట్టి సమ్యగ్విరిక్త లక్షణములు కానవచ్చినపుడును ఔషధము పూర్తిగా జీర్ణముకాక పచ్యమానావస్థనుండి ఔషధ స్వరూపము గాన వచ్చు త్రేనుపులు వెడలుచున్నయెడ అట్టి జీర్ణ జౌషధమును వెంటనే వమనము చేయించి బైట వెడలింపవలెను. మరియు విరేచనౌషధము పూర్తిగ జీర్ణమై సువిరిక్త లక్షణములు కానవచ్చిన పిమ్మట కూడ విరేచనములు అంతట నిలువక అధికముగ నగుచున్నచో శీతోపచారముల చేసి విరేచనములు కాకుండ స్తంభింపజేయవలెను.

ఆయుర్వేదదీపిక : అతియోగము జరిగినదని అనుమానముగానున్నచో చేయదగిన దానిని చెప్పెను— 'సువిరిక్తే' అను మొదలగునవి. 'సువిక్తే' అనగా సమ్యక్ పరిమాణములో వెడలింపబడిన అని అర్థము. 'సోద్గార' మనగా త్రేనుపు చేత పచ్యమానావస్థ చెప్పబడును. దీనిచేత సమ్యక్ విరేచనమైనప్పటికీ ఏ ఔషధ ముండునో దానిని ఆ రోజునందే వమనముచే బైట వెడలింపజేయవలెను. ఆ ఔష ధము జీర్ణించుసరికి విరేచనాతియోగము కలుగునని చూపించుచున్నాడు.

## విరేచనౌషధము వాతముచే నివరింపబడిచచోనట్లు లక్షణములు-చికిత్స

74. కదాచిచ్ఛ్లేష్మణా రుద్ధం తిష్ఠత్యురసి భేషజమ్
క్షీణే శ్లేష్మణి సాయాహ్నే రాత్రౌ వా తత్ప్రవర్తతే.

తాత్పర్యము : విరేచనౌషధమును సేవించినపుడొకానొక సమయమున

ఆ ఔషధము కఫముచే అడ్డగింపబడి రొమ్మునందే నిలిచియున్నచో కఫము క్షీణించిన పిదప సాయంకాలమునందైనను. రాత్రియందైనను ఔషధము వ్యాపించి విరేచనముల వెడలింపజేయును.

**ఆయుర్వేదదీపిక :** 'కదాచిత్' అను మొదలగువానిచేత విరేచనము యొక్క అవిక్రమత్వము (ప్రవర్తించకపోవుట) నందు కారణము చెప్పెను. ఇచ్చట చేయవలసినది (ప్రతీకారము) చెప్పబడనప్పటికీ ఔషధమునకు శ్లేష్మముచే అవరోధము, రొమ్ము బరువుగ నుండుట మొ॥లక్షణములు పొంది రాత్రివరకు ఔషధము యొక్క అయోగము, దాని ప్రవృత్తి ప్రతీక్షించవలెననెడి ప్రతీకారము ఊహించవలసినది. ప్రవర్తతే అనగా దోషముతో కూడిన ఔషధము వ్యాపించును.

75. రూక్షానాహారయోర్జీర్ణే విష్టభ్యోర్ధ్వం గతేఽపి వా
వాయునా భేషజే త్వన్యత్ సస్నేహలవణం పిబేత్

**తాత్పర్యము :** కోష్ఠము స్నిగ్ధముకాక రూక్షముగనుండువారికిని, ఆహారమును భుజింపక నుండు వారికిని, విరేచనౌషధము జీర్ణించియున్నను, వాతముచే నడ్డగింపబడి ఔషధమూర్ధ్వ భాగమున చేరియున్నను విరేచనములు కానేరవు. అట్లైనచో ఇతర విరేచనౌషధమున సైంధవ లవణమును స్నేహమును చేర్చి త్రాగించవలెను.

**ఆయుర్వేదదీపిక :** "రూక్ష" అను అయోగముచే ఆహారము భుజింపకయుండువాని యందు, అడ్డగింపబడి ఊర్ధ్వభాగమున చేరిన ఔషధమునందు ఇతర విరేచనౌషధమును, స్నేహమును, సైంధవ లవణమును చేర్చి ఇవ్వవలెను.

## జీర్ణమగు ఔషధముచే కల్గు తృష్ణా, మోహము, మూర్ఛ మొదలగునవి గల్గినచో వానిచికిత్స

76. తృణ్మోహభ్రమమూర్ఛాద్యాః స్యుశ్చేజ్జీర్యతి భేషజే
పిత్తఘ్నం స్వాదు శీతం చ భేషజం తత్ర శస్యతే

**తాత్పర్యము :** విరేచనౌషధము జీర్ణమగునపుడు దప్పి కల్గును. మైకము గ్రమ్మును. ఒడలు తిరుగును. మూర్ఛ గ్రమ్మును. అట్లైనచో పిత్త హారమును, మధురరసమును, శీతవీర్యమునునగు ఔషధమును సేవించుట ప్రశస్తము.

**ఆయుర్వేదదీపిక :** "తృష్ణామోహ" అను మొదలగువానిచే పిత్తావృత ఔషధము యొక్క లక్షణము చికిత్సితము చెప్పెను. "స్యుర్జీర్యతి" అనగా జీర్ణమైన ఔషధమునందు దప్పిక మొదలగునవి కల్గునని అర్థము.

## విరేచనౌషధము కఫముతో గూడినపుడు లక్షణములు-చికిత్స

77. లాలాహృల్లాసవిష్టమ్భలోమహర్షాః కఫావృతే
భేషజం తత్ర తీక్ష్ణోష్ణం కట్వాది కఫనుద్ధితమ్

**తాత్పర్యము :** విరేచనౌషధము కఫముచే నావరింపబడినపుడు నోట జొల్లుకారును. ఓకరింతలు కల్గును. విష్టంభమును, రోమహర్షమును కల్గును. అపుడు తీక్ష్ణము, ఉష్ణవీర్యము, కటురసము కల ఔషధమును సేవించవలెను.

**ఆయుర్వేదదీపిక .** "లాలా" అను మొదలగువానిచే కఫావృత ఔషధము యొక్క లక్షణము, చికిత్సితము చెప్పెను.

## సుస్నిగ్ధ మరియు క్రూర కోష్ఠమునందు చేయదగు చికిత్స

78. సుస్నిగ్ధం క్రూరకోష్ఠం చ లఙ్ఘయేదవిరేచితమ్
తేనాస్య స్నేహజః శ్లేష్మా సఙ్గశ్చైవోపశామ్యతి

**తాత్పర్యము** · మిక్కిలి స్నిగ్ధమైన కోష్ఠము కలవానికిని, క్రూర కోష్ఠ నకును విరేచనములు చక్కగ కాక కొంచెముగనైనచో వానికి లంకణము చేయించ వలెను. దానివలన స్నేహముచే కల్గిన కఫము హరించి దోషసంగము శమించును.

**ఆయుర్వేద దీపిక :** "సుస్నిగ్ధం" అను మొదలగువానిలో "అవిరేచితమ్" అనగా కొద్దిగా విరేచనము చేయబడినట్టి అని అర్థము. "స్నేహజ" అనగా స్నేహ ప్రయోగము ద్వారా పుట్టిన శ్లేష్మము. సఙ్గః అనగా దోషముల అవరోధము. ఆ లఙ్ఘనముచే దోషపాకము వలన ప్రబలమైన కఫము శమనము,దోష సంగము శమింపచేయుట చేయవలెనని అర్థము.

## విరేచనము కాకయే ఔషధము జీర్ణమైనచో చేయవలసిన విధి

79. రూక్ష-బహ్వానిల-క్రూరకోష్ఠ-వ్యాయామశాలినామ్
దీప్తాగ్నీనాం చ భైషజ్యమవిరిచ్యైవ జీర్యతి

80. తేభ్యో౽బస్తిం పురా దత్వా పశ్చాద్దద్యాద్విరేచనమ్
బస్తిప్రవర్తితం దోషం హరేచ్ఛీఘ్రం విరేచనమ్

**తాత్పర్యము :** రూక్షమైన కోష్ఠము కలవారికిని, కోష్ఠమున వాతము ప్రబలముగనుండు వారికిని, క్రూరమైన కోష్ఠము కలవారికిని, జఠరాగ్ని మిక్కిలి ప్రబలముగ నుండు వారికిని విరేచనౌషధము విరేచనముల గావింపకయే జీర్ణమగును. అట్టివారికి తొలుత వస్తి ప్రయోగము చేసి పిమ్మట విరేచనౌషధము నివ్వవలెను. అట్లు చేసినచో వస్తి ప్రయోగముచే స్వస్థానము నుండి చలించి బైట వెడలనున్న దోషమును విరేచనౌషధము శీఘ్రముగ బైట వెడలింపజేయును.

**ఆయుర్వేదదీపిక :** రూక్షమైనవారికి విరేచన ప్రయోగము నందు విశేష మైన క్రమమును సయుక్తికముగా చెప్పెను - "రూక్ష" అను మొదలగునవి. "బస్తింపురాదత్వా" అను ఇచ్చట బస్తి శబ్దము చేత స్నేహవస్తిని కోరుచున్నారు. నిరూహవస్తి వాతమును ప్రకోపింప చేయుట చేతను, నిరూహవస్తి అనంతరము విరేచనము నిషిద్ధము గావున ఇచ్చట కోరబడుట లేదు. "నిరూహదానాత్" "పవ నాద్భయం స్యాత్" (సి అ. 1.) అని చెప్పబడినదియేగదా. అటులనే "నరో విరిక్తస్తు నిరూహదానం వివర్జయేత్, సప్తదినాన్యవశ్యమ్ శుద్ధో నిరూహేన విరేచనం తు" (సి.అ.1.) అనియు చెప్పబడినది. కాని బస్తి శబ్దముచేత నిరూహము, స్నేహబస్తి గ్రహించబడుతుంది. నిరూహమునకు వాత ప్రకోపమేదైతే చెప్పబడినదో అది స్నేహబస్తి లేకుండా యిచ్చినపుడు జరుగును. సామాన్య సిద్ధాంతానుసారము వాత హరత్వము (వస్తికి) "బస్తిర్వాత హరాణాం" (సూ.అ.25.) అను దానిచేతనే చెప్పబడినది. నిరూహవస్తి తరువాత విరేచనము సామాన్యముగ నిషేధింపబడినది. దానిచేత విశేషమైన విధిననుసరించి దానిని అనుసరించకపోవుట యుక్తముగనే యుండును. (అనగా నిరూహవస్తి తరువాత విరేచన యివ్వవచ్చును.) కాని వస్తి తరువాత ఏ విరేచనము చెప్పబడినదో దానిని వస్తి యిచ్చిన ఏడు దినముల తరు వాత యివ్వనగునను దానికి ఏ విరోధము లేదు. "ప్రవర్తితం" అనగా చలించి బైట వెడలనున్న (దోషములు) అని అర్థము.

## విరేచనము కాకయే దోషములు చేయు వారికి చేయదగిన ఉపాయములు

81. రూక్షాశనాః కర్మనిత్యా యే నరా దీప్తపావకాః
తేషాం దోషాః క్షయం యాన్తి కర్మవాతాతపాగ్నిభిః

82. విరుద్ధాధ్యశనాజీర్ణ దోషానపి సహన్తి తే
స్నేహ్యాస్తే మారుతాద్రక్ష్యా స్సాహ్యాధౌ తాన్ విశోధయేత్

**తాత్పర్యము :** కేవలము రూక్షమైన యాహారమును భుజించువారికిని, నిరంతరముగా వ్యాయామము మున్నగు పనులనభ్యాసముగ జేయు వారికిని, మిక్కిలి దీప్తమైన జాఠరాగ్ని కలవారికిని, వాతాది దోషములు వ్యాయామాది కర్మల చేతను, గాలిచేతను, ఎండచేతను, నిప్పువేడిమి చేతను శమించియుండును. వారికి విరుద్ధాశనముచే నైనను, అధ్యశనముచే నైనను, అజీర్ణ భోజనముచేనైనను సంభవించు దోషములను వారు సహించెదరు. కావున వారికి వాతము వలన బాధ సంభవించ కుండునట్లు స్నేహమును చేయుటుచితము కాని, వ్యాధి శోధనము చేతనే సాధింప వలసినప్పుడు తప్ప సామాన్యముగ వారికి శోధనమునుపయోగింపరాదు

**ఆయుర్వేదదీపిక :**'రూక్షాశనాః' అని, మొదలగువానిచే స్నిగ్ధ కర్మల చేయవలెనుగాని వ్యాధి లేనిచో శోధనము చేయరాదని చెప్పెను. 'కర్మనిత్యా' అనగా ప్రతినిత్యము వ్యాయామాది కర్మలు చేయువారు. "విరుద్ధాఽధ్యశనాజీర్ణాన్ దోషాన్ సహన్తి" అనగా దోషరూపములైన విరుద్ధాహారము, అధ్యశనము, మొదలగునవి వారికి (రూక్షాశనులు, కర్మనిత్యులు మొ॥వారు) వ్యాధులు కలిగించదు అని అర్థము. విరుద్ధాహారము, అధ్యశనము, దోష ప్రకోపకారకము లగుటచే దోషశబ్దముచే చెప్పుచున్నారు. 'నావ్యాధౌ' అనగా సంశోధనము చేత సాధింపబడెడి వ్యాధి కానప్పుడు అటువంటివారికి శోధనము చేయరాదు అని అర్థము. ఈ విషయమునే స్థూలాంతరమున "అనీరితానాం దోషాణామీరణం న పశస్యతే ఉపర్యుపరి నస్తానామశ్మనామివ తాడనమ్" దోషములు బయటకు వెడలుటకు సిద్ధముగా లేనప్పుడు వాటిని రేపెట్టుటకై శోధనము చేయుట యుక్తముగాదు. అట్లు చేసినచో ఒకదానిపై నొకటి వరుసగ నమిడి బిగిసియుండు రాతిని పెకలించినచో అది కదలకయుండునట్లు దోషములు వెడలనేరవు. కావున స్వస్థానము నుండి చలింపకుండ దోషములను వెడలింపదగదని భావము) అని చెప్పబడినదని అర్థము.

## స్నిగ్ధ-రూక్ష విరేచనౌషధమును ఉపయోగింపదగినవారు-విధి పూర్వక సంశోధన ప్రయోజనము

83. నాతిస్నిగ్ధశరీరాయ దద్యాత్ స్నేహవిరేచనమ్
స్నేహోత్క్లిష్టశరీరాయ రూక్షం దద్యాద్విరేచనమ్

84. ఏవం జ్ఞాత్వా విధిం ధీరో దేశకాలప్రమాణవిత్
విరేచనం విరేచ్యేభ్యః ప్రయచ్ఛన్నాపరాధ్యతి

85. విభ్రంశో విషవద్యస్య సమ్యగ్యోగో యథాఽమృతమ్
కాలేష్వవశ్యం పేయం చ తస్మాద్యత్నాత్ ప్రయోజయేత్

**తాత్పర్యము :** మిక్కిలి స్నిగ్ధమైన శరీరము కలవానికి స్నేహరూపమైన విరేచనౌషధము నుపయోగింపజనదు. అట్టి స్నేహముచే దోషములు సడలియున్న వారికి రూక్షమైన విరేచనౌషధము నివ్వవలెను.

పై చెప్పబడిన సంశోధన విధానమును చక్కగా గమనించి, దేశ పరిస్థితిని కాల స్వభావము ఔషధము యొక్క పరిమాణమును చక్కగ తెలిసిన వైద్యుడు విరేచనమున కర్హులైనవారికి విరేచనౌషధము నిచ్చినచో పొరబాటు లేనివాడగును. మరియు సంశోధనౌషధమును చక్కటి విధానము ననుసరింపక వ్యతిరేకముగ నుపయోగించి నచో నది విషతుల్యమై హింసింపజూచును. సంశోధనము చక్కగ పనిచేసినచో అమృతమువలె కాపాడ సమర్థమై యుండును. కావున శోధనౌషధము నుపయోగింప దగిన సమయమున శోధనమునవశ్యముగా త్రాగింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** చెప్పబడిన విధియొక్క ఉపసంహారము (సమాప్తి) చెప్పెను. 'ఏవంజ్ఞాత్వా' అను మొదలగునవి. "విరేచేభ్యః" అనగా విరేచనార్హులకు అని అర్థము. 'విభ్రంశ' అను మొదలగువానిలో. 'యస్య' అనగా సంశోధనమునకు అని అర్థము. నిజముగా శోధనము వ్యతిరేకముగా నుపయోగించిన విషతుల్యమగు నని చెప్పెను. "కాలేష్వవశ్యం పేయంచ" అని. సంశోధన ద్వారా సాధ్యమైన వ్యాధి యందు అవశ్యముగా త్రాగవలెను అందుచేత అవస్థావిశేషము ననుసరించి చేయ దగినది అయి యుండుటచే శోధనమును విడిచిపెట్టుట సాధ్యముగాదు అని భావము.

## మాత్రాకల్పనవిధి

86. ద్రవ్యప్రమాణం తు యదుక్తమస్మిన్మధ్యేషు తత్ కోష్ఠవయోబలేషు
తన్మూలమాలమ్బ్య భవేద్వికల్ప్యం తేషాం వికల్పోఽభ్యధికోనభావః

**తాత్పర్యము :** ఈ శోధన ప్రకరణమున కొన్ని ద్రవ్యములకు ఔషధ ములకును ఉపయోగించుటకై కర్షము మున్నగు పరిమాణము అచ్చటచ్చట చెప్ప

బడినది. అట్టి ప్రమాణము మధ్య కోష్ఠములను, మధ్య వయస్సును, మధ్య బలమును ఉద్దేశించి చెప్పబడినది. కావున అట్టి ప్రమాణమును ప్రధానముగ జేసికొని కోష్ఠము, వయస్సు, బలము ఉత్తమముగ నున్నపుడు అధిక పరిమాణమును, కోష్ఠాదులు హీనములుగ నున్నపుడు తక్కువ పరిమాణమును కల్పించి తదనుసారముగ నుపయోగింపదగును.

**ఆయుర్వేదదీపిక :** ప్రస్తుతము శోధమునకు ఏదైతే కర్షము మొదలైన మానము చెప్పబడినదో అది పురుషులందరికి కాదు. కాని మధ్యమ కోష్ఠము, మధ్యమ వయస్సు, మధ్యమ బలము కలవారికి ఆ మానమని తెలుసుకొనవలెనని చూపించుచు చెప్పెను-"ద్రవ్యే" అను మొదలగునవి. 'తన్మూలమాలమ్బ్య' అనగా చెప్పిన ప్రమాణమును అనుక్త ప్రమాణమును అనుమాన ప్రమాణ ఆధారముచే గ్రహించవలెను. వికల్పమునకు చెప్పెను -"తేషాం వికల్పోఽభ్యధికోనభావ" అని ఔషధ ప్రమాణమునందు హెచ్చు తగ్గులు కల్పన కొరకు అని అర్థము.

## మాన పరిభాషా

87. షడ్ ధ్వంశ్యస్తు మరీచిః స్యాత్ షణ్మరీచ్యస్తు సర్షపః
అష్టౌ తే సర్షపా రక్తస్తణ్డులశ్చాపి తద్ద్వయమ్

88. ధాన్యమాషో భవేదేకో ధాన్యమాషద్వయం యవః
అణ్డికా తే తు చత్వారస్తాశ్చతస్రస్తు మాషకః

89. హేమశ్చ ధాన్యకశ్చోక్తో భవేచ్ఛాణస్తు తే త్రయః
శాణౌ ద్వౌ ద్రజ్ఞణం విద్యాత్ కోలం బదరమేవ చ

90. విద్యాద్వౌ, ద్రజ్ఞణౌ కర్షం సువర్ణం చాక్షమేవ చ
బిడాలపదకం చైవ పిచుం పాణితలం తథా

91. తిన్దుకం చ విజానీయాత్ కవలగ్రహమేవ చ
ద్వే సువర్ణే పలార్ధం స్యాచ్ఛుక్తిరష్టమికా తథా

92. ద్వే పలార్ధే పలం ముష్టిః ప్రకుఞ్చోఽథ చతుర్థికా
బిల్వం షోడశికా చామ్రం ద్వే పలే ప్రసృతం విదుః

93. అష్టమానం తు విజ్ఞేయం కుడవౌ ద్వౌ తు మానికా
పలం చతుర్గుణం విద్యాదఞ్జలిం కుడవం తథా

94. చత్వారః కుడవాః ప్రస్థశ్చతుఃప్రస్థమథాఢకమ్
పాత్రం తదేవ విజ్ఞేయం కంసః ప్రస్థాష్టకం తథా

95. కంసశ్చాతుర్గుణో ద్రోణశ్చర్మణం నల్వణం చ తత్
స ఏవ కలశః ఖ్యాతో ఘటమున్మానమేవ చ

96. ద్రోణస్తు ద్విగుణః శూర్పో విజ్ఞేయః కుమ్భ ఏవ చ
గోణీం శూర్పద్వయం విద్యాత్ ఖారీం భారం తథైవ చ

97. ద్వాత్రింశతం విజానీయాద్వాహం శూర్పాణి బుద్ధిమాన్
తులాం శతపలం విద్యాత్ పరిమాణవిశారదః
శుష్కద్రవ్యేష్విదం మానమేవమాది ప్రకీర్తితమ్

**తాత్పర్యము :** ఆరువంశీలు ఒక మరీచి అనబడును. ఆరు మరీచులు ఒక సర్షపమనియు,

| | | |
|---|---|---|
| ఎనిమిది రక్త సర్షపములు | = | ఒక తండులము, |
| రెండు తండులములు | = | 1 ధాన్యమాషము, |
| రెండు ధాన్యమాషములు | = | 1 యవ |
| నాల్గు యవలు | = | 1 అండిక |
| నాల్గు అండికలు | = | 1 మాష |

మాషమనునది హేమమనియు, ధాన్యకమనియు పర్యాయపదములచే చెప్పబడును. అట్టి మాషములు మూడు ఒక శాణమనబడును.

2 శాణములు = 1 కోలము. ఇది ద్రంక్షణము, బదరము అను పర్యాయ పదములచే చెప్పబడును.

2 ద్రంక్షణములు = 1 కర్షము. ఇది సువర్ణము, అక్షము, బిడాలపదకము, పిచువు, పాణితలము, తిందుకము, కవలగ్రహము అను పర్యాయపదములచే చెప్పబడును,

2 సువర్ణములు = 1/2 పలము ఇది శుక్తి, అష్టమిక అను పర్యాయ పదములచే చెప్పబడును.

2 అర్ధపలములు = 1 పలము ఇది ముష్టి, ప్రకుంచము, చాతుర్థిక, బిల్వము, షోడశిక, ఆమ్రము అను పర్యాయపదములచే పిలువబడును.

2 పలములు = 1 ప్రసృతము.

4 పలములు = 1 కుడవము. ఇది అంజలి, అష్టమానము అను పర్యాయ పదములచే చెప్పబడును.

2 కుడవములు = 1 మానిక

4 కుడవములు = 1 ప్రస్థము

4 ప్రస్థములు = 1 ఆఢకము-ఇది పాత్రము అను పర్యాయపదముచే చెప్ప బడును.

8 ప్రస్థములు = 1 కంసము

4 కంసములు = 1 ద్రోణము. ఇది అర్మణము నల్వణము, కలశము, ఘటము, ఉన్మానము అని పర్యాయపదములచే చెప్ప బడును.

2 ద్రోణములు = 1 శూర్పము, కుంభము

2 శూర్పములు = 1 గోణి. గోణి యనునది ఖారి, ఖారము అను పర్యాయ పదములచే చెప్పబడును.

32 శూర్పములు = 1 వాహము

100 పలములు = 1 తులా

ఈ విధముగ పరిమాణము తెలిసిన పండితులు చెప్పెదరు. ఏదైన ఒక యోగమునందు కొన్ని ద్రవ్యముల నిర్దేశించినపుడు ఆయా ద్రవ్యముల నిర్దేశించిన పరిమాణమును ఎండనెండిన ద్రవ్యములకు మాత్రము నియతముగ నుండును.

**ఆయుర్వేదదీపిక :** ద్రవ్య ప్రమాణము యొక్క ఉపోద్ఘాతము వలన సర్వశాస్త్రములందు వ్యవహరించబడిన ప్రమాణమును నిరూపించుచు చెప్పెను. 'షడ్ధ్వంశ్య' అను మొ॥నవి. ధ్వాంశి అనగా త్రసరేణుకమని చెప్పుచున్నారు. ఇతరులు ధ్వాంశి అనగా ధూళి (దుమ్ము) అని చెప్పిరి. "అష్టౌ తా సర్షపా

రక్తకృష్ణాలాః" అనుకోట రక్తమనునది సర్షపములకు విశేషణముగా గ్రహించవలెను. 'తద్ద్వయం' అనగా ధాన్య మాషము. రెండు తండులములు ఒక ధాన్యమాషయగును. "తే తు చత్వార" అనగా నాలుగు యవలని అర్థము. ఇతరులు నాలుగు మాషలు అణ్ణికా అని చెప్పుచున్నారు. మూడు మాషకలు ఒక శాణము ఈ మాసము నందు నలుబది ఎనిమిది మాషకములు ఒక పలమగును. అదే పదిరక్తికల మానముచే అరువది నాలుగు మాషకములు ఒక పలమునకు సమాన మగును. ఏ విధముగానైతే ధాన్యమాషములు పది రక్తికలకు సమానమగుచున్నవో ఆ విధముగా దశరక్తిమానమున అరువది నాలుగు మాషకలు ధాన్యమాషలచే గుణింపబడి 1536 (పదిహేనువందల ముప్పై ఆరు) మాషలే అగుచున్నవి. దాని చేత దశరక్తిక చతుః షష్టి ధాన్యమాష పలమానముతో కూడా 32 ధాన్యమాష ప్రమాణము 48 మాషములచే ఒక పలమనెడి మానమునకు సమానముగా నుండును. సుశ్రుతమునందు కూడా "తత్ర ద్వాదశ ధాన్యమాషాః స్వర్ణమాషకః తే చ చతుః షష్టిః పలమ్" (సు. చి. అ) అని స్థాపింపబడినది దానిచేత 64 మాషకలు, 32 ధాన్య మాషలచే గుణింపబడి 768 ధాన్యమాషలగుచున్నవి. ఈ విధముగా దృఢబలునిచే చెప్పబడిన మానమునకు సమ భాగముగా సుశ్రుతుని పలమానము అగును. ఈ విధముగా సుశ్రుతమునందు అయిదు రక్తికలు ఒక మాషమగును. దృఢబల మానము మాగధ మానమనియు, సుశ్రుత మానము కాలింగమాన మనియు చెప్పుచున్నారు. జతూకర్ణమునందు ఆరు గుంజలు మాషకమని చెప్పబడినది.

## ద్రవ్య-ఆర్ద్ర ద్రవ్యములకు ద్వైగుణ్య విధి

98. ద్విగుణం తద్ద్రవేష్విష్టం తథా సద్యోద్ధృతేషు చ
యద్ది మానం తులా ప్రోక్తా పలం వా తత్ ప్రయోజయేత్

99. అనుక్తే పరిమాణే తు తుల్యం మానం ప్రకీర్తితమ్

తాత్పర్యము : ఆ ద్రవ్యములలో కొన్నిటిని ఎండినవానిని, కొన్నిటిని ద్రవములను, కొన్నిటిని పచ్చిగను చేర్చునెడ అట్టి ద్రవార్ద్ర ద్రవ్యములను వానికి చెప్పిన పరిమాణమునకు ద్విగుణముగ చేర్చుకొనవలెను. ఎచ్చటైనను తులాశబ్దమును గాని, పల శబ్దమునుగాని పరిమాణమునకు నిర్దేశించియున్నచో నచ్చట మాత్రము ఆర్ద్ర ద్రవ్యమునకు ద్వైగుణ్యము (లేక) యథోక్త పరిమాణముగానే గ్రహింప వలెను. ఔషధయోగములందు ద్రవ్యముల మాత్రము నిర్దేశించి వానికి వేర్వేరుగ

పరిమాణమును నిర్దేశించకున్నచో ఆ ద్రవ్యములను సమభాగములుగ గ్రహింపవలెను

**ఆయుర్వేదదీపిక :** "ద్విగుణం తద్ద్రివేష్విష్టం" అను మొదగునవి. ఇచ్చట సామాన్యముగా ద్రవమునకు రెండు రెట్లు చెప్పబడినప్పటికీ ఇతర తన్త్రము లందు చూపిన విధముగా కుడవాదుల చేతనే ద్రవమునకు రెట్టింపు ప్రమాణము గ్రహించవలెను.

"రక్తికాదిషు మానేషు యవా కుడవో భవేత్ శుష్కే ద్రవార్ద్రయోశ్చైవ తుల్యం మానం ప్రకీర్తితమ్" అని చెప్పబడినదియే కదా! జతూకర్ణమునందు "ద్విగుణాః కుడవాదయో ద్రవాణామ్" అని కూడా చెప్పబడినది. ఇచ్చట కూడా సునిషణ్ణక చాంగేరీ ఘృతమునందు "త్రిశత్పలాని ప్రస్థోఽత్ర విజ్ఞేయో ద్విపలాధికః (చి. అ. 14)" అను వచనముచే ఆచార్యునిచే ప్రస్థ పరిభాషయందు రక్తికాదులందు ద్రవమును 2 రెట్లు గ్రహించుట అను ద్వైగుణ్య పరిభాషను సూచించుచున్నది అని ఇంతకుముందు ప్రతిపాదించబడినదియే. ఏ ద్రవ్యమైతే ఆర్ద్ర, శుష్కావస్థలను రెండింటియందు ఉపయోగించబడినచో దానికే ఆర్ద్రద్వైగుణ్యం (ఆర్ద్రావస్థలో ద్విగుణ ప్రమాణము గ్రహించుట) అన్వయిస్తుంది. ఏదైతే ఎప్పుడును ఆర్ద్రావస్థలోనే ఉపయోగించవలెనో దానికి ద్విగుణ ప్రమాణము వర్తించదు. "వాసా కుటజకూష్మాండ శతపత్రీ సహామృతాః ప్రసారణ్యశ్వగన్ధా చ శతపుష్పా సహాచరాః నిత్యమార్ద్రాః ప్రయోక్తవ్యా నతేషాం ద్విగుణం భవేత్" అని ఇతర ప్రదేశమునందు చెప్పబడినదియే. ఇతరములైనవాటికి రెట్టింపు ప్రమాణము చేసి మానమునకు రెండుసార్లు గ్రహించుట చేయవలెనని అర్థము

## స్నేహపాకమున ద్రవము నిర్దేశించనిచో జలము గ్రహించుట

100. ద్రవకార్యేఽపి చానుక్తే సర్వత్ర సలిలం స్మృతమ్
యతశ్చ పాదనిర్దేశశ్చతుర్భాగస్తతశ్చ సః

**తాత్పర్యము :** ద్రవముల చేర్చి సాధింపవలసిన తైలాది యోగములందు స్వరసకషాయాది భూప ద్రవవిశేషములను నిర్దేశించకున్నచో సామాన్యముగ

జలమును ద్రవమునకై గ్రహింపవలెను. ఎచ్చటైన పాదాంశమని నిర్దేశించినచో నాల్గవవంతని అర్థము.

**ఆయుర్వేదదీపిక :** పరిభాషయొక్క అంతరమును చెప్పెను "ద్రవ కార్యేఽపి" అను మొదలగునవి. స్నేహాదులను పాకము చేయునపుడు ద్రవ విషయమున ఎచ్చట ద్రవము చెప్పబడలేదో అక్కడ జలమును గ్రహించవలెనను అర్థము. "యతశ్చ పాద నిర్దేశశ్చతుర్భాగ స్తతశ్చా స" అనగా దీని అర్థము లోకమున ప్రసిద్ధమైనప్పటికినీ స్పష్టీకరించుటకు మరల చెప్పుచున్నాడు.

## స్నేహపాక పరిభాషా

101. జలస్నేహౌషధానాం తు ప్రమాణం యత్ర నేరితమ్
తత్ర స్యాదౌషధాత్ స్నేహః స్నేహాత్తోయం చతుర్గుణమ్

**తాత్పర్యము :** జలమునకును, స్నేహమునకును, కల్కౌషధమునకును పరిమాణము నిర్దేశింపబడకున్నచో అచ్చట కల్కౌషధముకన్న స్నేహమును, స్నేహముకన్న జలమును నాల్గింతలుండవలెను.

**ఆయుర్వేదదీపిక :** "జల స్నేహౌషధానాం" అను మొదలగువానిలో ఔషధముకంటె స్నేహము నాలుగు రెట్లని, అనగా కల్కముకంటె స్నేహము నాల్గురెట్లు గ్రహించవలెనని భావము. "స్నేహాత్తోయం చతుర్గుణం" అనగా తోయ శబ్దము ద్రవలక్షణము సూచించునుగాన ద్రవము నాలుగురెట్లు అని అర్థము గ్రహించవలెను. జలాదులకు ఎచ్చటవిశిష్టమైన మానము చెప్పబడినదో అచ్చట "నిర్దిష్టే త త్తదేవ తు" (సు. చి. 31) అను వచనానుసారము దానినే చేయవలెను. గ్రహించవలెను).

102. స్నేహపాకస్త్రిధాజ్ఞేయో మృదుర్మధ్యః ఖర స్తథా
తుల్యే కల్కేన నిర్యాసే భేషజానాం మృదుః స్మృతః

103. సంయావ ఇవ నిర్యాసే మధ్యో దర్వీ విముఞ్చతి
శీర్యమాణే తు నిర్యాసే వర్తమానే ఖర స్తథా

**తాత్పర్యము :** స్నేహపాకము మృదు-మధ్య-ఖర భేదములచే 3 విధములు. స్నేహమునందు కల్కాదులను యథోక్తముగ జేర్చి పక్వము చేయు

నపుడు అందు చేర్చబడిన ఔషధముల కల్కము, పక్వమగునపుడు ఆ కల్కముతో సమముగనేయున్నచో అది మృదుపాకము. స్నేహమునందడుగుననుండు కల్కమును గరిటెతో తీసి చేతపట్టి చూసినచో అది గరిటె కంటుకొనక నేతిని గోధుమ పిండితో కలిపి మర్దించి చేయబడిన యుండవలె చేతి కంటక మెత్తబడియున్నచో అది మధ్యపాకము. అట్టి కల్కమును పాకమగుచున్నపుడు గరిటెతో దీసి వ్రేళ్ళతో నలిపినచో అది కరకుగల్గి విడిపోవుచున్నచో అది ఖరపాకము.

**ఆయుర్వేదదీపిక :** త్రివిధ స్నేహపాక లక్షణములు చెప్పెను- "స్నేహపాక" అను మొ॥నవి. "తుల్యే కల్కేన నిర్యాస" అనగా ముందు చేర్చబడిన కల్కమునకు పక్వమైన కల్కము సమముగా నిర్యాసము (కొంచెము ద్రవముతో కూడియున్న కల్కము) నందు అని అర్థము. "సంయావ ఇవ" అనగా ఇచ్చట సంయావ శబ్దముచే నెయ్యి, బెల్లము, గోధుమ పిండితో కలిపి మర్దించి కణిక ఆకారంలో చేయబడిన పిండమని (ఉండవలె) చెప్పబడుచున్నది. "శీర్యమాణే" అను మొదలగునవి ఖరపాక లక్షణము. శీర్యమాణే అనగా విడిపోవుచున్నది అని అర్థము. వర్తమానే అనగా వ్రేళ్ళతో నలిపినచో వర్తి ఆకారమును పొందుచున్నదని అర్థము.

104. ఖరోఽభ్యఙ్గే స్మృతః పాకో, మృదుర్నస్తఃక్రియాసు చ
మధ్యపాకం తు పానార్థే బస్తౌ చ వినియోజయేత్

**తాత్పర్యము :** ఖరపాక మభ్యంగమునకు, మృదుపాకము నస్యకర్మకు, మధ్యపాకము త్రాగుటకు, వస్తి ప్రయోగమునకు ఉపయోగింపదగును.

**ఆయుర్వేదదీపిక :** ఖరపాకము మొదలగు విషయము చెప్పెను- 'ఖర' అను మొ॥నవి.

## మానద్వైవిధ్యము

105. మానం చ ద్వివిధం ప్రాహుః కాలిఙ్గం మాగధం తథా
కాలిఙ్గాన్మాగధం శ్రేష్ఠమేవం మానవిదో విదుః

**తాత్పర్యము :** కాలింగమానమనియు, మాగధమానమనియు మానము రెండు విధములు. అందు కాలింగమానముకన్న మాగధమానము శ్రేష్ఠమని పరిమాణమును చక్కగ తెలిసిన వైద్యవరులు చెప్పెదరు.

**ఆయుర్వేదదీపిక :** "కాలిజ్గం" అను మొదలగు శ్లోకమును కొంతమంది చదువుచున్నారు. దానిని అనార్షమని చెప్పుచున్నారు.

## కల్పస్థానోక్తవిషయసంగ్రహము

తత్ర శ్లోకా-

106. కల్పార్థః శోధనం సంజ్ఞా పృథక్తేతుః ప్రవర్తనే
దేశాదీనాం ఫలాదీనాం గుణా యోగశతాని షట్

107. వికల్పహేతుర్నామాని తీక్ష్ణమధ్యాల్పలక్షణమ్
విధిశ్చావస్థికో మానం స్నేహపాకశ్చ దర్శితః

**తాత్పర్యము :** శోధనౌషధమును పలు విధముల కల్పించుటకు ప్రయోజనము, వమన విరేచనములకు శోధన సంజ్ఞ, శోధనౌషధములు కొన్ని వమన రూపముగ ఊర్ధ్వ మార్గముగను, విరేచన మూలమున అధోమార్గముగను దోషముల వెడలించుటకు వేరు వేరు కారణములు, జాంగలాది దేశములు మున్నగువాని యొక్కయు, మ్రంగకాయి మొ॥వాని యొక్కయు వేర్వేరు గుణములు, అట్టి ఔషధములచే వేర్వేరుగ కల్పింపబడిన 600 శోధనౌషధ యోగములు, శోధన యోగముల పలు విధములుగ కల్పించుటకు కారణము, మ్రంగకాయ మొ॥గు శోధనౌషధముల పర్యాయనామములు, శోధనౌషధముల యొక్క తీక్ష్ణ-మధ్య-మృదు-లక్షణములు, అవస్థా భేదము ననుసరించి శోధనౌషధమునుపయోగించు విధానము, ద్రవ్యమాన పరిభాష, త్రివిధ స్నేహ-పాక భేదములు వాని లక్షణములు ఇవన్నియు ఈ కల్పస్థానమున వివరముగ చెప్పబడినవి.

**ఆయుర్వేదదీపిక :** "కల్పార్థః" అను మొదలగునవి స్థానము యొక్క సంగ్రహము. "కల్పార్థం భేదార్థః" (క.అ.1) అను మొదలగువానిచే కల్పమునకు సంబంధించిన విషయములు చెప్పబడినది. శోధన సంజ్ఞ "ఉభయం వా శరీరముల విరేచనాత్" (క.అ.1) అను మొ॥గువానిచేత చెప్పబడినది. "పృథక్తేతుః ప్రవర్తనే" అనగా తత్రోష్ణ తీక్ష్ణ విరాశి (క.అ.1) అను మొ॥గువానిచే చెప్పబడినది. దేశముల యొక్క గుణములు "తత్రదేశస్తు" (క.అ.1) అను మొ॥గువానిచే చెప్పబడినది. ఫలము మొ॥వాని గుణములు మదనఫల కల్పమునందే చెప్పబడినవి. "యోగశతాని షట్" అనగా "త్రిశతం పఞ్చవృఞ్చాశత" అను మొ॥ వానిచే చెప్పబడినవి.

కల్పనకు చేయు కారణములు "ఉపభోగసుఖార్థం" (క అ.1) అను మొదలగువానిచే ప్రథమాధ్యాయమునందు చెప్పబడినది. నామాని అనగా మదనఫలము మొదలగువాని పేర్లు. అవి ప్రథమాధ్యాయమునందే చెప్పబడినవి. "తీక్ష్ణమధ్యాల్పలక్షణ" అనగా "సుఖం క్షిప్రం మహావేగం" (క.అ.12) అను మొదలగువానిచే చెప్పబడినది. "విధిశ్చావస్థికః" అనునది "దేయం హ్యానిర్గతే పూర్వం" (క.అ.12) అను మొదలగు వానిచే చెప్పబడినది. మిగిలినది తేటతెల్లము బోధపడును.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతేఽప్రాప్తే దృఢబలసమ్పూరితే కల్పస్థానే దన్తీద్రవన్తీకల్పో నామ ద్వాదశోఽధ్యాయః

ఈ విధముగా లభ్యము కాతపోవుటచే దృఢబలునిచే పూరింపబడిన చరకుని ద్వారా ప్రతిసంస్కరింపబడిన అగ్నివేశకృత తన్త్రిమందలి కల్పస్థానములో దన్తీ ద్రవన్తీ కల్పమను పన్నెండవ అధ్యాయము.

శ్రీచక్రపాణిదత్తవిరచితాయామాయుర్వేదదీపికాయాం చరకతాత్పర్యటీకాయాం కల్పస్థానే దన్తీద్రవన్తీకల్పో నామ ద్వాదశోఽధ్యాయః

శ్రీ చక్రపాణి దత్తునిచే రచింపబడిన ఆయుర్వేదదీపిక అనెడు చరక తాత్పర్య టీకాయందు కల్పస్థానములో దన్తీ ద్రవన్తీ కల్పము అను పేరుగల పన్నెండవ అధ్యాయము.

# పరిశిష్టము

చరక సంహిత కల్పస్థానమునందు వమన, విరేచన కర్మల కుపయుక్తమగు పదిహేను ప్రధాన ద్రవ్యములను, వానినాధారంగా అనేక కల్పనా యోగములను పేర్కొనెను. మదనఫలము (మంగకాయ), జీమూతకము (దావరదంగి), ఇక్ష్వాకు (చేదుసొర), ధామార్గవ (పెద్దచేదుబీర), వత్సక (కొడిసెపాల), కృతవేధన (చిన్న చేదుబీర) అను ఆరు ఔషధము పేరిట మొదటి ఆరు అధ్యాయములందు వమన యోగ కల్పనలు పేర్కొనబడినవి. వీటిలో ప్రస్తుత కాలమున వైద్యులు మదన ఫలాన్నే వమన కర్మలలో ఉపయోగించుచున్నారు. మిగిలినవి వాడుతున్నట్లు కన బడుటలేదు. అయితే ఈ ద్రవ్యముల గుర్తింపులో సందిగ్ధత లేదు.

శ్యామా (నల్లతెగడ), త్రివృత్ (ఎర్రతెగడ), చతురఙ్గుల (రేల), తిల్వక (లొద్దుగ?), సుధా (జెముడు), సప్తలా (సంబరేణు?), శఙ్ఖినీ (దింటెన) దన్తీ (చిన్న నేపాలము), ద్రవన్తీ (పెద్ద నేపాలము) అను తొమ్మిది ఔషధముల పేరిట మిగిలిన ఆరు అధ్యాయములందు విరేచనయోగ కల్పనలను చరకుడు పేర్కొనెను. ఈ ద్రవ్యములలో శ్యామా, తిల్వక, సప్తలా, శఙ్ఖినీ, దన్తీ, ద్రవన్తీ అను ఓషధుల గుర్తింపులో కొంత సందిగ్ధతగలదు. తెలుగు అనువాదకులు మాత్రము ఏవో ఒక ప్రాంతీయ నామము తమ అనువాదములో పేర్కొనడం జరిగింది. పండిత నుదురు పాటి విశ్వనాథశాస్త్రిగారు సూచించిన ప్రాంతీయ నామములు ఈ అనువాదమున కూడా పేర్కొన్నప్పటికీ ద్రవ్యగుణ శాస్త్రరీత్యా యే యే ద్రవ్యములను గ్రహించ వలెనో, వాటిలో గల సందిగ్ధతను వివరించుటకు ఈ పరిశిష్టము వ్రాయబడింది.

చరకుడు శ్యామా, అరుణ అను రెండు రకముల త్రివృత్‌లను పేర్కొనగా సుశ్రుతుడు మహాశ్యామా అను మూడవ రకము కూడా వివరించెను. శ్యామా మరియు మహాశ్యామా అను రెండు రకముల తెగడలు వృక్షశాస్త్రరీత్యా ఇప్పటివరకూ నిర్ధారించ బడలేదు.

తిల్వకమునకు లోధ్ర అను పర్యాయనామము పేర్కొనబడింది. లోధ్రకు తెలుగులో లొద్దుగ అను ప్రాంతీయ నామము యివ్వబడింది. దీనినాధారంగా తిల్వక లొద్దుగ అని అనువదించారు కాని లోధ్రకు గ్రాహి కర్మ పేర్కొనబడినదే గానీ రేచనకర్మ వివరించలేదు. అందువలన తిల్వకకు లొద్దుగ అను పేరు పొసగదు ఇది లోధ్రకంటే భిన్నమైన ద్రవముగా గ్రహించవలెను.

సప్తలాను సంబరేణు అని కొంతమంది భావించగా, చర్మసాహ్వా, చర్మకిశ బహుఫేనరస అను సంస్కృత పర్యాయముల ఆధారంగా సీకాయ (షీకాకాయ) కొందరు పరిగణించుచున్నారు. సంబరేణి (బకోపా మోనిమెరి)ను బ్రాహ్మిగా కొ

గుర్తించుచున్నారు. ఇది రేచనకర్మకు ప్రధానంగా వాడుతున్నట్లు కనబడుటలేదు. దాని మూలములందు అట్టి కర్మయున్నట్లు గమనించబడలేదు. సీకాయి ఫలము ఎక్కువ ప్రమాణములో సేవిస్తే వామకముగాను, రేచకముగాను పనిచేయును. కాని చరకుడు సప్తలాయొక్క ప్రయోజ్యాంగము మూలముగా పేర్కొనుటచే సీకాయను సప్తలాగా గ్రహించడం అసమంజసముగా యుండును. ప్రస్తుత కాలమున సీకాయ మూలమును విరేచనముకొరకు వాడుచున్నట్లు కనపడుటలేదు. దింటెనను శంఖినీగా గుర్తించుచున్నారు. చరకుడు కొంచెముగ ఎండియుండు ఫలములను రేచన కర్మకుపయోగించవలెనని పేర్కొనెను. దింటెన (క్లైటోరియా టెర్నాటియా) యొక్క మూలము మరియు ఫలములందు రేచనకర్మ గలదు. దాని విత్తనాలు నేపాలపు గింజలవలె చాలా తీవ్రరేచకముగా పనిచేయును. అందుమూలయిన దింటెనను శంఖినిగా పరిగణించవచ్చును. సప్తలాను కూడా దింటెనవంటి మొక్కలతో గుర్తించిన సమంజసముగా యుండునేమో ఆలోచించవలసియున్నది.

దన్తీ, ద్రవన్తీలను నేపాలము, దాని యొక్క భేదముగా పరిగణించుచున్నారు. చరకుడు దన్తీ, ద్రవన్తీల ప్రయోజ్యాంగము మూలముగా పేర్కొనగా వాడుకలో బీజములను ఉపయోగించుచున్నారు. అందువలన వీటి గుర్తింపు విషయములో చర్చించవలసియున్నది.

**చరకసంహితయందుదహరించిన ద్రవ్య ప్రయోజ్యాంగములు**

| ద్రవ్యములు | ప్రయోజ్యాంగములు |
|---|---|
| 1. మదనఫలము | బీజము |
| 2. జీమూతకము | పుష్పము, ఫలము |
| 3. ఇక్ష్వాకు | ప్రవాలము, పుష్పము, ఫలము |
| 4. ధామార్గవ | ఫలము, పుష్పము, ప్రవాలము, బీజము |
| 5. వత్సకము | ఫలము (బీజము) |
| 6. కృతవేధన | పుష్పము, బీజము, ఫలము |
| 7. శ్యామా-త్రివృత్ | మూలము |
| 8. చతురఙ్గుల | ఫలమజ్జ |
| 9. తిల్వక | మూలత్వక్ |
| 10. సుధా | క్షీరము |
| 11. సప్తలా | మూలము |
| 12. శంఖినీ | ఫలము |
| 13. దన్తి-ద్రవన్తీ | మూలము |

# మదన ఫలము

**పర్యాయ నామములు :**

ఛర్దన (వాంతిని కలిగించునది)
మదన (హర్షము లేదా గ్లానిని కలుగ చేయునది)
విషపుష్పక (విషముగల పువ్వులను కలది)
శల్యక (ముండ్లను కలిగి యుండునది)
పిండీతక (ఫలము పిండివలె వుండునది)
పిండీ.

చరకుడు "వమన ద్రవ్యాణాం మదన ఫలాని శ్రేష్ఠతమాని" వమన ద్రవ్యము లందు మదన ఫలమును శ్రేష్ఠ ద్రవ్యముగా వివరిస్తూ అది ఆస్థాపన, అనువాసన వస్తు లందు కూడా ఉపయోగార్హముగా పేర్కొనెను. కానీ వమనోపగ దశైమాని యందు మదనఫలమును ఉల్లేఖించలేదు. మదన ఫలములను ఎండబెట్టి చూర్ణించి, తేనె, సైంధవ లవణమును చేర్చి పానము చేయించిన బాగుగా వమనము అగునని సుశ్రు తుడు వివరించెను (సూ. 43.) మదన ఫలము శ్వేత, కృష్ణ భేదములచే రెండు విధములని నిఘంటువులందు వర్ణింపబడినది. అందు నల్లగ నుండు ఫలము చిన్న, పెద్ద భేదముచే రెండు విధములుగా నుండును. ఇదియే వమన కర్మయందు శ్రేష్ఠ మని చెప్పబడినది. వమన కర్మయందు మదన ఫల ప్రయోగ విధి వివరణ చరక సంహిత (క.స్థా.1.) యందు విపులముగా వర్ణింపబడినది.

తె · ప్రా. నామము : మంగకాయ - హిం మైనఫల. బెం : మైనఫల మ . గెలఫల గు మీండోల్ . క : మంగరికై, త : మరకలము

**లాటిన్ నామము :**

రాండియా డ్యుమెటోరం లామార్క్ (Randia dumetorum Lamark)

**కుటుంబము :**

రూబియేసి (Rubiaceae)

ఇది సుమారు నాలుగు మీటర్ల ఎత్తు వరకు పెరిగే ముండ్ల మొక్క లేదా చిన్న వృక్షము. కొమ్మలు దృఢంగా, పొడవుగా, అభిముఖంగా వుంటాయి. స్థూలాన్య

పత్రాలు కణుపుకు రెండు చొప్పున అభిముఖంగా వుంటాయి. పత్రాలు సుమారు 4 సెం. మీ. పరిమాణంలో మృదులంగా గానీ లఘుకేశయుతంగా గానీ వుంటాయి. పత్రాలు చివరి భాగంలో వెడల్పుగాను, క్రింద భాగంలో సన్నగా వుంటాయి. పత్ర వృంతము పొట్టిగా ఉంటుంది. పత్రపువ్వాలు అండాకారంలో వారాగ్రము కలిగి ఉంటాయి. తెల్ల పుష్పాలు రెండు మొదలు మూడు వరకు గ్రీవస్థంగా పుష్ప విన్యాస వృంతంపై అమరి ఉంటాయి. పుష్పాలు రాలిపోయేముందు పసుపుపచ్చగా మారుతాయి. పుష్పాలు ఉపవృంతయుతాలు. పుష్పాలు సంపూర్ణము, ద్విలింగకము, అండకోశపరికము, రక్షక పత్రాలు సంయుక్తము, ఆకర్షణ పత్రావళి 2 సెం. మీ. వ్యాసార్థంలో ఉంటుంది. ఆకర్షణ పత్రాలు అండాకృతిలో గాని, దీర్ఘ చతురస్రాకారంలో గాని ఉంటాయి. కేశరాల సంఖ్య ఐదు. పరాగకోశాలు సన్నగా ఉంటాయి. అండకోశము ద్విఫలదళసంయుక్తము. కీలము పొట్టిగా ఉంటుంది. కీలాగ్రము కండె ఆకారంలో ఉంటుంది. ఫలము మృదు ఫలము. ఫలాలు గుండ్రంగా లేదా కోలగా ఉంటాయి. ఫలాలు 4 సెం. మీ. పరిమాణంలో మృదులంగా గాని లఘు కేశాలతో గానీ పసుపుపచ్చ రంగులో ఉంటాయి. విత్తనాలు తప్పెడగా గుజ్జులో ఉంటాయి.

ఈ వృక్షము యొక్క మాను గట్టిగా ఉంటుంది. ఈ వృక్షము ఆంధ్ర ప్రదేశ్ అంతటా పెరుగుతుంది.

## రసాయనిక సంఘటన :

ఫలము నందు సపోనిన్ (Saponin), ఫలమజ్జ యందు టానిన్, సుగంధిత తైలము, బీజములందు ప్యూసిలేజ్, ప్రొటీన్, తైలము మొదలగు అంశములుండును.

# జీమూతకము

**పర్యాయనామములు :**

దేవదాలీ, గరాగరీ

తెలుగు : డావరడంగి హిం · ఘఘరబేల్, బెంగా . ఘోషాలతా, మరాఠీ దేవడాంగరీ, గుజ కుసడబేల్, కర్నా దేవడాగంలీ

**లాటిన్ నామము :**

లుఫా ఇఖైనేటా రాక్స్‌బర్గ్ (Luffa cetinata Roxb)

**కుటుంబము :**

కుకుర్బిటేసీ (Cucurbitaceae)

ఇది సుమారు ఐదు మీటర్ల వరకు ఎగబ్రాకే తీగ. దాదాపు హృదయా కారంలో ఉన్న సామాన్య పత్రాలు ఏకాంతరంగా అమరి ఉంటాయి. పత్రాలు 5 కోణాల అంచులు కలిగి ఉంటాయి. తెల్లని స్త్రీ పురుష పుష్పాలు అగ్రస్థమైన అని శ్చిత పుష్ప విన్యాసంలో ఒకే తీగ మీద వస్తాయి. ఫలాలు దీర్ఘ వృత్తాకారంలో దృఢమైన కేశాలచే కప్పబడి ఉంటాయి.

ఆంధ్రదేశమున డావరడంగి అను పేరుతో పాసిఫ్లోరా ఫేటిడా అను మొక్కను గ్రహించుచున్నారు. దీనిలో వమనము చేయు గుణమున్నదో లేదో పరిశీలించవలసి యున్నది.

# ఇక్ష్వాకు

**పర్యాయనామములు :**

కటుతుంబీ, తిక్తాలాబు, పిండఫలా

తె : చేదు అనప, చేదు సొర, హిం : తితలౌకీ, బెం . తితలావో, మ : కడు, భోపలా గుజ . కడవీతుంబరీ

**లాటిన్ నామము :**

లాజినేరియా లూకాంథా డుకార్ట్రెస్, రస్బి (Lagenaria leucantha (Duch) (Rusby)

**కుటుంబము :**

కుకుర్బిటేసీ (Cucurbitaceae)

ఇది సుమారు పదిమీటర్ల పొడవు వరకు పెరిగే ఏకవార్షికపాదు. సామాన్య పత్రాలు హృదయాకారంలో ఏకాంతరంగా అమరి ఉంటాయి. తెల్లవిగా, పెద్దవిగా ఉన్న స్త్రీ పురుష పుష్పాలు ఏకాంతరముగా అమరి ఉంటాయి. ఫలాలు తప్పెడగా గానీ, కోలగా గానీ, గుండ్రంగా గానీ వుంటూ అనేక విత్తనాలు కలిగి ఉంటాయి.

ఈ మొక్కను భారతదేశము నందంతటా పండిస్తారు. దీనినే ఇంతకు పూర్వము లాజినేరియా వల్గారిస్ సెరింజ్ (Lagenaria Valgaris Ser) అని పిలిచేవారు.

# ధామార్గవ

## పర్యాయనామములు

మహాకోశాతకీ, మహాజాలినీ.

తెలుగు : నేతిబీర, హిందీ : నేనువా, బెంగాలీ - ఘుస్తుల
గుజ : గులకా, మరాఠి ఘోసాళై, తమిళము . పిచుక్క

## లాటిన్ నామము :

లుఫా ఈజిప్టియోకా మిల్లర్-ఎక్స్-హూక్కర్ ఫిలియస్- (Luffa aegyptioca Mill ex. Hook. f)

## కుటుంబము :

కుకుర్బిటేసీ - (Cucurbitaceae)

ఇది కేశయుతమైన నులితీగల ఏక వార్షికపు తీగ. వర్తులాకారంగా వున్న, ఐదు కోణాల అంచుగల సామాన్య పత్రాలు ఏకాంతరంగా అమరి వుంటాయి. పసుపు పచ్చగా వున్న స్త్రీ పురుష పుష్పాలు ఒకే తీగపై అమరి వుంటాయి. ఫలము పొడవుగా వుండి నల్లని విత్తనాలను కలిగి వుంటుంది.

భారతదేశమంతటా ఈ మొక్క పెరుగుతుంది. తరచుగా ఈ మొక్కను పండిస్తారు.

# వత్సకము

## పర్యాయనామములు

గిరిమల్లిక : (గిరిమల్లి వృక్షమును అనుకరించునది లేదా మల్లి పుష్పము వంటి పుష్పములతో కొండపై పెరుగునది)

వత్సక : (వత్సకమను దేశమున ఉత్పన్నమగునట్టిది)

కాళింగ : (కళింగదేశము నందు ఎక్కువగా లభించునది)

ఇంద్రవృక్ష :

బీజనామములు : యవ, ఇంద్రయవ, భద్రయవ, కలింగ

కుటజ వృక్షము పొడవగు పత్రములు, తెల్లని పుష్పములు, శింబీ ఫలములు కలిగియుండునని శివదత్తుడు వర్ణించెను. చరకుడు పురుష కుటజ, స్త్రీ కుటజ (చ.క.స్థా-5) అను రెండు భేదములను పేర్కొనుచూ, పురుష కుటజము తెల్లని పుష్పములు, నున్నటి పత్రములు, పెద్ద ఫలములు కలిగియుండుననియూ, స్త్రీ కుటజము అరుణ వర్ణ పుష్పము, చిన్న ఫలము, శ్యామ వర్ణముగల త్వక్‌ను కలిగి యుండుననియు వివరించెను డల్హణుడు పెద్ద ఫలములు, తెల్లని పుష్పములు, నున్నటి ఆకులు గలిగినది పుంకుటజగాను, చిన్నదైన ఫలవృంతము కల్గి, శ్యామారుణ వర్ణము గల పువ్వులు గలది స్త్రీ కుటజగను పేర్కొనెను. వీనినే కొంతమంది ఆచార్యులు సిత - అసిత (తెలుపు - నలుపు) అను భేదముచే కుటజను రెండు విధములుగా వర్గీకరించినారు. ప్రాచీనాచార్యుల పురుష కుటజను సితకుటజగాను, స్త్రీ కుటజను అసిత కుటజగాను గ్రహించవచ్చును. ఆధునిక విద్వాంసులు పుంకుటజ (సిత)ను 'హొలరీనా యాంటి డీసెంటిరికా' గాను, స్త్రీ కుటజ (అసిత)ను "రైటియా టింక్టోరియా" గాను గ్రహించుచున్నారు. ఆచార్య ప్రియవత శర్మగారు 'రైటియాటోమెంటోసా' అనెడి వృక్షమును అరుణ వర్ణ పుష్పములు కలిగి యుండుటచే స్త్రీ కుటజగా గ్రహించవలెనని తమ అభిప్రాయమును తెలిపినారు. ఠాకూర్ బలవంత్ సింగ్‌గారు 'రైటియాటింక్టోరియా', 'రైటియాటోమెంటోసా' లను శ్వేత కుటజ (సిత) యొక్క పురుష, స్త్రీ భేదములుగా గ్రహింపవచ్చును అని పేర్కొనినారు.

On a Comparision of the Shape of the fruits of W. Tomentosa (two follicles sub cylendrical and connate throu-

ghout), W. Tinctoria (two follicles cohering at their tips only) and H. anti dyscenterica two follicles distinct, the first two species may also be called made and female varieties of Swetha Kutaja....

ఆ యా వృక్షముల స్వరూప వర్ణన క్రింద వివరింపబడుచున్నవి.

తెలుగు. ప్రా/నా. కొడిశెపాల, హిందీ. కుడా, మరాఠి: పారడరాకుడా, గుజరాత్ · కడో, కన్నడ కొరాసిమిన్, తమిలం · కోడిగపల

**లాటిన్ నామము :**

హోలరినా ఆన్టిడిసెంటిరికా (లిన్నెయస్) వాలక్ ఎక్స్. జి. డాన్ (Holarrhena anti dysentirica (Linn) wall. Ex. G. Don.

**కుటుంబము :**

అపోసైనేసి (Apocynaceae)

ఇది సుమారు 4-5 మీటర్ల ఎత్తువరకు పెరిగే చిన్నవృక్షము. సామాన్య పత్రాలు దీర్ఘ అండాకారం కలిగి అభిముఖంగా అమరి వుంటాయి. పత్రాలు ఋజు ఉపాంతము, తీవ్రాగ్రము కలిగి వుంటాయి. పత్రవృంతము 0.5 సెం॥మీ. వుంటుంది. తెల్లని పుష్పాలు నిశ్చిత పుష్ప విన్యాసంలో గుత్తులుగా వుంటాయి. పుష్ప పుచ్ఛములు చిన్నవిగా ఉంటాయి. పుష్పము వృంతయుతము, ద్విలింగకము, అండకోశాధస్థితము రక్షక పత్రాల సంఖ్య ఐదు. ఆకర్షణ పత్రాలు ఐదు. సంయుక్తము. ఆకర్షణ పత్రాల గొట్టం సన్నగా వుండి తమ్మెలు దీర్ఘచతురస్రాకారంలో ఉంటాయి. అండాశయము ద్విఫల దళయుతము. కేలము పొట్టిగా ఉంటుంది. ఫలము ఏకవిదార ఫలము (follicle). ఫలాలు సన్నగా పొడవుగా జంట, జంటలుగా ఉంటాయి. విత్తనాలు పొడవుగా వుండి ఒక కొనకు బూడిద వర్ణంలో గల పొడవైన కేశాలు కల్గి వుంటాయి. మే, జూలై నెలలో పుష్పములను కల్గి వుండును. ఈ వృక్షము ఆంధ్రప్రదేశ్ అరణ్యాలన్నిటిలో పెరుగును.

**రసాయనిక సంఘటన :**

దీని త్వక్ మరియు బీజములందు కుర్చిసిన్ లేదా కానిసైన్ ((Kurchicine or Conessine), హోలారిన్, కుర్చిన్ అను అంశములు గలవు. బీజములందు తైలము కూడా గలదు.

1. తె/ప్రా. నా. తెడ్లపాల

**లాటిన్ నామము :**

రైటియా టిన్క్టోరియా రాబర్ట్‌బ్రౌన్ (Wrightia tinctoria Robert Brown)

**కుటుంబము :**

అపోసైనేసీ (apocynaceae)

ఇది సుమారు 5-6 మీటర్ల ఎత్తు పెరిగే వృక్షము. గిచ్చితే పాలు వస్తాయి. సామాన్య పత్రాలు అభిముఖంగా ప్రతి కణుపువద్ద అమరి వుంటాయి. పత్రములు దీర్ఘ చతురస్రాకారంలో గాని, అండాకారంలో గాని ఉంటాయి. పత్రాలు ఋజా ఉపాంతము తీవ్రాగ్రము కల్గివుంటాయి. తెల్లని పుష్పాలు నిశ్చిత పుష్పవిన్యాసంలో గుత్తులుగా అమరి వుంటాయి. ఫలములు 12-36 సెం. మీ. పొడవుగా సన్నగా గుండ్రముగా, నున్నగా, జంటగా వుండి కొనలు కలిసివుంటాయి. ఈ వృక్షము పట్ట తెల్లగా మృదులంగా వుంటుంది. దీని బీజములు 'హోలరినా యాన్టి డిసెంటిరికా' యొక్క బీజముల కంటె తక్కువ చేదుకలిగి యుండును.

3. **లాటిన్ నామము :**

రైటియా టొమెంటోసా (wrightia tomentosa Roew & Schult)

**కుటుంబము :**

అపోసైనేసీ (apocynaceae)

ఇది సుమారు 5-6 మీటర్ల ఎత్తు పెరిగే చిన్న వృక్షము. సామాన్య పత్రాలు అండాకారంలో గాని, విపరీత అండాకారంలో గాని అభిముఖంగా కాండం మీద అమరి వుంటాయి. పత్ర ఉపరితలం రెండువైపులా ఘనరోమయుతమై (tomentose) వుంటుంది. ఎండిన పత్రాలు నలుపు గోధుమరంగులో వుంటాయి. పసుపు పచ్చని పుష్పాలు నారింజరంగు ఉపాంగాలలో సమశిఖి పుష్ప విన్యాసంలో అమరివుంటాయి. ఫలము ఏక విదారకము. ఫలములు సన్నగా పొడవుగా కలిసి వుంటాయి. ఫలము కలిసినంత మేర అంతా నొక్కి వుంటుంది. విత్తనాలు పొడవుగావుండి ఒక చివర తెల్లని కేశాలు ఉంటాయి. ఈ వృక్షము పట్టు బూడిదవర్ణంలో వుంటుంది. ఈ వృక్షము హిమాలయ ప్రాంతాల్లోను, కర్నాటక రాష్ట్రి అరణ్యాలలోను పెరుగుతుంది. దీని పట్ట ప్రదర వ్యాధులు, వృక్క రోగములందు ఉపయుక్తము.

# కృతవేధన

**పర్యాయనామములు :**

కృతవేదన, మృదంగఫల, జాలినీ-

తెలుగు : బీరకాయ. హిందీ : తోరయీ, బెంగాలీ : ఘోషాలతా, గుజరాతీ . తురీయా; కర్నాటక : హీరే.

**లాటిన్ నామము :**

లుఫా ఎక్యుటాంగ్యులా రాక్స్‌బర్గ్ (luffa acutangula Roxb.)

**కుటుంబము :**

కుకుర్బిటేసీ (cucurbitaceae)

ఇది సుమారు ఆరుమీటర్ల పొడవు వరకు పెరిగే ఏకవార్షిక పాదు. పత్రాలు హృదయాకారంలో ఐదుకోణాల అంచులు కలిగి ఏకాంతరంగా అమరివుంటాయి. స్త్రీ పురుష పుష్పాలు పసుపురంగులో వుంటాయి. ఫలాలు పొడవుగా పదునైన కోణాలతో వుంటాయి. ముదిరిన కాయలో పీచు వుంటుంది. విత్తనాలు నల్లగా వుంటాయి.

ఈ మొక్కను భారతదేశంలో పండిస్తారు. లుఫా అక్యుటాంగ్యులా లిన్నేయస్ - రాక్స్‌బర్గ్ (luffa acutangula linn. Roxburg)ను రాజ కోశాతకీగా గ్రహిస్తున్నారు.

భావమిశ్రుడు మహాకోశాతకీ అను మరియొక భేదమును వర్ణిస్తూ దానికి ధామార్గవ, ఘోషక మొదలగు పర్యాయములు పేర్కొనెను (lufa cylendrica (linnu-) M. J Roem (smooth Luffa sponge, gourd)ను ధామార్గవగా గ్రహిస్తున్నారు.

# త్రివృత్

**పర్యాయనామములు :**

త్రివృత్ : (మూడు కోణములు లేదా అంచులతో ఆవరింపబడినట్టి కాండము లేదా మూలము కలది.

సర్వానుభూతి : (ఎల్లరచే సేవింపబడునది)

సరలా : (సౌమ్య గుణము కలది)

రేచనీ (మలరేచనము చేయునది)

త్రిభండీ (మూడు దోషములను బయటకు వెడలించునది)

పాలింది · (రోగము నుండి రక్షించునది)

సువహా : త్రిపుటః అర్ధచంద్రాః సుషేణికా.

చరక సంహిత యందు అరుణ, శ్యామా భేదములచే త్రివృత్ రెండు రకములుగా పేర్కొనబడినది. భావమిశ్రుడు శ్వేత త్రివృత్, శ్యామా త్రివృత్ అను రెండు భేదములను వర్ణిస్తూ "శ్యామా త్రివృత్తతో హీనగుణా తీవ్రరేచనీ" అనుచూ శ్యామా త్రివృత్ తీవ్రరేచన కారిగా పేర్కొన్నాడు. చరకుడు శ్యామా త్రివృత్ తీక్ష్ణగుణము కలదిగా వర్ణిస్తూ "శస్యతే బహుదోషాణాం క్రూర కోష్ఠాశ్చ యే నరాః" క్రూర కోష్ఠులకు, ఎక్కువ దోషములు గలవారికి హితమైనదిగా వర్ణించెను. చక్రపాణి "శ్యామా త్రివృత్కల్పం" అను అధ్యాయముపై వ్యాఖ్యానిస్తూ అరుణమూల త్రివృత్ ఉత్కృష్టమైనప్పటికి, శ్యామా త్రివృత్ వెంటనే దోషములను పోగొట్టు గుణము కల్గియుండుటచే అధ్యాయమునకు ఆ పేరు పెట్టబడినది యని వివరించెను. చరకుడు సుఖ విరేచన ద్రవ్యములలో త్రివృత్ శ్రేష్ఠమైనదిగా పేర్కొనెను. ప్రస్తుతము బజారునందు తెల్లతెగడ అను పేరుతో లభ్యమగుచున్న ద్రవ్యము 'మార్సిడీనియా' (మూర్వా) ప్రజాతి మొక్క మూలముగా గుర్తించబడినట్లు ఠాకూర్ బలవంత్‌సింగ్‌గారు వ్యాఖ్యానిస్తూ, శ్యామా లేదా మహా-త్రివృత్ అనెడి మొక్క గుర్తింపు ఇంకా చేయబడ లేదని "గ్లాసరీ ఆఫ్ వెజిటబుల్ డ్రగ్స్ యిన్ బృహత్రయీ" అను గ్రంథమునందు పేర్కొనినారు.

తెలుగు : తెగడ, హిందీ : నిశోథ, బెంగాలీ . తేవుడీ, మరాఠీ : నిశోత్తర, కన్నడం : తిగడె, గుజరాతీ . నశోత్తర.

**లాటిన్ నామము :**

ఒపర్క్యులినా టర్పెథమ్ లిన్నెయస్ సిల్వమాన్సో (operculina turpethum (linn) silvamonso)

**కుటుంబము :**

కన్వాల్వులేసీ (Convolvulaceae)

ఇది సుమారు పదిమీటర్ల వరకూ పెరిగే బహువార్షికపు తీగ. ఈ తీగ కాండం త్రికోణాకారం లేదా నలుచదరంగా, గట్టిగా రెక్కలు కలిగి వుంటుంది. సామాన్య పత్రాలు హృదయాకారంలో గాని, అండాకారంలో గాని వుండి, ఏకాంతర విన్యాసంలో కణుపుకు ఒకటి చొప్పున అమరివుంటాయి. రక్షక పత్రాల సంఖ్య ఐదు. రక్షక పత్రావళి ఫలములో కూడా మందముగా వుంటుంది. ఆకర్షణ పత్రావళి సంయుక్తము, గరాటు ఆకారంలోవుంటుంది కేసరముల సంఖ్య ఐదు. కేసరదండము తంతుయుతము, పరాగకోశములు పెద్దవి. నిలువుగా మెలితిరిగి వుంటాయి. అండాశయము ద్విఫలదళ సంయుక్తము. కీలము తంతురూపము. కీలాగ్రము గోళాకృతిలో వుంటుంది. ఫలము గుళిక. ఫలాలు గుండ్రంగా రక్షక పత్రావళి మధ్యలో వుండి, పక్వానికి వచ్చినపుడు అడ్డంగా మధ్యకు రెండుగా బద్దలై పై భాగం పడిపోతుంది. విత్తనాలు గుండ్రంగా నల్లగా పెద్దవిగా వుంటాయి. ఈ మొక్కను గిచ్చితే పాలు వస్తాయి. మార్చి, డిసెంబరు నెలలందు పుష్పములు, ఫలములు కలిగియుండును.

ఈ మొక్క తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల్లో పెరుగుతుంది.

**రసాయనిక సంఘటన :**

దీని మూల త్వక్‌నందు సుగంధిత తైలము, టర్పీథీన్ (turpethin) అను గ్లూకోసైడ్ వుండును.

# చతురంగుల

**పర్యాయనామములు :**

రాజవృక్షము (వృక్షము లందు రాజు వలెనుండునది)

కృతమాల (దీని సువర్ణ వర్ణము గల పుష్పములతో మాలలు కట్టబడును (లేదా) మాలవలె కట్టబడినట్లుండు పుష్పములు గలది)

చతురంగుల (నాలుగు అంగుళముల పొడవుగ నుండు ఆకులను, కాయలను గలది)

దీర్ఘఫల (పొడవుగా నుండు ఫలము కలది)

ఆరగ్వధ (సమస్త రోగములను పోగొట్టునది)

ఔషధము అంతః పరిమార్జన మరియు బహి పరిమార్జన అను భేదము చేత రెండు విధములుగా యుండును. చరకుడు సూత్రస్థానము మూడవ అధ్యాయము నందు కుష్ఠహర లేపములు వర్ణిస్తూ దానికి ఆరగ్వధయ అధ్యాయమని పేరిడినాడు. చరకుడు ఖదిరను కుష్ఠహర ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా పేర్కొనినప్పటికీ (సూ. స్థా-25) ఈ అధ్యాయమునందు ఆరగ్వధమునకు శ్రేష్ఠస్థాన మొసగినాడు. దీనికి కారణము కుష్ఠహర బహిపరిమార్జన ఔషధములలో ఆరగ్వధము శ్రేష్ఠమైనది. చరకుడు మృదు విరేచన ద్రవ్యము లందు ఆరగ్వధమును శ్రేష్ఠముగా పేర్కొనెను. ఆరగ్వధమను పేరుతో గ్రహింపబడుచున్న వృక్షము యొక్క అంగప్రత్యంగ వివరణ ఈ క్రింద వర్ణింపబడుచున్నది.

తెలుగు / ప్రాంతీయ నామము : రేలచెట్టు, హిందీ : అమలతాస, బెంగాలి : సోన్దాలీ, మరాఠీ బాహవా, గుజరాతి గరమాలో

**లాటిన్ నామము :**

కేసియా ఫిస్టులా లిన్నెయస్ (Cassia fistula linn.)

**కుటుంబము :**

సిసాల్పినియేసీ (**Cesalpiniaceae**)

ఇది సుమారు 8 మీటర్ల ఎత్తు వరకు పెరిగే వృక్షము. ఈ వృక్షము యొక్క చాలా భాగాలు మృదులంగా ఉంటాయి. పత్రాలు త్వివక్షవలె సంయుక్త పత్రాలు,

పత్రకాలు 2 నుండి 12 వరకూ వుంటాయి. అండాకృతిలో ఋజు ఉపాంతము. తీవ్రాగ్రము కలిగి ఉంటాయి. పసుపు రంగు పుష్పాలు అనిశ్చిత పుష్ప విన్యాసంలో (Raceme) అమరి ఉంటాయి. పుష్ప విన్యాస గుత్తులు పత్రాలకన్నా పొడవుగా వ్రేలాడుతూ ఉంటాయి. పుష్పాలు వృంతయుతము, ద్విలింగకములు, పాక్షిక సౌష్ఠవయుతములు. రక్షక పత్రాలు మృదులము, త్వరితంగా రాలిపోతాయి. ఆకర్షణ పత్రాలు ఉప అండాకృతిలో ఉంటాయి. ఫలము ద్వివిదారకము, గుండ్రముగా పొడవుగా ఉంటుంది. సుమారు 30-60 సెం. మీ. పొడవు, రెండు సెం. మీ, లావు ఉంటాయి. దాని యందు 25-100 బీజములు ఉండును. అపక్వావస్థలో ఆకు పచ్చటి వర్ణము, పండిన ఫలము కృష్ణవర్ణము కల్గి వుంటాయి ఈ చెట్టు మ్రాను ఎఱుపు, గోధుమ రంగుతో గట్టిగా ఉంటుంది. మార్చి ఏప్రిల్ మాసంలో ఆకులు రాలి తరువాత పువ్వులు వచ్చు.

ఈ వృక్షము ఆంధ్రప్రదేశ్ అంతటా పెరుగుతుంది.

రసాయనిక సంఘటన :

ఫలమజ్జ యందు ఏంథ్రోక్వినోన్, కాల్షియం ఆక్సలేట్, పెక్టిన్ మొదలగు పదార్థములు, కాండత్వక్‌నందు 10-20% టానిన్ యుండును.

# తిల్వక

**పర్యాయనామములు :**

పట్టికాలోధ్ర, స్థూలవల్కల (దళసరిగా నుండు పట్టనుగలది)
జీర్ణపత్ర (చినిగి యుండు ఆకులు గలది)
బృహత్పత్ర (పెద్ద ఆకులు గలది), లాక్షా ప్రసాదన, క్రముక, పట్టీ,
శావర లోధ్ర, తిల్వ, తిరీట, గాలవ (నేత్ర స్రావమును పోగొట్టునది)

భావ మిశ్రుడు శావరలోధ్ర, పట్టికాలోధ్ర అను రెండు భేదములను వర్ణిస్తూ, రెండింటి గుణకర్మలు ఒకే విధముగా యుండునని పేర్కొనెను. శావరలోధ్రకు 'తిల్వ' శబ్దమును ప్రయోగించెను. చరకుడు కల్పస్థానము (అ. 9) నందు తిల్వక మూలము యొక్క బాహ్యత్వక్ విరేచనకర్మకు ఉపహరించెను. డల్హణుడు తిల్వకమును గూర్చి చర్చిస్తూ 'తిల్వకమన లోధ్రమునే గ్రహించవలయు'నని వ్రాసి కొంతమంది లోధ్రాకారముగల్గి, ఎఱ్ఱటి పట్ట, పెద్ద పత్రములు గలిగి విరేచన కర్మ కలిగి యున్నదిగా వర్ణించారని పేర్కొనెను. నిఘంటువులందు లోధ్రకు గ్రాహీ కర్మ పేర్కొనబడినది. అందుమూలమున తిల్వకము యొక్క గుర్తింపు సందిగ్ధముగా యున్నది.

తెలుగు లొద్దుగ చెట్టు, హిందీ లోద, గుజరాతి . లోధర, బెంగాలి, మరాఠీ, కన్నడ లోధ, లోధ్ర.

**లాటిన్ నామము :**

సింప్లోకాస్ రెసిమోసా రాక్స్‌బర్గ్ (Symplocos racemosa Roxb)

**కుటుంబము :**

సిమ్ప్లొకేసి (Symplocaceae)

ఇది సుమారు ఆరు-ఏడు మీటర్ల ఎత్తు వరకు పెరిగే చిన్న వృక్షము సామాన్య పత్రాలు కణుపు ఒకటి చొప్పున ఏకాంతరంగా అమరి ఉంటాయి. పత్రాలు వర్తులాకారంలో బల్లెంగా ఉంటాయి. పత్ర వృంతము 5-6 మి. మీ. పొడవు ఉంటుంది. తెల్లగా చిన్న పుష్పాలు అనిశ్చిత పుష్ప విన్యాసంలో అమరి ఉంటాయి. పుష్ప విన్యాస వృంతము 4-8 సెం. మీ. పొడవు వుంటుంది. పుష్ప

పుష్పాలు 0.5 సెం మీ. పరిమాణంలో అండాకృతిలో కేశయుతమై వుంటుంది. లఘు పుష్ప పుష్పాలు చిన్నవిగా అండాకృతిలో ఉంటాయి. పుష్పాలు సంపూర్ణము, ద్విలింగకము, అండకోశపరికము, రక్షక పత్రాలు ఐదు, సంయుక్తము, రక్షక పత్రావళి గొట్టం లఘుకేశయుతమై ఉంటుంది. ఆకర్షణ పత్రాలు ఐదు. ఆకర్షణ పత్రాలు అడుగు భాగాన కలిసి ఉంటాయి. ఆకర్షణ పత్రావళి 5 సెం. మీ. పొడవు వుంటుంది. కేసరాలు అసంఖ్యాకము. కేసరాలు 115 వరకు ఉండవచ్చు. అండకోశము ద్విఫలదళసంయుక్తము. అండాశయము నిమ్నము. కీలము తంతు రూపము కీలాగ్రము శీర్షాకృతిలో వుంటుంది ఫలము టెంకెగల ఫలము. ఫలము 5 సెం.మీ. పొడవు, 3 సెం.మీ. వెడల్పు కలిగి మృదులంగా ఉంటుంది. రక్షక పత్రావళి ఫలమును అంటి పెట్టుకుని ఉంటుంది

ఈ వృక్షము ఉత్తర, తూర్పు భారతదేశంలోని ఛోటా నాగపూర్, అస్సాం రాష్ట్రిలలో విరివిగా పెరుగుతుంది

## రసాయనిక సంఘటన :

దీని త్వక్ నందు లాట్యురిన్ (Loturin), కొలాట్యురిన్ (Colloturine), లాట్యురిడిన్ (Loturidine) అను ఆల్కలాయిడ్లు యుండును.

ఉత్తర భారతదేశమున Symplocos crataegoides Buch Ham. అనెడి వృక్షమును కూడా లోధ్ర (పఠానీలోధ్ర)గా గ్రహిస్తున్నారు.

# సుధా

**పర్యాయ నామము :** సుధా, గుడా, సేహుండ, స్నుహీ

1. తెలుగు . ఆకుజెముడు, హిందీ : థూహర్, గుజరాత్ : థోర, తమిళ, కర్నా, మళ : ఇలైకల్లి.

**లాటిన్ నామము :**

యుఫోర్బియా నిరిఫోలియా (E. nerıfolıa)

**కుటుంబము :**

యుఫోర్బియేసి · (Euphorbıacee)

ఇది సుమారు 6 మీటర్లు ఎత్తు పెరిగే రసభరిత చిన్నవృక్షము. ఈ వృక్ష శాఖలు అయిదు కోణాలవలె వుండి, ఆ కోణాల వద్దనుండి జంట ముండ్లు వస్తాయి. పత్ర పుచ్ఛాలు ముళ్ళుగా (Stipular Thorns) మారి ఉంటాయి. పత్రాలు ప్రతి జంట ముండ్లకు ఒకటి చొప్పున విపరీత అండాకారంలో గానీ, విపరీత అండాకార-దీర్ఘచతురస్రాకారంలోగానీ వుంటాయి. పత్రాలు త్వరగా రాలిపోతాయి. స్త్రీ, పురుష పుష్పాలు పరిపత్ర పుష్పావళిలో అమరివుంటాయి. పరిపత్ర పుష్పాలు సమపురంగులో ద్విశాఖ చెందిన నిశ్చిత పుష్పవిన్యాసంలో అమరి వుంటాయి. పరిపత్ర పుష్పావళి తమ్మెలు గుండ్రంగాగానీ, హృదయాకారంలోగానీ ఉంటాయి. ఫలము గుళిక. ఫలము విశాలంగా మూడు నొక్కులు కలిగి ఉంటుంది.

ఈ వృక్షము ఎక్కువగా రాతి ప్రదేశాలలో పెరుగుతుంది. ఈ మొక్కను బెంగాల్ రాష్ట్రంలోను, శ్రీలంక దేశంలోను పండిస్తారు.

యుఫోర్బియా నివులియా బుచనాన్ హామిల్టన్ (Euphorbia nıvulia Buch Ham) అనే మొక్కను కొందరు పత్ర స్నుహీగా గ్రహిస్తున్నారు. దీని కొమ్మలు గుండ్రంగా ఉంటాయి. ఇది ఆంధ్ర ప్రాంతంలో కృష్ణా, నెల్లూరు, కడప జిల్లాలలో ఎక్కువగా పెరుగుతుంది.

2. తెలుగు : పెద్దజెముడు, హిందీ : అనగాలసేహుండ్, బెంగాలి : మనసా సిజ్, మరాఠీ : థోర్, మళయాళం : ఇలక్కల్లి

**లాటిన్ నామము :** యుఫర్బియా తిరుకల్లి లిన్నెయిన్ (Euphorbia tirucalli Linn.)

**కుటుంబము :** యుఫర్బియేసి (Euphorbiaceae)

ఇది అరు మీటర్ల ఎత్తువరకు పెరిగే రసభరిత వృక్షము. పత్రాలు సన్నగా, కోలగా అభిముఖంగా అమరి ఉంటాయి. పత్రాలు త్వరగా రాలిపోతాయి. స్త్రీ పురుష పుష్పాలు పరిపత్ర పుష్పావళి (Involucre) లో అమరి ఉంటాయి. ఫలము గుళిక. ఫలాలు శనగ గింజ పరిమాణంలో, ఎండినపుడు మూడు భాగాలుగా విడిపేతాయి.

ఈ మొక్క భారతదేశంలో చాలాచోట్ల పెంచబడుచున్నది. Euphorbia antiquorum Linn. Euphorbia trigona Haw. (మూడు ధారల జెముడు), Euphorbia royleana Bioss అను స్నుహీ భేదములుగా గ్రహిస్తున్నారు.

# సప్తలా

ఇది సందిగ్ధ ద్రవ్యము. చాలామంది సీకాకాయ (Acacia concinna D. c) ను సప్తలా గ్రహిస్తున్నారు. యుఫోర్బియా డ్రాకంకులోయిడిస్‌ను సప్తలాగా గ్రహించాలని శ్రీ జాపాలాల్‌గారు పేర్కొన్నారు.

**తెలుగు/ప్రాంతీయనామము.**

తెలుగు : సీకాయ, షీకాకాయ, హిందీ-శికాకాయీ. బెంగాల్-వనరీ, మరాఠీ శికేకాయీ, గుజరాతీ-చకాఖాయీ, తమిళం-శీయక్కాయ్, కన్నడ-శిగె.

**లాటిన్ :**

అకేసియా సిన్యుయేటా (లౌరిరో) మెరిల్ (Acacia sinuata (Lour.) Merr). (syn. Acacia concinna)

**కుటుంబము :**

మైమోసేసి (Mimosaceae).

ఇది 5-6 మీటర్ల పొడవు పెరిగే బహువార్షికపు పొద. పులిగోరువంటి చిన్ని ముండ్లు ఉంటాయి. పత్రాలు కణుపు ఒకటి చొప్పున ద్విపక్షవత్ సంయుక్తమై 10-25 సెంటీమీటర్ల పొడవు ఉంటాయి. ఆకు ఒక్కొంటికి 10-20 జతల పత్రకాలు నూగుతో ఉంటాయి. పుష్పాలు లేత పసుపుపచ్చని బంతుల్లా అమరిన గుత్తులకు వస్తాయి. ఫలాలు చింతకాయల్లా ఉండి 7-10 సెంటీమీటర్ల పొడవుతో 6-10 వరకు విత్తనాలు గల్గి ఉంటాయి. గింజల మధ్య నొక్కినట్లు ఉంటుంది.

**రసాయనిక సంఘటన :**

ఫలమునందు సపోనిన్, మాలిక్ ఆసిడ్, గ్లూకోజ్ గలవు.

## శంఖినీ

చరకుడు శంఖినికి యవతిక్తా అను పర్యాయ నామము పేర్కొనగా వ్యాఖ్యాన కారులు శంఖినీ ని యవతిక్తా భేదముగా కొన్నిచోట్ల పేర్కొనిరి. శ్రీబాపాలాల్ యవతిక్తా పేరుతో కాలమేఘ [ఆన్‌డ్రోగ్రాఫిస్ పానిక్యులాటా]ను గ్రహించవలెనని పేర్కొనెను. దీనినే తెలుగులో నేలవేము అందురు. కాని దింటెనను శంఖినీగా గ్రహించుట సబబుగా యుండును.

**ప్రాంతీయ నామములు :**

తెలుగు-దింటెన, గంటెన, హిందీ-కోయల, కాలీజర, బెంగాలీ-అపరాజితా, మరాఠీ- గోకర్ణీ, కాజలీ, గోకర్ణ, పంజాబీ-ధనస్తర, గుజరాతీ-గరణీ, కన్నడ- శంఖపుష్ప, గిరికర్ణికే, తమిళం- కాక్కణకోటీ, మలయాళం-శంఖపుష్పమ్.

**లాటిన్ నామము :**

క్లైటోరియా టెర్నాటియా లిన్నెయస్ (clitoria ternatea Linn)

**కుటుంబము :**

ఫాబేసీ (Fabaceae).

ఇది రెండు మీటర్లనుండి పది మీటర్ల వరకు పెరిగే బహువార్షికపు తీగ. పత్రాలు కణుపుకు ఒకటి చొప్పున పక్షవత్ సంయుక్తము. పత్రకాలు అండాకృతి కలిగి ఐదు లేదా ఏడు ఉంటాయి. పుష్పాలు తెల్లగా, నీలంగా లేదా ఊదారంగులో ఉంటాయి. పుష్పాలు ద్విలింగములు. ఫలాలు తప్పడిగా ఆరేడు సెంటీమీటర్ల పొడవు దాదాపు ఒక సెంటీమీటరు వెడల్పు ఉంటాయి. ఇందు 8-10 అండాకారపు బీజాలుంటాయి. ఎండినప్పుడు నిలువుగా విడతాయి. ఈ మొక్క ఆంధ్రప్రదేశ్ అంతటా విరివిగా లభిస్తుంది.

**రసాయనిక సంఘటన :**

దీని మూలమునందు స్టార్చ్, టానిన్‌లు, బీజమునందు తైలము గలవు.

# దన్తీ

**పర్యాయనామములు :**

దన్తీ : (ఇది అర్శస్సు, కుష్ఠము మొదలగు వ్యాధులను నష్టపరచునది లేదా ఏనుగు దంతము వంటి మూలము గలది)

నికుంభ : (కుష్ఠము, కండు మొ॥ రోగముల నష్టపరచి క్రొత్త చర్మమును జనింపచేయునది)

ఉదుంబర పర్ణీ, ఏరండఫలా.

చరకుడు దన్తీ, ద్రవన్తీ కల్పం (క.12) అను అధ్యాయమునందు దన్తీ, ద్రవన్తీలతో అనేక విరేచన యోగములను వర్ణించి యున్నాడు. ఉదుంబర పర్ణీ, నికుంభ, ముకూలక అను పర్యాయ నామములు దన్తీకు, చిత్ర, న్యగ్రోధి, మూషికాహ్వయ అను నామములు ద్రవన్తీకు పేర్కొనెను. చరకుడు గ్రాహ్య దన్తీ, ద్రవన్తీ మూల లక్షణములు వర్ణిస్తూ "శ్యామతామ్రాణి" అని పేర్కొనెను. చక్రపాణి దీనిపై వ్యాఖ్యానిస్తూ "దన్త్యాఃశ్యామాని ద్రవన్త్యాః తామ్రాణి" అని వివరించెను. దీనిని బట్టి దన్తీ మూలము శ్యామ వర్ణము, ద్రవన్తీ మూలము తామ్ర వర్ణము కలిగి యుండునదిగా గ్రహించవచ్చును. భావమిశ్రుడు దన్తీ ద్వయమను పేరిట లఘుదన్తీ, బృహదన్తీ (ద్రవన్తీ)లను వర్ణించెను. మన ప్రాంతమునందు దన్తీ పేరుతో నేపాళపు గింజలు గ్రహించడం వాడుకలో యున్నది. కాని ఇది సమంజసము కాదు. దన్తీ యొక్క వికాశిత్వమును పోగొట్టుట కొరకు పిప్పలీ తేనె కలిపి నూరి ఆ మూలమునకు లేపము చేసి కుశములతో చుట్టి స్వేదనము చేసి తీసి ఎండలో ఎండించవలెనని పేర్కొనెను. భావమిశ్రుడు జయపాల (నేపాళము)ను దన్తీ బీజము, తింతిడీఫల అను నామములలో వర్ణించెను. అదే విధముగా క్షుద్ర (లఘు) దన్తీ ఫలము యొక్క గుణకర్మలు కూడా వేరుగా వర్ణించినాడు. దన్తీ బాలియోస్పెర్మమ్ మోన్టానమ్ (**Baliospermum montanum Muell**) గాను, జయపాలను క్రోటన్ టిగ్లియమ్ (Croton tıglium Lınn) గాను గ్రహింపబడుచున్నాయి. ద్రవన్తీ ద్రవ్య నిర్ణయములో కొంత సందిగ్ధతయున్నది. కొంతమంది విద్వాంసులు వ్యాఘ్రైరండ (**Jatropia curcas**)ను ద్రవన్తీగా గ్రహించుచున్నారు. కాని ఈ వృక్షము యొక్క మూలమునందు రేచక గుణము కలదని ప్రయోగించినట్లు ఆధారములు లేవు.

దీనిపై ఆచార్య యాదవజీ విమర్శిస్తూ భావ ప్రకాశకారుడు దన్తీ ద్వయ వర్ణన తరువాత వరుసగా క్షుద్ర దన్తీ ఫలము, జయపాల (దన్తీ బీజ)ములను వర్ణించుటచే ద్రవన్తీ అనెడి ద్రవ్యమును క్రోటన్ టిగ్లియమ్ లిన్ (Crotonliglium Linn)గా గ్రహించవలెనని వివరించినారు. చరక సంహిత యందు నాగదన్తీ అను మరియొక ద్రవ్యము కూడా పేర్కొనబడినది.

తెలుగు . కొండ ఆముదము - హిందీ : దన్తీ, మరాఠీ : దాంతి
బెంగాలీ ~~యన్తి, తమోకం~~: నాగదన్తీ, గుజరాతీ: దన్తీ

**లాటిన్ నామము :**

బాలియోస్పెర్మమ్ ఆక్సిలేర్ బ్లూమ్ (Baliospermum axillare Blum) (Syn. Baliospermum montanum)

**కుటుంబము :**

యుఫోర్బియేసీ (Euphorbiaceae)

ఇది సుమారు 2 మీటర్ల ఎత్తు వరకు పెరిగే చిన్న పొద. శాఖలు వేరు భాగం నుండి బయలుదేరుతాయి. సామాన్య పత్రాలు కణుపుకు ఒకటి చొప్పున ఏకాంతరంగా అమరి ఉంటాయి. కాండం అడుగు భాగాన వున్న పత్రాలు పెద్దవిగా అండాకారంలో గానీ, దీర్ఘ చతురస్రాకారంలోగాని వుండి, పొడవైన పత్రవృంతము కలిగి ఉంటాయి. పత్ర పుచ్ఛాలు రెండు గ్రంథులుగా మారి వుంటాయి. కాండం పై భాగమున వున్న పత్రాలు చిన్నవిగా బల్లెం ఆకారంలో వుండి, పత్రపీఠం వద్ద రెండు గ్రంథులు కలిగి ఉంటాయి. పుష్పాలు ఏకలింగకాలు. స్త్రీ, పురుష పుష్పాలు ఒకే మొక్కమీద (Monecious) ఉంటాయి. స్త్రీ, పురుష పుష్పాలు అనిశ్చిత పుష్ప విన్యాసం (Racence)లో అమరి ఉంటాయి. పుష్ప విన్యాసవృంతం పై భాగంలో పురుష పుష్పాలు, క్రింది భాగంలో స్త్రీ పుష్పాలు అమరి ఉంటాయి. పుష్ప పుచ్ఛాలు చిన్నవిగా ఉంటాయి. పురుష పుష్పాలలో రక్షక పత్రాలు 4-5 వరకు వుంటాయి. రక్షక పత్రాలు వర్తులాకారంలో వుంటాయి. ఆకర్షణ పత్రావళి ఉండదు. చక్రము (Disc) గ్రంథులు కలిగి ఉంటుంది. కేసరములు 15–20 వరకు ఉంటాయి. పరాగ కోశాలు ఉపమూత్ర పిండాకృతిలో ఉంటాయి. స్త్రీ పుష్పాలు ఉపవృంతయుతము. ఐదు రక్షక పత్రాలు అండాకృతిలో చివర సూదియైన తమ్మెలుగా ఉంటాయి. చక్రము పొట్టిగా గిన్నెవలె గుండ్రని దంతాలు కలిగి ఉంటుంది. అండాశయము

త్రిఫలదళ సంయుక్తము. త్రిబిలయుతము. ఒక్కొక్క బిలంలో ఒక్కొక్క అండము ఉంటుంది. కీలములు లావుగా ఉండి రెండుగా చీలుతాయి. కీలాగ్రము మృదులంగా ఉంటుంది. ఫలము గుళిక. మూడు ఫలాంశాలు (Cocci)గా విడిపోతుంది. విత్తనాలు అండాకృతిలో ఉంటాయి.

ఈ మొక్క కర్నాటక, పశ్చిమ తీర ప్రాంతాలలోను, బెంగాల్, బీహార్ లందు పెరుగుతుంది.

## రసాయనిక సంఘటన :

దీని మూలమునందు పిండి పదార్థము (Starch), బీజములందు తైలము ఉండును.

# ద్రవన్తి

**పర్యాయ నామములు :**

జేపాల, దన్తీబీజ, తింతిడీ ఫలం.

తెలుగు నేపాళము, హిందీ : జమాల్ గోటా, బెంగాలీ : జయపాల, మరాఠి : జయపాల, గుజరాతీ నేపాళో, పంజాబీ : జపోలోటా.

**లాటిన్ నామము :**

క్రోటాన్ టిగ్లియమ్ లిన్నెయస్ (croton tiglium Linn.

**కుటుంబము :**

యుఫోర్బియేసీ (euphorbiaceae)

ఇది ఒక చిన్న నిత్యహరిత వృక్షము. అండాకారంలో వున్న సామాన్య పత్రాలు పొడవైన వృంతాలు కలిగి వుంటాయి. చిన్నవైన స్త్రీ, పురుష పుష్పాలు ఒకే వృక్షంమీద, అనిశ్చిత పుష్ప విన్యాసంలో అమరివుంటాయి. పురుష పుష్పం వృంతం మీద నక్షత్రాకార కేశాలు వుంటాయి. ఫలము గుళిక. ఫలము తెల్లగా మూడు కోణాలతో విపరీత అండాకారంలో వుంటుంది. విత్తనాలు దీర్ఘచతురస్రాకారంలో వుంటాయి.

ఈ వృక్షము భారతదేశంలో బెంగాల్, అస్సాం రాష్ట్రాలలో పెరుగుతుంది.

కల్పస్థానమునందు వమన విరేచన ద్రవ్యములలో కల్కము, కషాయము, ఘృతము మొదలగు అనేక కల్పనలు పేర్కొనబడినవి. ఆ కల్పనల యొక్క పరిభాషా పరిచయము వివరింపబడుచున్నది.

**స్వరసము :**

1) ఓషధి ద్రవ్యమును పచ్చిగ నున్నప్పుడే పురుగులు మున్నగువానిని లేకుండా విదిలించి దంచి గుడ్డలోవేసి పిండినచో క్రిందకు స్రవించు రసము స్వరసమని అందురు.

2) ఎండిన ఓషధి చూర్ణమును ఒక కుడవము (192 గ్రా) గ్రహించి, అందు రెండింతలు నీరుపోసి ఒక రోజంతయూ యుంచి మరునాడు ఆ ఉదకమును వడిగియగట్టిన దానిని కూడా స్వరసమందురు.

3) పచ్చిగనుండు ఓషధ ద్రవ్యములు దొరకని యెడల ఎండిన ద్రవ్యము గ్రహించి దానికి ఎనిమిదిరెట్లు నీరుపోసి నాలుగువ పాలు మిగులునట్లు కాచవలయును.

తేనె, శర్కర, బెల్లము, క్షారములు, జీలకఱ్ఱ, సైంధవ లవణము, నెయ్యి, నూనె మొదలగు వానిని స్వరసమున చేర్చునపుడు కోల ప్రమాణము చేర్చవలెను.

స్వరసము గురుత్వము గల్గి యుండుటచే అర్ధపలము సేవించవలెను. కషాయము కాచిన స్వరసము లేదా రోజంతయు నీటియందు నానవైచిన స్వరసము ఒక పలము సేవింపదగును.

కషాయము : కషాయ ద్రవ్యము నొక పలము గ్రహించి మట్టికుండలో నుంచి అందు పదునారు పలముల నీరుపోసి మందాగ్నిచే ఎనిమిదవపాలు మిగులునట్లు కషాయముగాచి దానిని వడియగట్టి కొంచెము ఉష్ణముగ నుండునపుడే రోగిచే త్రాగించవలెను. భుజించిన ఆహారము జీర్ణమైనదని తెలిసికొనిన పిదప రెండు పలముల ప్రమాణములో కషాయమును సేవించవలెను. ఈ కషాయమునకు శృతము, క్వాథము, కషాయము, నిరూహ్యమని పేరు.

కషాయము కుండలో కాచవలయును. అట్లు కాచునెడ పైన మూతవేయదగదు. కషాయమునందు శర్కర గలుపవలసి యుండునేని వాతరోగమునందు

కషాయమునకు నాల్గవభాగము, పిత్తరోగమునకు ఎనిమిదవ భాగమును, శ్లేష్మ రోగమునకు పదియారవ భాగము చేర్చవలయును. తేనె జేర్చునెడ, వాతరోగము నందు కషాయమునకు పదియారవభాగము, పిత్తరోగమునందు నెనిమిదవ భాగము, శ్లేష్మ రోగమునందు నాల్గవ భాగమును కలుపవలెను. పాలు, నెయ్యి, బెల్లము, నువ్వులనూనె, మూత్రము, కల్కము, చూర్ణము, నితరమగు ద్రవ ద్రవ్యములు వీనిని కర్ష ప్రమాణములో చేర్చవలయును. జీలకర్ర, గుగ్గిలము, యవక్షారము, సైంధవలవణము, శిలాజతు, ఇంగువ, త్రికటుకములు వీనిని కషాయమునందు చేర్చు నెడ శాణ పరిమాణంలో కలుపవలెను. పాలు, నెయ్యి, బెల్లము, నువ్వులనూనె, మూత్రము, కల్కము, చూర్ణము, మిగిలిన ద్రవద్రవ్యములను కర్ష ప్రమాణముగా చేర్చవలెను.

**సూచన :** మృదు ద్రవ్యములయినచో ద్రవ్యము ఒక భాగము తీసికొని దానికి 4 రెట్లు నీరుపోసి కషాయము కాచవలెను. కఠిన ద్రవ్యములయినచో 8 రెట్లు నీరును, అత్యంత కఠిన ద్రవ్యములయినచో 16 రెట్లు నీరును పోయవలెను.

**ప్రమథ్య :** పలప్రమాణము ద్రవ్యములను ముద్దగా నూరి ఎనిమిదింతలు నీరుపోసి కషాయము కాచిన (రెండు పలములు మిగులునట్లు) దానిని ప్రమథ్యా అందురు. దానిని రెండు పలముల ప్రమాణములో సేవించవలెను.

**యవాగు :** ఔషధ యోగ్య ద్రవ్యములను నాలుగు పలములు గ్రహించి నలియగొట్టి అందు 64 పలములు నీరుపోసి సగము మిగులునట్లు కాచి వడియగట్టి అందు బియ్యము మొదలగు యోగోక్త ద్రవ్యములను చేర్చి గట్టియగు నటుల మరల కాచిన దానికి యవాగు అనిపేరు.

**యూష :** ఒక ప్రస్థము (64 తులములు) నీళ్ళయందు సాధారణ ద్రవ్య ములను కల్కమును పల ప్రమాణము కలిపి కొంచెము చిక్కగా కాచిన దానిని యూష అందురు. సొంటి, పిప్పళ్ళు వీనిని కల్కము చేసి కలుపునపుడు అర్థ కర్ష ప్రమాణము కలుపవలెను.

**ఉష్ణోదకము :** ఎనిమిదవపాలు మిగులునట్లుగాని, నాల్గవపాలు మిగులునట్లు

గాని, సగము మిగులునట్లుగాని, తెర్లునట్లుగాని కాచబడిన ఉదకమును ఉష్ణోదక మందురు.

**క్షీరపాకము :** ద్రవ్యమునకు ఎనిమిది రెట్లు పాలు, పాలకు నాలుగురెట్లు ఉదకము పోసి, పాలు మిగులునట్లు కాచిన దానిని క్షీరపాక మందురు.

**విలేపి :** ద్రవ్యమునకు నాలుగురెట్లు నీళ్ళు పోసి గట్టిగను, జిగురుగను కాచిన దానిని విలేపి అందురు.

**పేయా :** ద్రవ్యమునకు పదునాలుగురెట్లు నీళ్ళుపోసి పలుచగను, కొంచెము జిగురుగను కాచిన అది పేయ అందురు. అదియే కొంచెము గట్టిగ నుండిన యూష అనబడును.

**సిద్ధమండము :** ద్రవ్యమునకు పదునాలుగు భాగములు నీళ్ళుపోసి బిరుసుగ నుడికించి గంజి వార్చుటనే సిద్ధమండము అందురు.

**ఫాంటము :** ఒక పలము ఔషధ ద్రవ్యమును మెత్తగ దంచి చూర్ణము చేసి ఒక కుండలో వైచి అందు ఒక కుడవము (4 పలములు) వేడినీరు పోసి బాగుగా కలిపి వడియగట్టిన దానిని ఫాంటమనియు, చూర్ణ ద్రవ మనియు చెప్పబడును. ఫాంటమును రెండు పలముల ప్రమాణములో సేవింపవలెను.

**మంథము :** ఒక కుండయందు నాలుగు పలముల చల్లటి నీరు పోసి అందు ఒక పలము ఔషధ ద్రవ్యమును చూర్ణము చేసి వేసి బాగుగ చిలికి వడియగట్టిన దానిని మంథమందురు.

**హిమము :** ఒక పల ప్రమాణము గల ద్రవ్యమును బాగుగా దంచి ఒక కుండలో వేసి అందు ఆరు పలములు నీరుపోసి బాగుగా కలిపి ఒక రాత్రియంతయూ అటులనే ఉంచి మరు దినమున ఉదయముననే ఆ నీరును వడియుగట్టిన దానిని హిమ మందురు. దీనినే శీత కషాయమని కూడా అందురు. రెండు పలముల ప్రమాణములో దీనిని సేవించవలెను.

**కల్కము :** పచ్చిగ నుండు ద్రవ్యములను మెత్తగ నూరియైనను, ఎండిన ద్రవ్యములను నీటిచే మెత్తగ నూరి ముద్దగ చేసిన దానిని ప్రక్షేపము, ఆవాపము, కల్కము అని అందురు. దీనిని కర్ష ప్రమాణములో సేవించవలెను,

**చూర్ణము :** చక్కగా ఎండిన ఔషధ ద్రవ్యములను దంచి చూర్ణము చేసి వస్త్రగాలిత మొనర్చిన దానిని చూర్ణమనియు, రజమనియు, క్షోదమనియు అందురు. ఇది కర్ష ప్రమాణము సేవించవలెను.

**మోదక :** గుటిక, వటి, మోదకము, వటిక, పిండి, గుడము, వర్తి అనునవి వటకమునకు పర్యాయనామములు. బెల్లము, చక్కెర, గుగ్గులు వీనిచే వటకములు చేయనెడ లేహ పాకముగా పచనముచేసి యందౌషధ చూర్ణమును కలిపి వటకములను చేయవలెను. లేనిచో జలము, పాలు, తేనె మొదలగు ద్రవద్రవ్యములనైనను చూర్ణములో గలిపి వటకము చేయవలెను. వటికలను కర్ష ప్రమాణములోనైనను, లేక రోగియొక్క బలానుసారముగ నైనను సేవింపవలెను.

**లేహకల్పన :** క్వాథాదులను చక్కెర పాకమువలె గట్టియగునట్లు కాచుటనే రసక్రియ అందురు. దీనికే అవలేహము, లేహమను పేర్లు గలవు. ఇందు చక్కెర చేర్చునెడ చూర్ణమునకు నాలుగింతలు, బెల్లమయినచో రెండింతలు, జలము, పాలు మొదలగు ద్రవద్రవ్యములయినచో చూర్ణమునకు నాలుగింతలు కలుపవలెను. అవలేహము చక్కగ పక్వమైనచో గరిటితో తీసిన తీగవలె వచ్చును. ఉండచేసి నీళ్ళలో వేసిన మునిగి విరిగి పోకుండా యుండును. చేతితో నలిపిన కఠినముగను, బంకగను మంచి వాసన, వర్ణము, రసముగల్గి యుండును. ఇవన్నియు సమ్యక్ లేహపాక లక్షణములు.

**స్నేహకల్పన :** ఘృతము, తైలము మొదలగు స్నేహ ద్రవ్యములను పక్వము చేయునపుడు కల్కము కంటె తైలాదులు నాలుగింతలును, పాలు మొదలగు ద్రవద్రవ్యములను తైలాదులకు నాలుగు రెట్లును గలిపి అందలి ద్రవ్యములును, కల్కమును ఇగురునట్లుచేసి తైలము లేదా ఘృతము మాత్రము మిగులునట్లు కాచి స్నేహ ద్రవ్యములను గ్రహింపవలెను. స్నేహ ద్రవ్యమును పక్వము చేయునపుడు పాలు, పెరుగు మొదలగు ద్రవద్రవ్యములను అయిదింటి కన్న అధికముగ చెప్పి యున్నచో ద్రవద్రవ్యములు స్నేహమునకు సమభాగముగ నుండవలెను. అటుగాక అయిదు ద్రవ్యములకన్న తక్కువగానున్న యెడల తైలాదుల కన్న నాల్గింతలు ద్రవద్రవ్యములను కలిపి ఘృత, తైలాది స్నేహములను కాచవలెను. తైలమును

పక్వము చేయునపుడు అందుగల కల్కద్రవ్యమును వ్రేళ్ళ మధ్య నలిపినచో అది వేలికంటుకొనక వత్తివలె నుండి స్నేహద్రవ్యమును నిప్పులో నుంచిన చిటచిట అను శబ్దము లేకున్నచో తైలము మొదలగు స్నేహ ద్రవ్యములు పక్వములైనవని తెలిసికొనవలెను. తైలము పక్వమగు సమయమున విశేషముగ నురుగు వచ్చిన మంచి సువాసన, వర్ణము, రసము కల్గును. ఘృతము పక్వమగునపుడు నురుగు నిలిచి మంచి వాసన, వర్ణము, రసము కల్గును. స్నేహపాకము మృదుపాకము, మధ్య పాకము, ఖరపాకము అను మూడు విధములుగ యుండును. ఇందలి కల్కద్రవ్యము కొంచెము ద్రవయుక్తముగ నుండినచో మృదు పాకమనియు, ద్రవవిహీనమై కోమల ముగ నుండినచో మధ్యమపాకమనియు, కొంచెము కఠినముగ నుండినచో ఖరపాక మని తెలిసికొనవలెను.

**ఆసవ - అరిష్టకల్పన :** ఉదకము మొదలగు ద్రవపదార్థము లందు ఔషధ ద్రవ్యములను గలిపి భాండమునందుపైచి దానిపై మూతబెట్టి చీలనున్న లేపముచేసి చాలాకాలముంచిన ఉత్కృష్టమైన ఔషధము తయారగును. ఇది అస వము, అరిష్టమని రెండు విధములు. అందు ఉదకము నందు ఔషధములను పక్వము చేయకనే పైచెప్పిన ప్రకారము సంధానపరిచి తయారుచేసిన దానిని ఆసవము అందురు. కషాయముగాచి అందు ఔషధ ద్రవములను వేసి సంధానపరిచి తయారు చేసిన దానిని అరిష్టమందురు అసవ, అరిష్టలను ఒక పల ప్రమాణము సేవించ వలెను. వీటిని తయారు చేయునపుడు జలము మొదలగువాని ప్రమాణము చెప్పక పోయినచో ఉదకాది ద్రవ పదార్థములను ఒక ద్రోణ ప్రమాణము గ్రహించి అందు ఒక తులాప్రమాణము బెల్లము గలిపి, బెల్లమునకు సగము తేనె పోసి, ఔషధ చూర్ణమును బెల్లమునకు పదియవపాలు వేయవలెను.

**శీధు :** అపక్వమైన చెఱుకురసము మొదలగు మధుర ద్రవపదార్థములచే సిద్ధమైన మద్యమ శీతరసశీధు అందురు. పాకము చేయించి సంధానపరిచి సిద్ధము చేయబడిన మద్యమును పక్వరసశీధు అందురు.

## సుర-ప్రసన్న-కాదంబరి-జగల-మేదక-సురాబీజము-వారుణి శుక్తము-సౌవీరకము-కాంజికము-సండాకి

తండులాదులను వండి మద్యము తయారుచేసిన దానిని సుర అందురు. సురయొక్క నురుగును ప్రసన్నమనియు, అందు గట్టిగ నుండు దానిని కాదంబరి అనియు అందురు. సుర అధోభాగము నుండెడి ద్రవభాగమును జగలమందురు. జలగము కంటె గట్టిగ యుండుదానిని మేదక మందురు. ఆ మేదకమును పక్వము చేసి అందు సారమును దీసిన పిదప మిగిలియున్న భాగమును సురాబీజమని, కిణ్వ మని అందురు.

తాటి కల్లు, ఈత కల్లు మొదలగువానిని సంధానపరచి చేయుదానిని వారు ణియనియు, కందమూలములు, ఫలములు, తైలము మొ॥వానిలో సంధానపరచి చేయుదానిని సూక్తమని అందురు చెడి పుల్లనైన మద్యమునుగాని, చెడిపుల్లగ నుండి మధుర ద్రవ పదార్థములైనను సంధానపరిచి సిద్ధము చేసినదానిని చుక్రమందురు. పచ్చియవలను నలియగొట్టి నీళ్ళలో వేసి సంధానపరిచి సిద్ధము చేసినదానిని తుషాంబు అందురు. యవలపై పొట్టు దీసి ఉడికించి అందు నీళ్ళు పోసి సంధానపరచి తయారుచేసిన దానిని సౌవీరకమని అందురు. ఉలవల యందైనను, బియ్యమునందైనను నీళ్ళుపోసి ఉడికించి గంజి వార్చి అందు సొంటి, ఆవాలు, జీలకర్ర మొదలగువానిని వేసి సందానపరచి సిద్ధము చేసిన దానిని కాంజికమని అందురు. ముల్లంగిని నీళ్ళలో పోసి ఆవాలు, సైంధవ లవణములు మొ॥ వానిని వేసి సంధానపరచి సిద్ధము చేయబడిన దానిని సండాకు అని అందురు.

ఆయుర్వేద శాస్త్రమున వర్ణింపబడిన మాన ప్రమాణములకు ఆయుర్వేదిక్ ఫార్మకోపియా కమిటీవారు సూచించిన మెట్రిక్ పద్ధతిలో గ్రహించవలసిన ద్రవ్య ప్రమాణములు ఈ క్రింద వివరింపబడుచున్నవి.

| | |
|---|---|
| 1 రత్తి లేదా గుంజ | = 125 మి.గ్రా. |
| 8 రత్తి లేదా గుంజలు (1 మాష) | = 1 గ్రా. |
| 12 మాషలు (1 కర్షములు లేదా తులము) | = 12 గ్రా. |
| 2 కర్షములు (1 శుక్తి) | = 24 గ్రా. |
| 2 శుక్తిలు (పలము) | = 48 గ్రా. |
| 2 పలములు (ప్రసృతి) | = 96 గ్రా. |
| 2 ప్రసృతులు (కుడవము) | = 192 గ్రా. |
| 2 కుడవములు (మానిక) | = 384 గ్రా. |
| 2 మానికలు (ప్రస్థము) | = 768 గ్రా. |
| 4 ప్రస్థములు (ఆఢకము) | = 3 కె.జి. 73 గ్రా. |
| 4 ఆఢకములు (ద్రోణము) | = 12 కె.జి. 288 గ్రా. |
| 2 ద్రోణములు (శూర్పము) | = 24 కె.జి. 576 గ్రా. |
| 2 శూర్పములు (ద్రోణీ) | = 49 కె.జి. 152 గ్రా. |
| 4 ద్రోణీలు (ఖారీ) | = 196 కె.జి. 608 గ్రా. |
| 100 పలములు (తులా) | = 4 కె.జి. 800 గ్రా. |